

బెల్లంకొండ రామదాసు

# కలికాలం

# కలికాలం

మూలం :
ఛార్లెస్ డికెన్సు

అనువాదం :
బెల్లంకొండ రామదాసు

**FIRST PRINTING EDITION : 1960 MARCH**

**DIGITAL EDITION : 11 th MARCH 2015.**

**SCANNED COPY DONATED BY : ANIL BATTULA.**

**UP-LOAD BY : BELLAMKONDA CHAKRADHAR.**

**FROM :**

SRI BELLAMKONDA RAMA RAYA KAVINDRULA TRUST

PRAKASH NAGAR , NARASARAOPET - 522 601.

Contact : bvlnckumar@gmail.com.

11 th MARCH 2015.



కీ॥శే॥ బెల్లంకొండ నరశింగరావు (కరణంగారు)
1914 - 1960 జమిందారు పమిడిపాడు సర్వా అగ్రహారం

# MY GRAND FATHER .

**CHAKRADHAR.**

# SRI BELLAMKONDA RAMA RAYA KAVINDRA TRUST

NARASARAO PET -522 601.



BELLAMKONDA VENKATA
SUBRAMANYA SARMA.



BELLAMKONDA
SRINIVASASARMA



BELLAMKONDA
CHAKRADHAR KUMAR.

# కలికాలం

మూలం :
ఛార్లెస్ డికెన్సు
అనువాదం :
బెల్లంకొండ రామదాసు

జనతా ప్రచురణాలయం
ఏలూరురోడ్ - విజయవాడ-2

# 1

"నా మటుకు నేను ఊహాగానాలను నమ్మే మనిషిని కాను. ఉన్న విషయాలను వున్నట్లుగా చూడడం నాతత్వం. వాస్తవ విషయాలకు రంగులు పులిమి లేనిపోని వ్యాఖ్యానాలు సాగించడమంటే నాకు పెద్ద చిరాకు. వాస్తవం! నూటికి నూరుపాళ్ళు వాస్తవం! అదీ నేను కోరేది. జీవితానికి అవసరమైనది కూడా వాస్తవమే. జీవితమనే తోటలో వాస్తవాలనే వృక్షాలనే నాటాలి. ఊహాగానాల కలుపుమొక్కలను విధ్వంసం చెయ్యాలి. జీవితాన్ని సమగ్రంగా తీర్చిదిద్దుకోవలెనంటే యింతకు మించిన సూత్రం మరొకటి లేదు. నా మటుకు నేను - నా పిల్లలకి యీ సూత్రాన్ని నూరిపోస్తాను. ఈ సూత్రంపై ఆధారపడి వారిని పెంచుతాను. అందుచేతనే నేను మిమ్మల్ని మరీ మరీ అర్థించేది ఏమంటే - వాస్తవాలను మరవకండి అని" —.

ఒక పిల్లల బడిలోని ఒక గది అది. సాధారణంగా బళ్ళో గదులు అదోలా వుంటాయి - ఆ గదులకు అలాంకారాలూ. ఆడంబరాలూ వుండవు. అలాగే వుంది యీ గదికూడా. అలాంటి యీ గదిలో ఒక వక్త పై వాక్యాలను ఘాటైన ధోరణిలో నొక్కి వక్కాణిస్తున్నాడు. ఇక ఆ వక్త ఎలా వున్నాడని అంటారా?

మనిషి మాంచి పొడుగరి. ఎత్తయిన నుదురు. గుహల్లాంటి కండ్లు. ఇహ అతను మాట్లాడే ధోరణి - అచ్చంగా ఒక నియంత. కొన్ని ఆజ్ఞలను జారీచేశినట్లుగా ఉన్నది. ఆ గదిలో ఆ పెద్దమనిషి, ఒక బడిపంతులు, మరోవ్యక్తి ఉన్నారు.

"ఈ భూలోకంలో - ఈవిధంగా జీవిస్తున్న మనకు కావలసింది వాస్తవ విషయాలు - అంతే. అంతకుమించి మనకు మరేం అవసరం లేదు.

# 2

ఆ ఉపన్యాసకుని పేరు ఏమిటీ అంటారా? అతనిపేరు థామస్ గ్రాడ్‌గ్రిండ్. గ్రాడ్‌గ్రిండ్ సామాన్యమైన వ్యక్తికాదు. మహా ఘటికుడు. రూపాయికి పదహారణాలూ లెక్కమనిషి. ఆవులిస్తే చాలు పేగులు లెక్కెట్టేస్తాడు. రెండు రెండ్లు నాలుగు - చస్తే అయిదుకాదు- మూడూకాదు - ఇలా లెక్కప్రకారం జీవితాన్ని గడిపే మహాశయుడాయన. థామస్ గ్రాడ్‌గ్రిండ్‌తో పోలిక పెట్టడానికి మనకు భూలోకం యావత్తూ చుట్టపెట్టినా మరోవ్యక్తి దొరకుడు.

థామస్ గ్రాడ్‌గ్రింప్ అంటే థామస్ గ్రాడ్‌గ్రిండ్ అన్నమాటే. అతనికి అతనే సాటి. జ్వరం కొలవడానికి డాక్టర్ దగ్గర థర్మామీటరు సర్వకాల సర్వావస్థలందున ఉన్నట్లుగా థామస్ గ్రాడ్ గ్రిండ్‌వద్ద మానవ స్వభావాన్ని కొలిచే యంత్రం ఏదో ఉండిఉంటుంది. అందు చేతనే ఆయన మనిషి అల్లంతదూరంలో కనుపిస్తే చాలు అతని స్వభావాన్ని ఇట్టే తూచినట్టుగా చెప్పేస్తాడు. 'మనిషి లోతుపాతును తెలుసుకోవడం కూడా బ్రహ్మవిద్యటోయ్? ఏముందీ? అంతా లెక్క. రెండు రెండ్లు నాలుగు - అన్నట్లే మనిషిని ఇట్టే తూచేయవచ్చు' - అంటాడు ఆయన. ఎక్కడకాని, ఎవరిముందుకాని, సభలోకాని, సన్మానంలో కాని, పెద్దల ముందుకాని, పిన్నలముందు కాని సాక్షాత్కరించే థామస్ గ్రాడ్‌గ్రిండ్ మహాశయుని స్వరూపం ఇదే. ఇప్పుడు, ఈనాడు, ఈ పాఠశాలలో, ఈ బాలబాలికల సమక్షంలో కూడా ఆ మహాశయుడు తన మామూలు అవతారంలోనే సాక్షాత్కరించాడు.

ఈ మహాశయుని ఉపన్యాసాన్ని వింటున్నది కేవలంగా పసి పిల్లలు. పాఠశాలలో చదువుకుంటున్న బాల బాలికలు. వారి చెవులకు ఆయన మాటలు ఉరుముల్లా వినిపిస్తున్నవి. ఆ మహా వాక్యాలలోని అంతరార్థాన్ని గ్రహించలేక వారు అనేక రకాలుగా ఆలోచించు కుంటున్నారు.

'20 వ నంబరు విద్యార్థిని - ఎవరా అమ్మాయి ? ఎక్కడుంది ? ఆ అమ్మాయి నామధేయం ?' - అన్నాడు గ్రాడ్ గ్రింద్ హఠాత్తుగా చెయ్యిచాచి.

'నేనండీ ఆ అమ్మాయిని. నా పేరు సిసీ జూప్ - అన్నది 20 వ నంబరు అమ్మాయి లేచి నిల్చుని. ఆ అమ్మాయి ముఖం సిగ్గుతో ఎఱ్ఱగులాబీ పూవులా కందిపోయింది.

'సిసీ అనేది ఒక పేరు కాదు. పేరు మార్చుకో. సిసీ లా అని పేరెట్టుకో' - అన్నాడు గ్రాడ్ గ్రింద్ మహాశయుడు.

'మా నాన్నారు నన్ను సి సీ అనే పిలుస్తారండి' - అన్నది ఆ అమ్మాయి. ఆ అమ్మాయి కంపిత కంఠస్వరంలో భయం బెదురూ ప్రస్ఫుటంగా కనుపించాయి.

'మీ నాన్నగారు నిన్ను అలా పిలవవచ్చు. కాని ఆయన నిన్ను అలా పిలవడం పొరబాటు ఆయనతో చెప్పు. సెసీలియా అని పిలవ మని చెప్పు. ఇంతకూ మరిచాను అడగడం - మీ నాన్నగారి వృత్తి ఏమి టన్నావు ?' - అన్నాడు గ్రాడ్ గ్రింద్.

'మా నాన్నాగారికి ఏదో పనండి - గుర్రాలతో సంబంధించిన పని.'

'ఉన్నమాటేదో సూటిగా చెప్పు. గుర్రాల జబ్బులు నయం చేసే పశువుల డాక్టరా ఏమిటి మీ నాన్నగారు ?'

అని గద్దించాడు గ్రాడ్ గ్రింద్.

'ఆ, ఆ, అదేనండి' - అన్నది సిసీ భయం భయంగా.

'మంచిది. అయితే నిన్ను ఒక ప్రశ్న అడుగుతాను. గుర్రం అంటే ఏమిటో నిర్వచనం చెప్పు చూదాం' - అన్నాడు గ్రాడ్ గ్రింద్.

గ్రాడ్ గ్రింద్ ఇలా ప్రశ్నించేసరికి పిడుగు పాటుకు చెట్టు కూలి నట్టుగా ఆ అమ్మాయి కుప్పకూలిపోయింది.

'అయ్యో రామ ! నిత్యం మనకళ్ళకు కనుపించే గుర్రాన్నే నువ్వు నిర్వచించలేవూ ? ఇదేం చోద్యం ?' - అన్నాడు గ్రాడ్ గ్రింద్.

తరువాత ఆయన చూపులు బిజ్ జర్ అనే కుర్రాడి వైపుకు పసరించాడు.

'ఒరేయ్ అబ్బాయ్! నువ్వు చెప్పరా గుర్రం అంటే ఏమిటో'-
అన్నాడు గ్రాడ్‌గ్రింద్.

బిజ్‌జర్ ఉలికిపడి లేచి నిల్చుని గుర్రాన్ని ఈ క్రిందివిధంగా నిర్వచించడం మొదలు పెట్టాడు.

'గుర్రం ఒక జంతువు. నాలుగుకాళ్ళ జంతువు. మాంసాహారి కాదు. 40 పండ్లు ఉంటాయి. నోటిలోని గీట్లవల్ల వయస్సును లెక్కించవచ్చును.'

'అమ్మాయ్ సిసీ, ఇప్పుడు అర్థమైందా, గుర్రంఅంటే ఏమిటో?'-
అన్నాడు గ్రాడ్‌గ్రింద్.

సిసీ మరోమాటు లేచి నిల్చుని. 'చిత్తం' అన్నది వినమ్రంగా.

ఇప్పుడు మూడవవ్యక్తి ముందుకు వచ్చాడు. ఈ వ్యక్తికూడా సామాన్యుడు కాడు. కొండంత మనిషి. వాదనలో దిగాడంటే అంతు చూడందే వదలిపెట్టడు.

ఆవ్యక్తి ముందుకువచ్చీ రావడంతోటే బాలబాలికలను ఇలా ప్రశ్నించాడు. 'మీరు గుర్రాల్లా అభినయించగలరా?' - అని.

'ఓ' - అన్నారు బాలబాలికలంతా ఒక్కమాటుగా. తరువాత ఆవ్యక్తి తన సిద్ధాంతాన్ని వారికి బోధపడే విధంగా వ్యాఖ్యానించసాగాడు.

'ఒకగదిలో ఒక తివాసీని పరిచామని అనుకోండి. ఆ తివాసీని పరిచి గదిలోపూలు పరిచినట్లుగా మనం ఊహించడానికి అవకాశం ఉన్నదా?' - అని ప్రశ్నించాడు ఆ పెద్దమనిషి.

'అలా ఊహించే వీలులేదు' - అన్నారు బాలబాలికలంతా ఒక్కుమ్మడిగా.

'అమ్మాయ్! నువ్వు చెప్పు' - అన్నాడు ఆ పెద్దమనిషి సిసీ వంక వేలెట్టి చూపుతూ.

సిసీ సిగ్గుతో లేచి నిల్చుంది.

పెద్దమనిషి మళ్ళీ తన ఉద్దేశాన్ని ఆ అమ్మాయికి వివరించసాగాడు.

'నీవు - రేపు - పెరిగి - పెద్దదానివై - పెళ్ళయ్యాక - మీ ఆయనగారి గదిలో ఓ చక్కని తివాసీ పరిచావనుకో. అప్పుడు నీవు ఎలా ఊహిస్తా వమ్మాయ్!' - అన్నాడు ఆ పెద్దమనిషి.

'నాకు పూలంటే మహా యిష్టమండి' - అన్నది ఆ అమ్మాయి.

'అప్పుడు నీవు ఎలా ఊహిస్తా వమ్మాయ్?' - అని అడిగాడు ఆ మూడవ వ్యక్తి.

'అప్పుడండీ - నేనండీ - ఎలా ఊహిస్తా నంటారా? చెప్పనా అండీ' - అంటూ సిసీ ఏదో చెప్పబోయేసరికి థామస్ గ్రాడ్ గ్రిండ్ మహాశయుడు తాను కల్పించుకుని 'అమ్మాయ్! ఇక్కడ ఊహలకు తావు ఎంతమాత్రం లేదు. అవసరమైనది వాస్తవం!' అన్నాడు ఘాటుగా.

సిసీ సిగ్గుపడుతూ కూచుంది. ఆ తరువాత చాకుమ్చైల్డ్ రంగంలో ప్రవేశించాడ. చాకుమ్చైల్డ్ ఒక బడిపంతులు, బడిపంతుళ్ళ కందరికీ ఆయన నికారసైన ప్రతినిధి. ఆయనకు తెలియని విషయ మంటూ లేదు. అన్ని శాస్త్రాలూ ఆయనకు కరతలామలకం. ఆయ నకు ప్రపంచంలోని దేశదేశాల చరిత్రలూ తెలుసు. తెలియద మేమిటి?

ఇట్టే కంఠోపాఠం. ఆయన తన సహజగంభీర ధోరణిలో తన వాక్చాతుర్యాన్ని బాల బాలికలకు ప్రదర్శించి చూపాడు.

# 3

గ్రాడ్ గ్రిండ్ బడినుంచి ఇంటికి వెళ్ళాడు. అతని మన స్సులో ఒకవిధమైన సంతృప్తి నిండిఉన్నది. బడి తన స్వంత బడి. ఆ బడిని ఒక ఆదర్శ పాఠశాలగా రూపొందించడం అతని లక్ష్యం. బడిలో చదువుకునే ప్రతి బాలుడూ ప్రతి బాలికా ఆదర్శ జీవిగా తయారు కావడం అతని ఆకాంక్ష.

గ్రాడ్‌గ్రిండ్‌కు అయిదుగురు పిల్లలు. గ్రాడ్‌గ్రిండ్ తన పిల్లల్ని తన ఆదర్శాలకు అనుకూలంగా పెంచాడు. చదువుకునే వయస్సు రాగానే గ్రిండ్ వారిని బడిలో చేర్పాడు.

చిన్నపిల్లలకు సాధారణంగా తల్లిదండ్రులు చెప్పే కట్టుకథలను చెప్పి గ్రాడ్‌గ్రిండ్ వారిని భ్రష్టురాలను చెయ్యలేదు. చంద్రుణ్ణి చూపి చంద్రునిలో ముసలమ్మ కూతురు రాటం వడుకుతున్నదని, కుందేలు గంతులువేస్తూ ఉన్నదని కట్టుకథలు చెప్పలేదు. 'తుర్రుపిట్ట తుర్రుపిట్ట తుర్రుమన్నది' - లాంటిపాటలు కంఠోపాఠం పెట్టించలేదు. ఇలాటి కట్టుకథలన్నా, ఊహాగానాలన్నా, గ్రాడ్‌గ్రిండ్ మహాశయునికి చెడ్డ చిరాకన్న విషయాన్ని ఇంతకుముందే పాఠక మహాశయులకు నివేదించుకున్నాము. సాధారణంగా చిన్నపిల్లలకు ఇంపైన ఒక్క రాజ కుమారుడి కథకాని, రాజకుమారి కథకాని. గ్రాడ్‌గ్రిండ్ పిల్లలకి చెప్ప లేదు. పెద్దలు కూడా తలలు బద్దలు కొట్టుకునే సిద్ధాంతరాద్ధంతాలను గ్రాడ్‌గ్రిండ్ మహాశయుడు తన పిల్లలకు నూరిపోశాడు. ఆవు ఊపిరి తిత్తిలో ఎన్ని నరాలున్నాయో కచ్చితంగా లెక్క చెప్పమన్నా వారు లెక్కచెప్పగలరు.

'గ్రాడ్‌గ్రిండ్ మహాశయుడు తన ఇల్లు దాపుకు చేరుకున్నాడు. ఆయన ఇంటిపేరు 'శిలాలయం' ఈ 'శిలాలయా'న్ని నిర్మించడంలో కూడా గ్రాడ్‌గ్రిండ్ మహాశయుడు తన అభిరుచిని చూపాడు. కచ్చితంగా లెక్కప్రకారం కట్టించిన భవనం ఇది. అందాలకు అలంకారాలకు ఆడంబరాలకు ప్రాధాన్యం ఇవ్వబడలేదు. ఇంటికి వసతి ముఖ్యం కాని అందాలు అలంకారాలు ఆడంబరాలు ఎవరిక్కావాలి, అందువల్లనే గ్రిండ్ మహాశయుడు శిలాలయాన్ని అచ్చంగా తన అభిరుచికి అనుకూలంగా. నిర్మించుకున్నాడు. 'శిలాలయం' యొక్క స్వరూపం ఇది. నలచదరంగా ఉన్న ఒక భవనం. పెద్ద వరాండా. చిన్న చిన్న కిటికీలు. ఇంటిముందు ఒక చిన్నతోట. తోటలో పూలమొక్కలూ, పండ్ల చెట్లూ. పరిచారకులకు పెరటివైపున ఓగది - ఇవీ 'శిలాలయం' యొక్క స్వరూపం. అయితే, ఇంటిముందు తోటలో మొక్కలను డ్ పెంచాడని అడుగుతారేమో - అచ్చంగా నూటికి

మారుపాళ్ళు వృక్షశాస్త్రంలో సూత్రాలను అనుసరించి ఆ మొక్కలను పెంచాడు గ్రింద్ మహాశయుడు. పిల్లలకోసం వేరువేరుగా ప్రత్యేకమైన గదులను కట్టించాడు గ్రింధ్ మహాశయుడు.

సంతృప్తితో హాయిహాయిగా మనస్సులో ఆశాలతలు అల్లుకుంటూ గ్రింద్ మహాశయుడు ఇల్లు చేరాడు. ఇల్లు చేరగానే ఆయనకు తన కుటుంబమూ - తన కుటుంబంపట్ల తను నిర్వహించవలసిన బాధ్యతలూ జ్ఞప్తికి వచ్చాయి. గ్రింద్ మహాశయుడు ఇంటికి పెద్ద. పిల్లలకు తండ్రి, భార్యకు భర్త, పరిచారకులకు యజమాని. ఈ బాధ్యతలను నిర్వర్తించడంలో కూడా గ్రింద్ మహాశయుడు లెక్క తప్పడు. తను నివసిస్తూ ఉన్న కోక్ టౌన్ పేటలో ఎన్నడైనా బహిరంగ సభలో మాట్లాడవలసి వచ్చినప్పుడు కూడా గ్రింద్ మహాశయుడు లెక్క తప్పడు. ఇరుగుపొరుగు వారితో స్నేహం నెరిపే సందర్భంలో కాని వారితో లావాదేవీల విషయంలోకాని, మంచిచెడ్డలు విషయంలోకాని, గ్రింద్ మహాశయుడు లెక్క తప్పడు.

'కోక్‌టౌన్‌పేట వాతావరణం విచిత్రంగా ఉంటుంది. కోక్ టౌన్‌పేట పట్నమూఅంటే పట్నమూ కాదు. గ్రామసీమా అంటే గ్రామ సీమాకాదు. గ్రామ, నగర వాతావరణాల సమ్మేళనం మనకు కోక్ టౌన్ పేటలో కనుపిస్తుంది. ఆ పేటలో అడుగు పెడుతూ ఉండగానే మనకు ప్రజల కోలాహలం సంగీతంలాగ వినిపిస్తుంది. కోక్‌టౌన్ పేటలో గుర్రపు పందేలు జరుగుతాయి. బ్యాండుమేళం వినిపిస్తుంది. కొందరు వస్తాదులు కుస్తీలు వ్యాయామాలు సాధనచేస్తూ ఉంటారు. కొందరు విదూషకులు హోటళ్ళముందు సమావేశమై చమత్కారంగా సంభాషిస్తూ వున్నారు.

గ్రింద్ యీ రోజున పేటలో అడుగుపెట్టినప్పుడు కూడా యీ దృశ్యాలన్నీ కనుపించాయి. కాని గ్రింద్ మహాశయుడు యీ దృశ్యాలవంక కన్నెత్తికూడా చూడలేదు. మనస్సులో ముసురుతూ వున్న వివిధ భావాల దోమలను తోలుకుంటూ తనదారిన తను తలవంచుకుని నడిచిపోసాగాడు.

రోడ్డు మలుపు తిరగ్గానే కొందరు పిల్లలు పోగై వుండడం కనుపించింది. 'అందరూ ఆదర్శ పాఠశాలలు స్థాపించేవారే. పిల్లల్ని మటుకు అగ్రహారబ్బడిపిల్లలల్లే తయారుచేస్తారు'-అంటూ తనలో తాను గొణుక్కోసాగాడు. గ్రిండ్ మహాశయుడు. పిల్లల్ని ఒకమాటుపరికించి చూచాడు గ్రిండ్ మహాశయుడు.

ఆ పిల్లలతో తన కుమార్తె లూసా, కుమారుడు థామస్ కూడా ఉండడం కనుపించేసరికి గ్రిండ్ స్తంభీభూతుడైనాడు.

ఒక్కపరుగున వారిదగ్గరకు వెళ్ళాడు గ్రిండ్.

తన కుమారుడూ తన కుమార్తె అలా సాదా పిల్లలతో కలిసి ఆటలాడుకొనడం గ్రిండ్‌కు తన కుటుంబ గౌరవానికే నష్టం వాటిల్లినట్లుగా తోచింది;

'అమ్మాయ్ లూసా! అబ్బాయ్ థామస్! ఇలారండి' - అంటూ కేకపెట్టాడు గ్రిండ్.

తండ్రిగారి కేకవిని, పిల్లలిద్దరూ ఉలికి పడ్డారు. భయంభయంగా దగ్గరకు వచ్చారు. లూసాకంటె థామస్ ఎక్కువ భయపడ్డాడు, తండ్రి గారివంక చూడడానికే భయపడ్డాడు.

గ్రిండ్ వారిని చెయ్యి పుచ్చుకుని తీసుకుని వెడుతూ 'ఏం చేస్తున్నారర్రా ఇక్కడ?' - అన్నాడు.

'సర్కస్ చూస్తూఉన్నాం నాన్నా' - అన్నది లూసా.

గ్రిండ్ గద్దింపునకు పిల్లల ముఖాలలో కాంతి తొలిగి పోయింది. వారి ముఖాలు వివర్ణమైనాయి.

లూసా పదిహేను పదహారేళ్ళ అమ్మాయి. అయినా వట్టి పసి పిల్ల. గ్రిండ్ మహాశయుని పెంపకంయొక్క ఫలితం అది.

'అబ్బాయి, థామస్, నీవు చదువున్నవాడివి. సంస్కారం ఉన్న వాడవి. నీ చెల్లిని ఇలాటి ప్రదేశాలకు తీసుకుని రావడం సబబేనట్రా?'- అన్నాడు గ్రిండ్,

'అన్నయ్య నన్ను తీసుకురాలేదు నాన్నా. నేనే అన్నయ్యను తీసుకుని వచ్చాను' - అన్నది లూసా.

'మీరు ఇలాటి పనులు చెయ్యడం నాకు చాలా విచారం కలిగిస్తూ ఉన్నదమ్మాయ్' - అన్నాడు గ్రాడ్‌గ్రిండ్.

లూసా తండ్రిగారివంక చూచింది.

'అబ్బాయ్ థామస్! అమ్మాయ్ లూసా! - మిమ్మిల్నిద్దరినీ ఎంతో నిక్కచ్చికా పెంచాను లెక్కప్రకారం. శాస్త్రాలు బోధించాను. చివరకు మీరు నా పరువు ప్రతిష్టలను గంగపాలు చేశారు' - అన్నాడు గ్రాడ్‌గ్రిండ్.

'చాలా రోజులనుంచి నాకు ఎంచాతనో కాని మనస్సు అదోలా ఉంది నాన్నగారూ. నాకు జీవితంమీద రోత పుట్టింది' - అన్నది లూసా.

'ఎందుకమ్మాయ్ రోత?' - అని ప్రశ్నించాడు గ్రాడ్‌గ్రిండ్.

'ఏమో నాన్నగారూ. ఎంచేతనో నాకు తెలీదు -' అన్నది లూసా.

'ఇహనుంచి ఇలాటి వెర్రిమాటలు మాట్లాడకు' - అని గద్దించాడు గ్రాండ్‌గ్రిండ్.

'మీరు ఇలాటి పనులు చేస్తూఉంటే అందరూ ఏమనుకుంటారు? మీ స్నేహితులు మటుకు ఏమనుకుంటారు? బౌందర్‌బై నా స్నేహితుడే కదా? అతను ఏమనుకుంటాడో ఊహించావా?' - అన్నాడు గ్రాడ్‌గ్రిండ్ మహాశయుడు.

# 4

ఇహ యీ బౌందర్ బై కథ చెబుతాను వినండి.

బౌందర్ బై గ్రాడ్ గ్రిండ్ మహాశయుని ఆంతరంగిక మిత్రుడు. వారిరువురికీ శరీరాలు వేరేమోకాని ఆత్మలుమటుకు ఒకటే. బౌందర్ బై శ్రీమంతుడు. వర్తక వ్యాపారా లున్నాయి. ఏనుగంత మనిషి. నవ్వితే సింహం గర్జించినట్లుగా వుంటుంది. ఉక్కు మనిషి.

ఎత్తయిన మనుది. అగ్నిహోత్రంలాంటి స్వభావం. ఎవరూ ఎదురు మాట్లాడడానికి వీలులేదు. స్వయంకృషివల్ల పైకివచ్చిన మనిషి.

గ్రాడ్ గ్రిండ్ కన్న బౌండర్ బై ఒకటి రెండు సంవత్సరాలు చిన్నవాడు. అయినా వయస్సులో తానే పెద్దలా అగుపిస్తాడు. బట్టతల.

'శివాలయం' ముందున్న డ్రాయింగ్ రూమ్‌లో బౌండర్ బై మహాశయుడు గ్రాడ్ గ్రిండ్ మహాశయుని సతీమణితో కొన్ని ప్రముఖ విశేషాలను చర్చిస్తూవున్నాడు. తన జన్మదినోత్సవానికి సంబంధించిన ప్రముఖ విశేషా లవి. అది వసంత సాయంత్రం. పల్చని ఎండ పొరలు పొరలుగా గదిలో పడి చిన్న చిన్న నీటి మడుగులు కడుతున్నట్టుగా వుంది.

బౌండర్ బై తను తన పదవ జన్మదినోత్సవం ఏ విధంగా గడిపాడో గ్రాడ్‌గ్రిండ్ సతీమణికి చెబుతూవున్నాడు.

'నాకు ఆరోజున చిల్లిగవ్వకూడా దగ్గిరలేదు. నెత్తిమీద చూరు లేదు. తినడానికి తిండిలేదు. గుంటలో తల దాచుకున్నాను. ఇలా వెళ్ళిపోయింది నా పదవ జన్మదినోత్సవం. కాని ఇందులో నాకు ఆశ్చర్యంగా కనుపించినది ఏమీలేదు. ఎందుచేతనంటే నేను చిన్నతనంలో దారిద్ర్యానికి అలవాటు పడ్డాను.'

గ్రాడ్ గ్రిండ్ సతీమణి ఒక మూలన కూచుని ఈ మాటలను వింటున్నది. ఆవిడ సన్నగా రెబ్బలాగ ఉంటుంది. మానసికంగాను శారీరకంగాను ఆవిడ బలహీనస్థురాలు. బౌండర్‌బై చెప్పిన మాటలన్నీ విని ఆవిడ ఇలా అన్నది.

'నీవు తలదాచుకున్న గుంట ఎండుగా ఉన్నదా ?' - అని. అందుకు బౌండర్‌బై చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు. 'ఎండుగా ఉండడమా ? అయ్యో రామ! మెడలోతు నీళ్ళున్న గుంటలో తల దాచుకున్నాను' -

'జలుబుచేసి ఉండాలి మీకు' - అన్నది గ్రాడ్ గ్రిండ్ సతీమణి.

'వట్టి జలుబే అంటారేమిటి ? ఊపిరి తిత్తులు ఉబ్బాయి. నాలుగు సంవత్సరాలు ఈ జబ్బుతో యమయాతన అనుభవించాను. అప్పుడు ఎలా ఉండేవాణ్ణి అనుకున్నారేమిటి ? మనిషల్లే ఉండేవాణ్ణికాదు. పిశా

చిలా ఉండేవాణ్ణి. నన్ను ముట్టుకోవాలంటేనే మనుష్యులు భయపడే వారు. మనుష్యులు నేను కనుపిస్తే దూరదూరంగా తొలిగిపోయేవారు. కాని జీవితాన్ని మార్చుకుందామని గట్టినిశ్చయం చేసుకున్నాను. ఆ నిశ్చయబలం వల్లనే నాటికి ఇలా ఒక వ్యక్తిగా రూపొందగలిగాను' - అన్నాడు బౌందర్‌బై.

'మీ తల్లిగారు నిన్ను సాకలేదా ?' - అని ప్రశ్నించింది గ్రాద్‌గ్రింద్ సతీమణి.

'మా తల్లిగారు నన్ను మా అమ్మమ్మకు అప్పగించారు. మా అమ్మమ్మ వృద్ధ పిశాచి. పైగా ఆవిడకు తాగుడు అలవాటు. నాకు ఓ జత చెప్పులుంటే ఆవిడ ఆ చెప్పులను కూడా అమ్మి ఆ డబ్బు తాగుడుకు తగలేశేది. ఆవిడ కంఠబిలంలోకి రోజూ ఎన్ని గ్లాసుల సారా వెళ్ళేదో లెక్కేలేదు, ప్రతిరోజూ ఉదయం ఆవిడ పద్నాలుగు గ్లాసుల సారా త్రాగడం నాకు బాగా జ్ఞాపకం' - అన్నాడు బౌందర్ బై.

తరువాత ఒక క్షణం ఆగి బౌందర్ బై మళ్ళీ యిలా చెప్ప సాగాడు : 'మా అమ్మమ్మకు ఓ చిన్న దుకాణం వుండేది. రోజూ తాను దుకాణానికి వెడుతూ నన్నుకూడా దుకాణానికి తీసుకుని వెళ్ళేది. తాను దుకాణంలో వున్నంతసేపూ నన్ను కోడిగుడ్లుపెట్టే పెట్టెలో పెట్టి వుంచేది. నేను కాస్త పెరిగి పెద్దవాణ్ణి కాగానే తప్పించుకుని వెళ్ళాను. దేశద్రిమ్మరి నయ్యాను. ఇప్పుడు పృధ్వి యావత్తూ నా స్వదేశం.

నాలుగు దిక్కులూ నాకు స్నేహితులు. ఆకాశం గొడుగు. ఇలా కొన్నాళ్ళు దేశదిమ్మరిలా తిరిగాను. మనిషిలో మంచి ఉన్నదనుకుని తలంచి మంచికొరకు వెదికాను. ఆశించాను. కాని మనుష్యుల్లో విషం తప్ప మరేమీ లేదు. మనుష్యులు మహా సర్పాలవలె నన్ను కాటేశారు. అవును 'నా' అన్నవారు ఎవరూ లేని ఒక అనాధుణ్ణి మనుష్యులు ఇలా చూడడం సహజమే. ఇందులో ఆశ్చర్యం ఏమీ లేదు. ఒక అనాధ బాలుడు - ఒక పరాన్న భుక్కు - వారి దృష్టికి ఒక చీడపురుగులా కనుపించడంలో ఆశ్చర్యం ఎంతమాత్రం లేదు' - అని తన బాల్య కధను వినిపించ సాగాడు బౌందర్‌బై. గ్రాద్‌గ్రింద్ సతీమణి

బౌందర్ బై బాల్యగాథను ఆలకిస్తూ ఉన్నది. బౌందర్ బై మళ్ళీ ఇలా చెప్పసాగాడు.

"ప్రపంచంలో అడుగుపెట్టిన తరువాత మనం ఎలాంటి కష్టాలనైనా ఎదుర్కొని తీరవలసిందే. ఎవరో సాయంచేస్తారని ఆశించడం పొరబాటు. ఇలా కొన్నాళ్లు దేశదిమ్మరిగా ఈ విషాదవిషమ విశ్వపథంలో పయనం చేశాను. నాకు నేనే స్నేహితుణ్ణి. నా కష్టాలు నాకే చెప్పుకోవాలి. నన్ను నేనే ఓదార్చుకోవాలి. భుక్తికొరకు రకరకాల వృత్తులను అవలంబించాను. కార్మికుణ్ణిగా, పోర్టర్‌గా, గుమాస్తాగా, కంపెనీ మేనేజరుగా, కొద్ది భాగస్థుణ్ణిగా పని చేశాను. ఆఖరుకు పెద్ద వర్తకుణ్ణిగా రూపొందాను. బౌందర్ బై మహాశయుడు ఇలా తన చిన్ననాటి గాథను వినిపిస్తూ ఉండగా గ్రాడ్ గ్రిండ్ మహాశయుడు పిల్లల్ని తీసుకుని ఇంటిలోనికి వచ్చాడు. బౌందర్ బై పిల్లల ముఖాలు వెలవెలపోతూ ఉండడం చూచి, ఏమిట్రా అలా, ఉన్నారు ? ఏమిటి విశేషం ?" - అన్నాడు.

'మేము సర్కస్ చూస్తూఉంటే నాన్నగారు మమ్మల్ని పట్టుకుని తీసుకుని వచ్చారు' - అన్నది లూసా.

'పిల్లలు ఈ సమయంలో కవితా గ్రంథాలు చదువుతూ ఉండగా చూడాలని నా ఆకాంక్ష. కాని తీరా చూస్తే వారు సర్కస్ వినోదాన్ని ఆనందిస్తున్నారు' - అన్నాడు గ్రిండ్ విసుగ్గా.

'అయ్యో రామ ! ఇవేం పనులర్రా మరీని. అల్లరి తిరుగుడు ఎక్కువైపోయింది' - అన్నది గ్రిండ్ సతీమణి.

తండ్రికి చెప్పిన సమాధానమే లూసా తల్లికి కూడా చెప్పింది.

'అయినా, పిల్లలకు యీ సర్కస్సులాంటివి చూడడం తగదు' - అంటూ తల్లి పిల్లల్ని లోనికి సాగనంపింది. తరువాత తాను కూడా ఏదో పనిమీద లోనికి వెళ్ళింది.

బౌందర్ బై, గ్రాడ్ గ్రిండ్ మాత్రమే డ్రాయింగ్ రూమ్‌లో మిగిలారు. గ్రాడ్ గ్రిండ్ బౌందర్ బై వద్దకు దాపుగా తన కుర్చీని లాక్కుని మెల్లిగా యిలా చెప్పసాగాడు :

మిత్రుడా ! నీవు నా పిల్లల విషయంలో యెంతో శ్రద్ధ అనుసరిస్తావు - ముఖ్యంగా లూసా విషయంలో.

నీవు నా పిల్లల విషయంలో శ్రద్ధ చూపడం సబబుగానే వున్నది, కాని నాకు ఒక విషయం మాత్రం ఎంతో బెంగగా వున్నది. నా పిల్లలకు చదువు సంధ్యలు చెప్పించడం విషయంలోను, వారి పెంపకం విషయంలోను నేను ఎంతో శ్రద్ధచూపాను. వారిని ఒక క్రమ పద్ధతిలో పెంచి పెద్దవారిని చెయ్యడానికి నేను ఎంతో యత్నించాను. కాని చూడగా చూడగా, నా కృషి యావత్తూ విఫలమైనట్లు అనిపిస్తోంది. పిల్లలు వట్టి గడుగ్గాయల్లా తయారవుతున్నారు" - అన్నాడు గ్రిండ్.

"తిరుగుబోతుల విషయంలో ఎవరైనా శ్రద్ధ చూపుతారని అనుకొనడం కేవలం పొరబాటు. నేను నా చిన్నతనంతో తిరుగుబోతునుగా వున్నప్పుడు నా విషయంలో ఎవరూ శ్రద్ధ చూపలేదు" - అన్నాడు బొందర్ బై.

"అయితే యీ శ్రద్ధకు కారణం ఏమిటని నీ ఉద్దేశం?" - అని ప్రశ్నించాడు గ్రిండ్.

'ఊహాజనితమైన ఉన్మాదం' - అన్నాడు బొండర్‌బై.

'ఊహాజనితమైన ఉన్మాదం నిజంగా ఒక జబ్బులాంటిది. ముఖ్యంగా లూసా ఈ జబ్బుతో అవస్థపడుతూ ఉన్నది' - అంటూ వ్యాఖ్యానించసాగాడు బొందర్‌బై.

"లూసా, థామస్‌ల ప్రవర్తన నాకు ఎంతో ఆందోళన కలిగిస్తూ ఉన్నది. వీరి ప్రవర్తనలో ఇలా మార్పు కలగడానికి కారణ మేమిటో నాకు బోధపడడం లేదు. పంతుళ్ళు పాఠాలు చెప్పడంలో లోపమో, లేక ఇంట్లో సేవకులు చెడుబోధలను నూరిపోశారో అర్థంకాకుండా ఉన్నది. లేక లూసా థామస్‌లు చెడు పుస్తకాలు చదవడానికి అలవాటు పడ్డారో మరి? ఈరోజుల్లో మరీ చెత్తపుస్తకాలు వెలువడుతున్నాయి. ఈ పుస్తకాలు పాఠకులలో నైతికస్థాయిని పెంచకపోవడం మాట అలాఉంచి, పాఠకుల మనస్తత్వాలను కలుషితం చేస్తున్నాయి. ఇలాటి పుస్తకాలు నా ఇంట్లోకి రాకుండా నేను ఎంతో జాగ్రత్త వహించాను. కాని లూసా థామస్‌లు ఇలాటి పుస్తకాలను చాటుమాటుగా తెచ్చుకుని చదువుతూ

ఉన్నారేమోనని నా అనుమానం. కారణాలు ఏమవుతేనేం? - లూసా, ధామస్‌లో కలిగిన ఈ కొత్తమార్పు నాకు ఎంతో ఆశ్చర్యాన్ని, విచారాన్ని కలిగిస్తున్నది" - అని చెప్పసాగాడు గ్రిండ్. ఇంతసేపూ గ్రిండ్ చెబుతూన్న మాటలను శ్రద్ధగా వింటున్న బౌందర్‌బై ఒక్కమాటుగా కేకపెట్టినట్టుగా ఇలా అన్నాడు: అబ్బాయి! ఆగవోయ్ - అసలు కారణం ఏమిటో నాకు స్ఫురించింది - బళ్ళో ఓ అమ్మాయి ఉంది చూచావూ - ఆ అమ్మాయి పేరేమిటన్నావూ -"

'సిసీ వియాజూప్' - అన్నాడు గ్రిండ్ మహాశయుడు బౌందర్‌బైవైపు తదేకదృష్టితో చూస్తూ.

"ఆ ఆ అవును ఆ అమ్మాయి మీ బళ్ళోకి ఎలావచ్చింది?"

"ఏమో - నాకూ తెలీదు. నేనూ ఆ అమ్మాయిని చూడడం ఇదే తొలిసారి" - అన్నాడు గ్రిండ్.

"ఆ అమ్మాయి స్నేహమే మీ లూసా చెడిపోవడానికి కారణం. ఆ అమ్మాయిని పంపివెయ్యి. నీ సమస్య పరిష్కారం అవుతుంది" - అని సలహా చెప్పాడు బౌందర్‌బై.

"నేనూ అదే అభిప్రాయంలో ఉన్నాను" - అన్నాడు గ్రిండ్.

అవుతే ఇంకేం, త్వరగా ఆపని చెయ్యి. ఆలస్యం అమృతం విషం అన్నారు" - అన్నాడు బౌందర్‌బై.

"సరే ఒక్కమాటు అలా బడిదాకా వెళ్ళివద్దం వస్తావా" - అని అడిగాడు గ్రిండ్. "సరే" - అన్నాడు బౌందర్‌బై. ఇలా అని బౌందర్‌బై హేటు పెట్టుకుని హాలుబైటికి నడిచాడు. ఒకటి రెండు నిమిషాలు అతన్ని హాలులో వేచి ఉండమని చెప్పి గ్రిండ్ మేడమీదకు వెళ్ళాడు. గ్రిండ్ మెట్లెక్కి మేడమీదకు వెళ్ళగానే తలుపు తెరచుకుని పిల్లలు చదువుకునే గదిలోకి వెళ్ళాడు. గది ఎంతో పరిశుభ్రంగా అలంకరించబడి ఉన్నది. నేలపై మెత్తని తివాశీపరిచి ఉన్నది, బీరువాలనిండా పుస్తకాలు ఉన్నవి. లూసా కిటికివద్ద నిల్చుని వెలుపలికి నిరీహ దృష్టితో చూస్తూ ఉన్నది. ధామస్ ఒకమూలన కుర్చీలో జేరగిలబడి ఉన్నాడు. ఆడం, మాల్థాస్ మొదలుగాగల ఇతరపిల్లలు మరో మూలకూచుని పలకమీద లెక్కలు చేసుకుంటూ ఉన్నారు.

గ్రింద్ బీరువా తలుపు తెరిచి ఐడి ప్రిన్సిపాలు చిరునామా తీసుకుని మెట్లుదిగి క్రిందికి వచ్చాడు.

# 5

గ్రింద్, బౌందర్ బై యిరువురూ కలిసి కోక్ టౌన్ వైపుకు నడక సాగించారు.

కోక్ టౌన్ ఒక పేట. ఆ పేటలో అన్నీ ఎర్రని పెంకుటిళ్ళు. ఇటుకలతో కట్టిన గోడలు. ఆ పేటను దూరంనుంచి చూస్తే అంతా అలికినట్టు ఒక రాక్షసి ముఖంలా అగుపిస్తుంది. ఆ పేటలో ముఖ్యంగా ఫ్యాక్టరీలు ఎక్కువగా వున్నాయి. దూరంనుంచి పొగగొట్టాలు శిఖరాల వలె ఎత్తుగా కనుపిస్తున్నాయి. పేట మధ్యలోగుండా ఒక మురికినీటి కాలవ, - నల్లని కాలసర్పంలాటిది, - ప్రవహిస్తూ వున్నది. పేటను ఆనుకుని ఒక నది. ఇహ పేటలో యిళ్ళు గిజిగాడి గూళ్ళలా వున్నాయి. ఆ యిళ్ళలో ఉదయంనుంచి సాయంత్రంవరకు అష్టమానం ఒకటే రొద వినిపిస్తుంది. వీధులన్నీ ఒకే విధంగా వుంటాయి. చిన్న చిన్న సందులుకూడా వున్నాయి. ఆ యిళ్ళలో నివసించే మనుష్యులలో కూడా పెద్ద తేడా కనుపించదు. అందరూ ఒకేవిధంగా వుంటారు. ఉదయాన్నే లేచి ఎవరి పనులమీద వారు వెడతారు. సాయంత్రానికి కాళ్ళీడ్చుకుంటూ తిరిగి యిళ్ళు చేరుతారు. వారి జీవితాలలో కూడా మార్పేమీ వుండదు. నిన్న లాగే నేడు, నేటి లాగానే రేపు - జరిగిపోతుంది.

నగరవాసుల భోగభాగ్యాలకు అవసరమైన సామగ్రి యావత్తూ ఈ కోక్ టౌన్‌లోనే ఉత్పత్తి అవుతుంది. అయినా, నాగరికులైన నగరవాసులు కోక్ టౌన్ పేరు చెవితేనే భయపడతారు, కోక్ టౌన్ ఘుమకూపం వంటిదని అసహ్యించుకుంటారు.

కోక్‌టౌన్‌లో అలంకారాలూ, ఆడంబరాలూ మచ్చుకైనా కనుపించవు. కట్టడాలన్నీ ఒకేవిధంగా వుంటాయి. చర్చిలకు కూడా ప్రత్యేకమైన అలంకారాలేమీ వుండవు.

చర్చిలుకూడా ఇటుక కట్టడాలే. గోపుర శిఖరాగ్రాలలో మాత్రం ఒక చిరుగంటను వ్రేలాడదీస్తారు. ఫలానిది జైలు, ఫలానిది బడి, ఫలానిది నగరమందిరం అని వెలుపలి కట్టడాన్నిబట్టి ఊహించడానికి వీలుండదు. పురపాలక మందిరంకూడా జైలుకట్టడం లాగానే ఉంటుంది. ఊహాకల్పనకు ఎక్కడా తావులేదు, ఒక్క కట్టడాలుమాత్రమే కాదు, అక్కడి ప్రజల జీవితాలు కూడా అలాగే ఉంటాయి. బండబారిన బ్రతుకులవి,

ఇక బడి జీవితంకూడా ఇలాటిదే. బడిలో బెంచీలకు బెంచీలపై కూచునే పిల్లల మనస్తత్వాలకు పెద్దతేడా ఏమీలేదు. మాస్టర్లు పిల్లలతో చనువుగా ఉండరు. ఒకవేళ ఎవరైనా ఒక బడిపంతుల పొరబాటున పిల్లలతో చనువుగా ఉన్నాడంటే అది ఒక మహాపాపంగా పరిగణింపబడుతుంది.

ఇక - ఈ కోక్ టౌన్ స్వరూప స్వభావాలను నిర్ణయించడం ఎవరితరమూ కాదు. "ఈ ఊరు నా ఊరు" - అని చెప్పుకునేవారు కోక్ టౌన్‌లో ఎవరూ కనిపించరు, ఇక మతంలో విశ్వాస మున్న వాళ్ళుకూడా ఆవూళ్ళో ఎవరూ కనుపించరు. ఆదివారం ఉదయాన చర్చీలలో గంటలు మోగుతాయి. కాని వీధులలో వెళ్ళేవాల్లెవళ్ళూ చర్చీలలోకి వెళ్ళరు ఆ గంటల పిలుపును వినరు, ఇక తాగుడు విషయం చెప్పటానికే వీలులేదు. పానశాలలే వీరికి పాఠశాలలు. తాగిన తరువాత వీరు వేశ్యాగృహాలు కూడా మెట్టుతారు. ఆవూళ్ళో అనేక సంఘాలు వున్నాయి. కాని ఆవూరి ప్రజలను సంస్కరించడము మాత్రం ఏ సంఘానికి తరం కాలేదు. ఈవూరి ప్రజల జీవితాన్ని ఈ క్రింద వుదహరింపబడిన పాట సమగ్రంగా చిత్రిస్తున్నది.

"అనగనగా పూర్వం ఒక వృద్ధురాలు వుండేది, ఆ వృద్ధురాలు అహర్నిశములు తాగుతుండేది, తాగుడే ఆ వృద్ధురాలికి ఆహారము."

గిందు, బౌందర్ బై యిరువురు ఆ వూరి జీవితాన్ని గురించి ఆలోచిస్తూ పరధ్యాన్నంగా నడుస్తున్నారు. వీధిమూలన వారికొక పిల్ల కనుపించింది, ఆ పిల్లను గింద్ గుర్తుపట్టాడు. "అమ్మాయ్ ఎక్కడకు వెడుతున్నావ్ ? ఆగు" అన్నాడు. సిసీ ఆగి గింద్‌కు నమస్కరించింది.

"ఎక్కడి కమ్మాయ్? పరుగెత్తుతున్నావ్!"

"అబ్బాయి నన్ను తరుముకుని వస్తున్నాడండీ" అన్నది సిసీ.

"ఎవ రతను?" అని ఆందోళనతో అడిగాడు గింద్.

ఆ అమ్మాయి జవాబు చెప్పేలోపలే అక్కడికి పరుగుతీస్తూ ఒక కుర్రాడు వచ్చాడు. మెరుపుతీగలా అక్కడికి వచ్చిన ఆ కుర్రవాని పేరు బిట్జర్.

"ఏమిట్రా అబ్బాయ్ యీ ఆగడం?" అని గింద్ ఆ కుర్రవానిని విసురుగా ప్రశ్నించాడు.

"ఈ కుర్రవాడేనా అమ్మాయ్ నిన్ను తరుముతూవున్నది?" అన్నాడు సిసీ వైపు చూచి;

"అవునండి" - అన్నది ఆ అమ్మాయి.

"ఈ అమ్మాయి చెబుతున్న మాటలన్నీ అబద్ధాలండి. నేను ఈ అమ్మాయిని తరమడం లేదు"- అన్నాడు బిట్జర్.

నన్ను ఈ అబ్బాయి భయ పెట్టాడండి. అందుచేత పరుగు తీస్తూ వచ్చాను"- అన్నది సిసీ తరువాత బౌందర్ బై ఆ కుర్ర వాని వంక చూచి, "అబ్బాయ్.

ఇలాటి పనులు ఇహముందు ఎన్నడూ చెయ్యకు. ఈసారికి క్షమించాము. ఇహ ఇంటికి వెళ్లు"- అన్నాడు.

కుర్రవాడు భయంతో కను రెప్పలు అల్లల్లార్చి వెనక్కు తిరిగి వెళ్ళాడు.

తరువాత గ్రింద్ ఆ అమ్మాయి వైపు తిరిగి," అమ్మాయ్ సిసీ మేము మీఇంటికే వస్తున్నాము, మమ్మల్ని మీ ఇంటికి తీసుకునివెళ్ళు"- అన్నాడు.

సిసీ చేతిలో ఒక సీసా ఉండడంచూచి, "అమ్మాయ్, ఆ సీసాలో ఏముంది?" - అని ప్రశ్నించాడు గింద్.

"జిన్ సారాయం అయి అంటుంది" - అన్నాడు బౌందర్‌బై చమత్కార ధోరణిలో.

"అమ్మ బాబోయ్. సారాయమె" అలాటిదేమీ కాదండి. సీసాలో ఉన్నది తైలం. మా నాన్నగారికోసం తీసుకుని వెడుతున్నాను" - అన్నది ఆ అమ్మాయి.

"తైలంతో ఏంచేస్తావమ్మాయ్ ?" - అని ప్రశ్నించాడు గింద్.

"మా నాన్నగారు ఈ తైలాన్ని శరీరానికి రుద్దుకుంటారండి. ఈ తైలాన్ని రుద్దుకుంటే గాయాలు మానుతాయి" - అన్నది సిసీ.

"మా చిన్నతనంలో ఇలాటి తైలాలే ఎరగము. గాయాలు పుట్టినే నయమయ్యేవి" - అన్నాడు బౌందర్‌బై సగర్వంగా,

గింద్‌కూడా బౌందర్‌బై వలెనే రాటుతేలిన వ్యక్తి. అయినా ఆతని స్వభావం అంత కఠిన స్వభావం కాదు.

తరువాత వారు సిసీగృహం వైపుకు నడవసాగారు. రెండు వీధులు దాటి సిసీ గృహాన్ని చేరుకున్నారు.

వారు సిసీ ఇల్లు చేరుకునే సరికి బాగా ప్రొద్దు గూకింది. అప్పుడప్పుడే మసక చీకట్లు కమ్ముతూ ఉన్నాయి. ఆఇల్లు ఒక సత్రం లాగా ఉంది. ఇంటి ముందు ఒక పానశాల.

ఎర్రని దీపాలు మందంగా వెలుగు తున్నవి. కొందరు పాన ప్రియులు అప్పుడే ఆ వాసనను సేవించి తూలుతూ తమలో తాము ఏదో గొణుక్కుంటూ బైటికి వెడుతున్నారు.

ఆ యింటి గడపలో అడుగు పెట్టగానే గింద్, బౌందర్‌బైలకు తల తిరిగి మైకంకమ్మి నట్లయింది.

క్షమించాలి. మాగది మేడ మీద ఉన్నదండి ఇప్పుడే లాంతరు తెస్తాను. ఒక క్షణం దయచేసి ఇక్కడ వేచి వుండండి ఇక్కడ 'మెర్రీలెగ్స్' అనే ఒక కుక్క ఉన్నది. అది అరిచే కుక్క కాని కరిచే కుక్క కాదు. ఆకుక్కను చూచి మాత్రం భయపడకండి— అనివారికి విన్నవించుకుని సిసీ మేడమెట్లెక్కి పైకి వెళ్ళింది.

# 6

ఆ పానశాలపేరు 'పెగాసస్ అమ్స్'.
పానశాల వాకిట బోర్డుపై ఈ క్రింది విధంగా వ్రాయబడిఉన్నది.
'అమృతంలాంటి సారాయం ఇక్కడ దొరుకుతుంది.
మహాశయులారా! స్వాగతము!'

అప్పటికి బాగా ప్రొద్దుగూకి చీకటి పడడంవల్ల ఆ పానశాల లోని విశేషాలను గింద్ బౌందర్‌లై గమనించలేక పోయారు. వచ్చి పోతున్నవారిని ఎవరినీ చూడకుండా సరాసరి నడిచివెళ్ళి ఒక మూలన నిల్చున్నారు. సిసీలియా మేడమెట్లెక్కి పైకి వెళ్ళింది. సిసీలియా చెప్పిన మాటలనుబట్టి వారికి అక్కడ నిల్చోవడం భయంగానే ఉన్నది. ఏ క్షణంలోనైనా 'మెర్రీలెగ్స్' కుక్క 'భౌ భౌ' మని అరుస్తూ తమ పైకి దుముకవచ్చునని వారు భయపడుతూనే ఉన్నారు. కాని కుక్క మాత్రం కిక్కురు మనకుండా ఉన్నది.

మేడమీదకు వెళ్ళిన సిసీ లాంతరు తీసుకుని ఒక్క నిమిషంలో తిరిగి వచ్చింది.

"నాన్నగారు ఇంట్లో లేరండి. మీరు మరోలా భావించకుండా ఉంటే ఒక్క రెండు నిమిషాలు వేచి ఉండండి. నేను ఇప్పుడేవెళ్ళి నాన్నగారిని పిలుచుకుని వస్తాను" అన్నది సిసీ.

వారు లోనికి వెళ్ళారు. సిసీ వారు కూర్చోడానికి రెండు కుర్చీలను తెచ్చి వేసి, నమ్రతగా వారివద్ద శలవు తీసుకుని తాను తండ్రిని పిలుచుకుని రావడానికి వెళ్ళింది.

గది చిన్నది. పరిశుభ్రంగా లేదు. చిత్తుకాగితాలు చెదురు చెదురుగా పడేసి ఉన్నాయి. గదిలో ఒకమూలన కిటికీ, ఒక చిన్న అల్మారు ఉన్నది. అల్మారులో ఒక పాత లాంతరు. మరోమూల ఒక కుక్కిమంచం ఉన్నది. కుక్కిమంచంమీద మాసినదుప్పటి పరచి ఉన్నది. గోడకొయ్యకు నెమలి ఈకల టోపీ తగిలించిఉన్నది. సిసీ

తండ్రి అప్పుడప్పుడు నాటకాలలో వేషాలు వేస్తూ ఉంటాడు. అలాంటి సందర్భాలలో ఆ టోపీని ధరిస్తాడు.

మేడమీద మరికొన్ని అంతస్తులున్నాయి. సిసీ తన తండ్రి అక్కడ ఉన్నాడేమో చూడడానికి పై అంతస్తులకు వెళ్ళింది. కాని సిసీ నాన్నగారు అక్కడలేడు. అందుచేత సిసీ మళ్ళీ మేడమెట్లు దిగివచ్చి ఒకమాటు గదిలోకి తొంగిచూచి నాన్నగారు మేడమీదకూడా లేరండి, మరెక్కడికో వెళ్ళారు. నేను వెళ్ళి వెదికివస్తాను' — అనిచెప్పి వెళ్ళి పోయింది. ఆ అమ్మాయి చటుక్కున ఇలా చెప్పి వెళ్ళిపోయేసరికి బౌండర్బై, గ్రిండ్ ఒకరి ముఖాలు ఒకరు ఆశ్చర్యంతో చూచు కున్నారు.

రెండు మూడు నిముషాలు గడిచాయి. ఈలోగా ఒక యువకుడు ఆ గదిదగ్గరకువచ్చి గడపలో విల్చుని తన్నుతాను పరిచయం చేసుకుని లోపకి అడుగుపెట్టాడు. ఆ యువకుని ముఖంలో ఒక విధమైన విషాద రేఖ ద్యోతకమవుతూ ఉన్నది. మధ్యాపాపిట తీర్చి దువ్వుకున్నాడు. కొత్తకోటు ధరించాడు. కాళ్ళకు అంటిపెట్టుకుని ఉన్న లాగు తొడు క్కొన్నాడు. కంఠానికి మఫ్లర్ చుట్టబడి ఉన్నది. ఆ యువకునివెంట మరో కుక్రవాడుకూడా వచ్చాడు. కుర్రవానిపేరు "కూపిడ్" ఆ యువ కుడు గదిలో అడుగుపెట్టిన వెంటనే, "నాపేరు హైర్డర్స్అండి. సిసీ తండ్రి జూప్ను చూడడానికి వచ్చింది మీరేననుకుంటాను" — అన్నాడు.

"అవును. మేమువచ్చి చాలాసేపు కావస్తున్నది. సిసీ జూప్ను తీసుకుని రావడానికి వెళ్ళింది. కాని ఇంతవరకు తిరిగి రాలేదు. మేము అవసరంగా వెళ్ళవలసిన పనిఉన్నది. మేము వచ్చిన పనిని ఒక చీటీపై వ్రాసిఇస్తాము. మీరు దయచేసి ఆ చీటీని సిసీ తండ్రికి ఇవ్వ గలరా?" — అన్నాడు గింద్.

"మరోమాట మిత్రుడా! కాలం విలువను గ్రహించినవారం మేము, కాలం విలువను గ్రహించలేనివారు మీరు" — అన్నాడు బౌండర్బై. బౌండర్బై ఇలా అనేసరికి ఆ యువకుడు ఆశ్చర్య చకితుడైనాడు.

"అయ్యా తమ రెవరో నాకు తెలీదు. కాని ఇప్పుడు మీరన్న మాట నా దృష్టికి సహజంగా కనిపించడంలేదు, నేను నా కాలాన్ని డబ్బుగా మార్చగలిగినంత శీఘ్రంగా మీరు మీకాలాన్ని డబ్బుగా మార్చ గలరని - అంతకన్న ఎక్కువ శీఘ్రంగానే మార్చగలరని మీ వేష భాషలనుబట్టి తెలుస్తూనే ఉన్నది. అయినా తమవంటి పెద్దలు ఇలా మాట్లాడడం సబబుగాలేదు," అన్నాడు యువకుడు.

ఆ యువకునితో వచ్చిన కూపిక్ చిలిపి కుర్రవాడు.

"కాలాన్ని డబ్బుగా మార్చడమేకాదు. డబ్బుతో కొండలుకూడా కదలాడతను" - అన్నాడా కుర్రవాడు.

బౌండర్‌బై ఆ కుర్రవానివంక గ్రుడ్లురుమి చూచాడు.

"చూస్తూంటే ఈ కుర్రవాడు మహాఘటికుడల్లే కనుపిస్తున్నాడు" అన్నాడు గింద్.

యువకుడు చిరునవ్వు నవ్వాడు.

కూపిక్‌వైపు తిరిగి, "ఒరెయ్ నీవు ఊరుకోరా అబ్బాయ్"- అన్నాడు.

తరువాత ఆ యువకుడు గింద్‌వైపు తిరిగి మళ్ళీ ఇలా చెప్ప సాగాడు.

"అయ్యా! మీకు ఈ విషయం తెలుసునో తెలియదో మరి.- ఇటీవల కొన్నాళ్ళనుంచి జూప్‌కు అస్వస్థగా ఉన్నదండి. అంచాత అతను ఇంటికికూడా సరిగా రావడంలేదు. అంచాత మీరు ఏదైనా విశేషాన్ని అతనికి అందజేయదలిస్తే చెప్పండి. కాని అతడుప్రస్తుతం ఏ విషయాలూ పట్టించుకునే స్థితిలోలేడు. అయినా, మీరు ఎన్నడైనా జూప్‌ను చూచారా? జూప్‌ను ఎరిగి ఉన్నారా?"

"మేము ఇంతవరకు అతన్ని ఎన్నడూ చూడలేదు" అన్నాడు గింద్.

"ఇక అతన్ని చూచే అవకాశంకూడా ఉండదేమో అనుకుంటాను" అన్నాడు ఛైల్డర్స్.

"అతను తన కుమార్తెను వదిలాడంటావా?" అని ప్రశ్నిం చాడు గింద్.

"నా మనస్సుకు అలాగే తోస్తున్నది" అన్నాడు బైల్డర్స్.

తరువాత బౌండర్‌బై కల్పించుకుని ఇలా చెప్పసాగాడు :

"మంచిపనిచేశాడు! తన ప్రాణప్రదంగా చూచుకునే తన కుమార్తెను తనే విడిచి పెట్టాడన్నమాట! కాని యువకుడా! నీకు ఒక విషయం చెబుతాను. ఇలాంటి సంఘటనలు నీకు ఆశ్చర్యం కలిగించ వచ్చుకాని, నాకు మటుకు ఇలాంటి సంఘటనలు మామూలుగానే కనుపిస్తాయి. నా చిన్నతనంలో నేను ఇలాటి కష్టాలను ఎన్నిటినో రుచి చూచాను. మా అమ్మకూడా నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోయింది. నేనొక మురికివాడలో పుట్టాను. మా అమ్మ నన్ను విడిచి వెళ్ళిపోయింది. ఈనాటికీ గాయం నా గుండెలలో సెలవేస్తూనే ఉన్నది. నేను అమ్మను క్షమించలేక పోయాను. ఇకముందు కూడా క్షమించలేను. ఇందుచేతనే నావంశ కధ నేను చెప్పుకోను, నావంశాన్ని గురించి నేను గర్వించను. ఆ తరువాత నాకు వాస్తవ ప్రపంచం యథాతథంగా గోచరించింది. కలలన్నీ నశించాయి. ఇప్పుడు నాకు నలుపు తెలుపుగాకాని, తెలుపు నలుపుగాగాని కనుపించదు. జూప్ కధ వినగా, జూప్‌కూడా మా అమ్మ వలెనే కటికగుండెవాడని అని పిస్తున్నది."

"జూప్ ఎలాటి వాడయినా కావచ్చు. కాని జరిగిన వాస్తవాన్ని మటుకు మీకు తెలియచేశాను. కాని ఈ విషయాన్ని మీరు ఇక్కడ ప్రస్తావించకుండా ఉండడమే ఉచితంగా ఉంటుంది" — అన్నాడు బైల్డర్స్.

బౌండర్‌బై చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

బౌండర్‌బైని ఒకమారు ఆపాదమస్తకం పరిశీలించి గ్రింద్ వైపు తిరిగి బైల్డర్స్ ఇలా చెప్పసాగాడు :

"ఒక గంటక్రితం జూప్ తన కుమార్తెను ఏదో పనిమీద బైటికి పంపించాడు. తరువాత అతను హేటు తగిలించుకుని బట్టలు మూటకట్టి చంకక్రింద ఉంచుకుని ఎక్కడికో వెళ్లాడు. ఇహ అతను తిరిగి వస్తాడనే నమ్మకం లేదు."

"తండ్రి ఇలాటి పనిచేస్తే అమ్మాయిగతి ఏంకావాలి?" అని ప్రశ్నించాడు గ్రింద్.

"తండ్రి తనను త్యజించివెళ్లాడంటే సిసీ నమ్మదు" అన్నాడు బైల్డర్స్.

"అదేం ?" - అని ప్రశ్నించాడు గింద్.

"తండ్రీ కూతుళ్ళు జీవికాజీవికగా మసులుతూ వచ్చారు. ఈనాడు తండ్రి కుమార్తెను వదలి వెళ్ళాడంటే ఎలా నమ్మడం ?" - అన్నాడు బైల్డర్స్.

తరువాత బైల్డర్స్ మెల్లగా అడుగులువేస్తూ జూప్ ట్రంకుపెట్టె దగ్గరికి నడిచివెళ్ళి ట్రంకుపెట్టెని తెరిచి చూచాడు. పెట్టె ఖాళీగా ఉన్నది. బైల్డర్స్ కన్నులలో కన్నీళ్లు జలజలలాడాయి. "సిసీకి ఒక్క పైసాకూడా మిగల్చకుండా వెళ్ళాడు" అన్నాడు బైల్డర్స్.

తరువాత బైల్డర్స్ గ్రింద్‌వంక దీనంగాచూస్తూ ఇలా చెప్ప సాగాడు :

"సిసీని చదువులో పెట్టాలని జూప్ మొదటినుంచి అనుకుంటూ వచ్చేవాడు. ఆ భావం అతని మనస్సులో ఎలా ప్రవేశించిందోకాని - అతను సిసీని చదివించాలనే పట్టుమాత్రం వీడలేదు. ఈ ఏడు సంవత్సరాలూ సిసీకి ఎలాగోఒకలా కష్టపడి నాలుగు అక్షరం ముక్కలు వచ్చేలా చేశాడు. చివరకు సిసీని ఇక్కడ బడిలోచేర్చి అతను బ్రహ్మా నంద పడ్డాడు, నాలుగు అక్షరంముక్కలువస్తే సిసీ పొట్టపోసుకోలేక పోతుందా అని అతనిధైర్యం. మీరు సిసీకి ఏదైనా చిన్నమెత్తు సాయం చేసే ఉద్దేశంతో, ఈనాటిరాత్రి ఇక్కడికి వచ్చిఉంటే నిజంగా సిసీ చాలా అదృష్టవంతురాలన్నమాట."

"మేము అందుకోసం రాలేదు. పైగా మరో ముఖ్య విషయాన్ని తెలపడానికి వచ్చాము. సిసీవల్లమాబడి అప్రతిష్ట పాలవుతున్నది. అందుచేత సిసీ బడికి రావడానికి వీలులేదని తెలపడానికి వచ్చాము" - అన్నాడు గింద్.

గింద్ యిలా అనగానే బైల్డర్స్ తలవంచుకుని వసారా లోకి వెళ్ళి నిరీహంగా ఈలవేస్తూ నిల్చున్నాడు.

బౌందర్‌బై, గ్రింద్‌లు లోపల నిల్చుని తమలో తాము ఏదో మాట్లాడుకొనడం అతనికి వినిపించింది. ఈలోగా మేడమీద నివ

పిస్తున్న జనం క్రిందికి దిగివచ్చారు. వారు తమలోతాము మెల్లగా మాట్లాడుకుంటూ మేడమెట్లు దిగి వచ్చారు. ముగ్గురు నలుగురు ఆడబిడు చులు వారి భర్తలతోను, అత్తమామలతోను, పిల్లల్ని చంక నెత్తుకుని వచ్చారు. వీరందరూ గొప్ప ఆటగాళ్ళు. ఒకరు మరొకరిని, ఒకడు మరొకని ఒక గడ కొసన నిలబెట్టగల నేర్పరి. దొర్లుతున్న డ్రమ్ము లపై వీరు ఎంతో చులాగా నృత్యం చేయగలరు. పీపాలపై కాళ్ళుంచి విల్చోగలరు. ఆడంగులు త్రాటిపై గిరికీలు కొట్టగలరు. వీరి దుస్తులూ, ముస్తాబూ చూడడానికి కొంచెం ఎబ్బెట్టుగా కనుపిస్తూ ఉన్నప్పటికి, వీరి ముఖాలలో జాలి, దయ, తొణికిస లాడుతూ ఉన్నవి.

వీరందరూ వచ్చిన తరువాత స్లీరీ వచ్చాడు. స్లీరీ ఆజాను బాహువు. ఏనుగంత మనిషి. మాట్లాడితే సింహం గర్జించినట్లుగా ఉంటుంది. స్లీరీ ఉబ్బసం దగ్గు తెరను ఆపుకుంటూ, 'అయ్యలారా! నమస్కారం! తమరు దిక్కులేని చిన్నదానికి ఏదైనా సాయం చెయ్య డానికి వచ్చారనుకుంటాను' - అన్నారు.

'ఆ అమ్మాయితో ఒకవిషయం మాట్లాడడానికి వచ్చాము' - అన్నాడు గ్రిండ్ ముక్తసరిగా.

"మంచిది అయ్యగారూ; అయినా తమకు నేనొక చిన్న మనవి చేసుకుంటాను. చిన్నదాన్ని వదిలించుకోడం నా ఉద్దేశం కాదు. అది పైకిరావటానికి అడ్డు తగలడంకూడా నా ఉద్దేశంకాదు." - అని వరి దీన కంఠస్వరంతో ప్రార్థించ సాగాడు స్లీరీ.

ఈ సందర్భంలో స్లీరీ కుమార్తె జోసెఫైన్, "అదుగో నాన్నా సిసీ వచ్చేశింది" - అన్నది. జోసెఫైన్‌కు పద్దెనిమిదేళ్ళ వయస్సు. రెండేళ్ళకే వాళ్ళనాన్న దానికి గుర్రపుస్వారీ నేర్పాడు. పన్నెండేళ్ళ పిల్లయ్యేసరికి అది గుర్రపు స్వారీలో గొప్ప నేర్పరిగా తయారైంది.

"అదుగో సిసీ వచ్చేశింది" - అని జోసెఫైన్ అనేసరికి సిసీ అక్కడికి మెరుపుతీగలా పరుగుదీస్తూ వచ్చింది. సిసీ అందరూ అక్కడ పోగై ఉండడం చూచింది. అందరి ముఖాలవంక చూచింది. వారి వారి ముఖాలు అదోలా ఉన్నాయి. వారిచూపులలో ఏదో అవ్యక్తమైన జాలి ద్యోతకమవుతూ ఉన్నది. అందరూ అక్కడే ఉన్నారు. కాని

తనతండ్రి మటుకు అక్కడలేదు. సిసీ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. గొంతుకలో ఏడుపు ఉండలుఉండలుగా చుట్టుకుని వచ్చింది. సిసీ ఒక్క పరుగున ఒక వృద్ధురాలి వద్దకువెళ్ళి ఆ వృద్ధురాలి ఒళ్ళో తల దాచుకుని వెక్కి-వెక్కి ఏడవ సాగింది.

'ఎంత పాడుపని చేశాడు! చిన్నదాన్ని నట్టడివిలో వదిలి తన దోవన తాను వెళ్ళిపోయాడు' - అంటూ స్లీరీ సిసీ పట్ల సానుభూతి వెల్లడించాడు.

సిసీ వెక్కి వెక్కి ఏడుస్తూ యిలా విలపించసాగింది : 'నాన్నా! వెళ్ళిపోయావా? ఎక్కడికి వెళ్ళావు నాన్నా? నన్ను ఒంటరిగా వదిలి ఎక్కడకు వెళ్ళావు నాన్నా? నాకోసమే వెళ్ళావా నాన్నా? నా మంచి కోసమే వెళ్ళావా నాన్నా?' - ఇలా రాగాలుపెడుతూ సిసీ విలపించ సాగింది.

ఆ చిన్నపిల్ల చేతులు చాచి అలా విలపిస్తూవుంటే అక్కడ పోగై వున్నవారి హృదయాలు ద్రవించాయి. వారు ఏమీ మాట్లాడలేక పోయారు. చివరకు బౌందర్ బై కలగజేసుకుని, 'మీరంతా మాట్లాడకుండా కూచుంటే లాభంలేదు. అమ్మాయికి వున్న విషయం వున్నట్లుగా తెలియచెయ్యాలి' - అంటూ సిసీ వైపు తిరిగి, 'అమ్మాయ్! నీవు విలపించి లాభంలేదు. మీ నాన్న నిన్ను విడిచి వెళ్ళాడు. ఇహ అతను యీ జన్మలో నీకు కనుపిస్తాడని అనుకోకు. మీ నాన్నను మరిచిపో' - అన్నాడు.

తరువాత అక్కడ చేరినవారంతా 'ఎంత సిగ్గుచేటు పని చేశాడు!' - అని సిసీ నాన్నను ఆడిపోయసాగారు. స్త్రీలు 'వట్టి పశువు!' అంటూ అతనిపై శాపనార్థాలు కురిపించారు.

'అయ్యగారూ! మేమంతా పేదలం. అయినా మా హృదయాల్లో కల్మషం ఏమూల వెదికినా ఉండదు. తమరు ఏవిధంగానైనా దయ తలచి ఈ చిన్నదానికి చేతనైన సాయం చేయాలి' - అని కంపిత కంఠస్వరంతో ప్రార్థించసాగాడు స్లీరీ. తరువాత ఒకక్షణం ఆగి గ్రింద్ వారందరినీ నిశితంగా పరిశీలించి ఇలా అన్నాడు :

'అయితే, ఈ అమ్మాయి తండ్రి వెళ్ళిపోయాడన్నమాట. వెళ్ళిన వాడు తిరిగి రాడన్నమాట ఖాయమేనా?' -

'చిత్తం' - అన్నాడు స్లీరీ.

'అయితే, నేను ఒక విషయాన్ని సిసీ తండ్రికి తెలియచేసే ఉద్దేశంతో ఇక్కడికి వచ్చాను. నేను వచ్చేసరికి సిసీ తండ్రి ఇక్కడ లేకపోవడం విచారకరం. అయినా సిసీ తండ్రికి నేను చెప్పదలచిన విషయాన్ని మీకు చెబుతున్నాను. వినండి. ఇహనుంచి సిసీ మా బడికి రావడానికి వీలులేదు. అందుకు కారణాలు ఉన్నాయి. ఆ కారణాలను నేను మీకు చెప్పదలచలేదు. ఆ కారణాలను మీకుచెప్పి ప్రయోజనం కూడాలేదు. విషయాన్ని సిసీ తండ్రికి తెలిపే ఉద్దేశంతో నేను ఇక్కడికి వచ్చాను. కాని నేను ఇక్కడికి వచ్చేసరికి పరిస్థితులన్నీ మారి పోయాయి, అందుచేత నేనుకూడా నా నిర్ణయాన్ని మార్చుకోవలసి వచ్చింది. సిసీని పోషించి, చదువు చెప్పించి, పెంచి పెద్దదాన్ని చెయ్యడానికి నేను నిశ్చయించుకున్నాను. కాని ఇందుకు ఒక షరతు ఉన్నది. సిసీ ఈ విషయాన్ని ముందుగా నిశ్చయించుకోవాలి. సిసీ ఇక్కడే ఉండడమా, లేక నాతో కలిసి మా ఇంటికి రావడమా అనే విషయాన్ని నిశ్చయించుకోవాలి. నాతో కలిసి మా ఇంటికి వచ్చినట్లయితే, ఇక సిసీ ఇక్కడి వారితో సంబంధ బాంధవ్యాలు పూర్తిగా తెగిపోయినట్లుగానే స్థిరం చేసుకోవాలి' - అన్నాడు గ్రింద్.

ఆ తరువాత స్లీరీ మెల్లిగా గొంతు సవరించుకుని, 'అయ్యగారూ! ఉభయుల శ్రేయస్సును దృష్టిలో వుంచుకుని నేనుకూడా ఒక చిన్న మనవి చేస్తాను. సిసీ నాకు కూడా బిడ్డలాంటిది. నాకే కాదు. ఇక్కడున్న వారందరూ సిసీని తమ స్వంతబిడ్డలా చూచుకుంటారు. కాని నాదో చిన్న మనవి. సిసీ భవిష్యత్తు బాగుపడాలంటే సిసీ చదువుకోడమే మంచిది' - అన్నాడు.

గ్రింద్ తలపంకించి సిసీ వైపు తిరిగి, 'అమ్మాయ్! నీ శ్రేయస్సును దృష్టిలో వుంచుకుని నేను నీ కిచ్చే సలహా యిది. నీవు చదువుకుని పెరిగి పెద్దదానివై నీ కాళ్ళమీద నీవు నిలబడగలశక్తి తెచ్చుకోడమే నా అభిమతం' - అన్నాడు.

ఇంతసేపూ ఎమ్మాగార్డన్ ఒడిలో తలదాచుకుని ఏడుస్తూవున్న సిసీ యీ మాట విని తలయెత్తి అశ్రుపూరిత నయనాలతో తన అన్నదాత వంక చూచింది.

ఆ అమ్మాయి ముఖంలో కలిగిన యీ ఆకస్మికమైన మార్పును అక్కడ పోగైన వారందరూ గమనించారు, ఒక్కమాటు బరువుగా విశ్వసించి. 'ఇక అమ్మాయి వెళ్ళిపోతుంది' - అన్నారు.

'అమ్మాయ్! జాగ్రత్త! తొందరపడి నిశ్చయం చేసుకోకు' - అన్నాడు గ్రింద్.

"ఒకవేళ నాన్నగారు తిరిగివస్తే - ఆయన నన్ను ఎలా కనుక్కోగలుగుతారు?" - అన్నది సిసీ సంశయాత్మకంగా.

"నీవు ఆ బెంగ పెట్టుకోకు. మీ నాన్నగారు తిరిగివస్తే స్లీరీ మన చిరునామాను మీనాన్నగారికి తెలుపగలడు. కోక్‌టౌన్‌లో గింద్‌ను ఎరుగనివారెవరూ లేరు. ఫలానా గ్రింద్‌గారి ఇల్లు ఎక్కడా అంటే ఎవరైనా చెబుతారు" - అన్నాడు గ్రింద్.

తరువాత ఒకక్షణం మౌనంగా ఉండి సిసీ అక్కడ పోగైవున్న ఆడంగులవంక చూచి, "నా బట్టలు త్వరగా మూటకట్టి ఇవ్వండి. నా హృదయం బ్రద్దలైపోకముందే నన్ను వెళ్ళనివ్వండి" - అన్నది సిసీ.

అక్కడున్న స్త్రీ లందరూ లేచి లోనికివెళ్ళి సిసీ బట్టలను ఒక చిన్న మూటకట్టి తీసుకునివచ్చి సిసీకి ఇచ్చారు.

ఇంతసేపూ సిసీ కన్నీరు కారుస్తూ కూచుని ఉన్నది. గ్రింద్, బౌందర్‌బైలు తలుపు దగ్గర నిల్చుని ఉన్నారు. స్లీరీ గది మధ్యలో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. ఆడంగులంతా సిసీ బట్టలను మూటకట్టుకుని వచ్చిన తరువాత ఆడపిల్లను అత్తవారింటికి పంపినట్లుగా సిసీని సాగనంపసాగారు, కొందరు ఆడంగులు చెదిరిపోయి ఉన్న సిసీ జుట్టును మెత్తగా దువ్వి ఆప్యాయంగా ముద్దాడారు. మరికొందరు ఆడంగులు సిసీని బుజ్జగించారు. మరికొందరు సిసీని కౌగిలించుకున్నారు.

పిల్లలందరూ వచ్చి సిసీవద్ద సెలవు తీసుకున్నారు. తరువాత గ్రింద్ సిసీవంక నిశ్చితంగా చూచి, 'ఇక రా అమ్మాయ్, వెడదాం' - అన్నాడు.

అంతవరకూ గంభీరంగా ఉన్న స్లీరీ ఒక్కమాటుగా సిసీని కౌగిలించుకుని వెక్కివెక్కి ఏడవ సాగాడు.

'వెళ్ళి రామ్మా! నీ అదృష్టం ఎలా ఉన్నదో -! మా పేదల మధ్య ఉంటేమాత్రం నీవు ఏం బాగుపడుతావు! పెద్దలు నిన్ను చేర దీస్తున్నారు. వెళ్ళు తల్లీ - చివర మాటగా చెబుతున్నాను. నీవు వెళ్ళు తున్నచోట మంచిగా మసులుకుని మాపేరు నిలబెట్టు. అయ్యలమీద తిరుగుబాటు చెయ్యకు. వినయవిధేయతలతో మసులుకుని వారి మన్నన లకు పాత్రురాలవు కా. అప్పుడప్పుడూ మమ్మల్ని తలుచుకుంటూ ఉండి, పెరిగి పెద్దదానివై పెళ్ళాడాక ఒకమాటు వచ్చి మాకు కనుపించి పో' - అని కడసారి ఉపదేశం చేస్తూ స్లీరీ సిసీని వాకిటిదాకా సాగ నంపాడు. స్లీరీవెంట అక్కడున్న ఆడంగులూ పిల్లలూ అంతా వాకిటి దాకా వచ్చారు.

బట్టలమూట చంకన పెట్టుకుని మేడమెట్లు దిగుతున్న సిసీ చెవుల్లో స్లీరీ మాటలు మారుమ్రోగుతూనే ఉన్నవి.

# 7

బౌందర్‌బై బ్రహ్మచారి. అందుచేత అతని ఇంటి అజమా యిషీనంతా ఒక వృద్ధురాలు నిర్వహిస్తూ ఉంటుంది.

ఆవిడకు సంవత్సరానికి కొంతడబ్బు బౌందర్‌బై ముట్టచెబుతూ ఉంటాడు. ఆవిడపేరు స్పార్‌సిత్ సతీమణి.

స్పార్‌సిత్ సతీమణి సామాన్యురాలుకాదు. ఒకప్పుడు బాగా వెలిగినమనిషి. జీవితంలో ఎత్తుపల్లాలు చూచినది. అంతేకాదు, ఆవి డకు గొప్పగొప్ప వ్యక్తులతో పరిచయంకూడా ఉన్నది. ఆవిడ అత్త స్కాడ్జర్స్ గొప్ప శ్రీమంతురాలు. స్కాడ్జర్స్ ఈనాటికీ బ్రతికేఉన్నది. స్పార్‌సిత్ సతీమణి తనభర్తగారిని గురించి ఎంతో గొప్పగా చెబుతూ ఉంటుంది.

తనభర్త కుటుంబం చాలా గొప్పదనీ, ముఖ్యంగా తనభర్త తల్లివైపు వారి వంశీకులు చాలా గొప్పవారనీ స్వార్సిత్ సతీమణి అంటూ ఉంటుంది.

తనభర్త తల్లివైపు వంశీకులను పౌలర్‌లని పిలుస్తారు. పౌలర్ అంటే అదేమిటోనని క్రొత్తవారు భ్రాంతి పడవచ్చు. పౌలర్ అంటే అది ఒక వ్యాపార సంస్థో లేక రాజకీయ పార్టీ పేరో అని అనుకోవచ్చు. కాని పౌలర్ అంటే అవేమీకావు. ఒక పురాతన వంశం తాలూకు పేరు పౌలర్.

తల్లివైపునుంచి పౌలర్ వంశీకుడైన స్వార్సిత్ మహాశయుడు తండ్రిగారివైపు నుంచి స్కాడ్జర్స్ వంశీకురాలైన స్వార్సిత్ సతీమణిని వివాహ మాడాడు. స్వార్సిత్ సతీమణి మేనత్త స్కాడ్జర్స్ ఈనాటికీ సజీవంగానే ఉన్నదని ఇంతకు మునుపు పాఠక మహాశయులకు విన్న వించుకున్నాము. ఆవిడ తాటకిలాంటి మనిషి. ఆవిడ కంఠబిలంలో ఎన్ని పిశెల మాంసమైనా ఇట్టే పంచదార బిళ్ళలా కరిగిపోతుంది. ఆవిడ కొన్ని మాసాలనుంచి పక్షపాతంతో పీక్కుంటూ మంచం విడవకుండా ఉన్నది.

స్వార్సిత్ మహాశయునికీ, ఆయన సతీమణికీ వివాహం సంబంధం కుదిర్చి వివాహం జరిపించింది కూడా ఆవిడే.

వివాహం జరిగేనాటికి స్వార్సిత్ యువకుడు - మనిషి చూడ చక్కగా వుండేవాడు. ఎత్తయిన నుదురు. చక్కని, మెత్తని జుట్టు నుదుటికి అతికినట్లుగా వుండేది. కోటేరు వేసినట్లుగా వుండే నాసిక. భగవంతు డిచ్చిన అందంతోపాటు స్వార్సిత్‌కు తన బాబాయి తాలూకు ఆస్తికూడా సంక్రమించింది. కాని ఆస్తి తన చేతులకు వచ్చేసరికే ఆస్తికి మించిన అప్పులు చేసి కూచున్నాడు స్వార్సిత్. ఆస్తి చేతికి రాగానే యావత్తు ఆస్తీ అప్పులక్రింద కరిగిపోయింది. స్వార్సిత్ మహాశయుడు తన 24 వ యేట మరణించాడు. ఆయన మరణిస్తూ భార్యకు ఒక్క చిల్లిగవ్వకూడా మిగిల్చి వెళ్ళలేదు,

పైగా కొన్ని భేదాభిప్రాయాల కారణంగా వివాహం జరిగిన కొద్దిరోజులకే ఆయన భార్యతో విడివడడం సంభవించింది.

స్వార్సిత్ చనిపోయాక అనాధురాలైన స్వార్సిత్ సతీమణి స్కాడ్జర్స్‌తో భరణంకొరకు పోరాడవలసి వచ్చింది. కాని స్కాట్జర్స్ మొండిఘటం. ఎంగిలి మెతుకును కూడా విదల్చలేదు. అందుచేత స్వార్సిత్ సతీమణి యీ వృద్ధాప్యంలో బౌందర్ బై వద్ద జీతానికి కుదరవలసి వచ్చింది.

ఈనాటి ఉదయం బౌండర్ బై ఫలహారం సేవిస్తూ వుండగా స్వార్సిత్ సతీమణి టీ కలుపుతూ వున్నది.

బౌందర్ బై ఒక చక్రవర్తి అనీ, స్వార్సిత్ సతీమణి ఆయన చేబట్టిన రాకుమారి అనీ నిత్యం తాను రాజవీధిలో ఊరేగు సమయంలో ఆ రాకుమారిని కూడా తన పల్లకిలో తీసుకుని వెడతాడని మనం ఊహించుకున్నప్పటికీ, బౌందర్ బై యీనాడు ఆవిడ గౌరవించినంతగా అప్పుడు గౌరవించి వుండగలడని అనుకోలేము.

బౌందర్‌బై తన జీవితంలో సుఖంఅన్నది ఎరుగడు. అతను భోగలాలసుడు కూడా కాదు. అయినప్పటికి, స్వార్సిత్ సతీమణి జీవితాన్ని పూలబాటగా చెయ్యడానికి అతను అన్నివిధాలా యత్నించాడు. తన మిత్రులతోను, బంధువులతోను స్వార్సిత్ సతీమణి ప్రస్తావన వచ్చినప్పుడల్లా, "చూడండి, స్వార్సిత్ సతీమణి ఎంత అమాయకురాలో! నేను ఆవిడకు సంవత్సరానికి ఇచ్చే జీతం వంద పౌండ్లే, కాని ఆవిడ తనజీవితాన్నంతా నాకోసం ధారపోస్తూ ఉన్నది!"- అని ఆవిడను ప్రశంసిస్తూ ఉంటాడు. బౌందర్‌బై చాలా విచిత్రమైన వ్యక్తి, అతను తనను తాను ప్రశంసించుకోడం మాత్రమేకాక, ఇతరులను కూడా తనను ప్రశంసించేలా చెయ్యగల శక్తిసామర్థ్యాలు గల వ్యక్తి.

ఈ లక్షణం ఒక అంటువ్యాధిలాగ కోక్‌టౌన్‌లో ఉన్న పెద్దలందరికీ వ్యాపించి అంటుకున్నది. కోక్‌టౌన్‌లో ఏ పండగ జరిగినా పబ్బం జరిగినా బౌందర్‌బై ప్రస్తావన రాకుండా పోదు. అతని ప్రస్తావన వచ్చినప్పుడు, అక్కడచేరిన పెద్దలు అతన్ని ప్రశంసించకుండా ఉండలేకుండా ఉండరు. ఈ రోజున ఎందుచేతనో కాని బౌందర్‌బై మెల్ల మెల్లగా ఫలహారం పుచ్చుకుంటూ ఉన్నాడు. అతను పరధ్యానంగా

ఉన్నాడు. స్వార్సిత్ సతీమణి అతను మెల్లగా ఫలాహారం సేవించడం గమనించి, "మిస్టర్" బౌందర్‌బై, ఏమిది ఈరోజున ఇంతమెల్లగా ఫలహారం పుచ్చుకుంటున్నారు ?" - అని ప్రశ్నించింది.

'గ్రింద్ చేసిన పనిని గురించి ఆలోచిస్తూ ఉన్నాను. పెంటదిబ్బ మీద పెరిగే పిల్లను తెచ్చిపెంచాలనే ఊహ అతనికి కలగడం విచిత్రంగా లేదూ?' - అన్నాడు బౌందర్‌బై.

'ఇప్పుడు ఆ అమ్మాయి ఇక్కడే ఉన్నది. ఇప్పుడు ఎక్కడికి వెళ్ళాలో ఆ అమ్మాయికి అర్థం కాకుండా ఉన్నది. గ్రింద్‌గారి ఇంటికి వెళ్ళాలా లేక బడికి వెళ్లాలంటే సంశయంలోపడి కొట్టుకుంటూ ఉన్నది ఆ అమ్మాయి' - అన్నది స్వార్సిత్ సతీమణి.

'గ్రింద్ కొద్దిసేపులో ఇక్కడికి వస్తాడు. అతను ఆ విషయాన్ని తేల్చేస్తాడు. మరి రెండురోజులు ఆ అమ్మాయి మన ఇంట్లోనే ఉండవలసివస్తే, ఆ అమ్మాయి మన ఇంట్లోనే ఉండవచ్చు' - అన్నాడు బౌందర్‌బై.

'చిత్తం' - అన్నది స్వార్సిత్ సతీమణి.

'ఆ అమ్మాయికి ఒకమాటు జీవితంలోని మంచిచెడ్డలను గురించి చెబుతానని గతరాత్రి గింద్‌తో చెప్పాను. లూసాతో స్నేహం చెయ్యాలంటే అందుకు ఆ అమ్మాయిని తగినదానినిగా చెయ్యడం మన ధర్మం' - అన్నాడు బౌందర్‌బై.

'మీరు అలా నిశ్చయించుకోడం ఎంతో ఉచితంగా ఉన్నది' - అన్నది స్వార్సిత్ సతీమణి.

స్వార్సిత్ సతీమణి టీ కలపడం పూర్తిచేసింది, ఒక కప్పులో టీ పోసి బౌందర్‌బైకి అందించి మరో కప్పులో టీ కలుపుకుని తాను త్రాగడం మొదలెట్టింది.

'అమ్మాయి యీ పిల్ల స్నేహంచేసి బాగుపడుతుందని నేను అనుకోను' - అన్నాడు బౌందర్ బై.

'మీరు గ్రింద్‌గారి కుమార్తె లూసాను గురించి కదూ మాట్లాడుతున్నారు ?' - అని ప్రశ్నించింది స్వార్సిత్ సతీమణి.

'అవును' - అన్నాడు బౌందర్ బై.

'మీకు అమ్మాయి లూసా అంటే ఎంతో ప్రేమ. లూసాకు మీరు మరో తండ్రివంటివారు' - అన్నది స్వార్సిత్ సతీమణి.

అప్పుడు ఆవిడ ముఖం ఎంతో గంభీరంగా కనుపించింది.

'లూసాకు నేను మరో తండ్రివంటివాడిని అవునో కాదో కాని, టామ్‌కు మటుకు నేను మరో తండ్రివంటివాడినే. ఇందులో సందేహం ఎంతమాత్రం లేదు, నేను టామ్‌ను దగ్గరకుతీసి నా ఆఫీసులో వుంచుదామని అనుకుంటున్నాను' - అన్నాడు బౌందర్ బై.

టామ్‌కు ఆఫీసు పని నిర్వహించేటంత వయస్సు వున్నదంటారా?' - అని ప్రశ్నించింది శ్రీమతి స్వార్సిత్.

'ఆఫీసు పనిలోకి టాంకు తీసుకుంటానని అంటే యీ రోజే తీసుకుంటానని కాదు నా భావం. వాడి చదువు పూర్తయ్యాకనే తీసుకుంటాను. ముందు టామ్ ఒడి చదువు పూర్తిచెయ్యాలి. నిజం చెప్పాలంటే నా ఉద్దేశంలో ఆ చదువులకు ఏమాత్రం అర్థంలేదు. అయినా, ఎందుకైనా ఆ చదువును కూడాపూర్తిచెయ్యడం మంచిది. ఆ చదువులు పూర్తిచేసిన తరువాత కాని ఆ చదువులలోని నిస్సారత సరిగ్గా తెలిసిరాదు.

టామ్‌కూడా ఇలాగే చెయ్యాలని నా ఉద్దేశం" - అన్నాడు బౌందర్‌బై.

తరువాత ఒకక్షణంఆగి తిరిగి మళ్ళీఇలాచెప్పసాగారు:"విన్నావా అమ్మా - జీవితం చాలా విచిత్రమైంది. కష్టసుఖాలు కావడికుండల వంటివి, ఒకప్పుడు - అంటే - నా చిన్నతనంలో నేను చేతిలో చిల్లిగవ్వకూడా లేకుండా వీధులవెంట బికారివలె సంచారం చేస్తూ ఉన్నప్పుడు - నీవు ఒకమహారాణిలాగ ఉన్నావు. అప్పుడు నిన్ను ఒకమాటు చూచినట్టుగాకూడా నాకు జ్ఞాపకం. చక్కగా అప్సరసలాగ ముస్తాబై నీవు ఒక ఇటాలియన్ ఒపెరా హాలులోనుంచి బైటికి వస్తున్నావు. అప్పుడు నిన్ను చూచాను. నీశీవీ, నీ అందమూ నన్ను విహ్వలుణ్ణి చేశాయి. నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. అప్పుడు నిజంచెప్పాలంటే - నీ పాదరక్షలు మోసే అర్హతకూడా నాకు లేదు" - అన్నాడు బౌందర్‌బై. శ్రీమతి స్వార్సిత్ చిరునవ్వు నవ్వి, "అవును. మీరు

చెప్పింది ముమ్మాటికీ సత్యం. చిన్నతనంలో ఇటాలియన్ ఒపెరా నాటకాలను చూడాలని నేనెంతో సంబరపడేదాన్ని" - అన్నది.

'అవునమ్మా నువ్వు చిన్నతనంనుంచి పూలలో పెరిగావు. నేనేమో ముళ్ళలో పెరిగాను. ముళ్ళబాటలో నడిచాను. వీధులే నాకు ఇండ్లు. వీధిబాటలే శయ్యా తలములు - హంసతూలికా తల్పంపై సుఖ నిద్ర చెందడానికి అలవాటు పడిన నీకు వీధిలో నిద్రించే నాలాటి అభా గ్యుని బాధ అర్థం కావాలంటే అర్థమవుతుందా? నృత్య గాన వినో దాలు - పండగలూ పబ్బాలూ - ఉత్సవాలూ మేళాలూ - ఇలాటివి నీకు అర్థమవుతాయి' - అన్నాడు బౌండర్‌బై.

తరువాత శ్రీమతి స్పార్సిత్ బరువుగా నిశ్వసించి ఇలా అన్నది. 'మీరు అలా భావించకూడదు. జీవితంలోని కష్టసుఖాలను నేనూ చవి చూచాను. జీవితంలో కష్టాలు వచ్చినప్పుడు ఆ కష్టాలను ఓరిమితో భరించి కొత్త అనుభవాలను జీర్ణించుకుని కొత్త మార్పులను అను గుణంగా జీవితాన్ని సరిపెట్టుకోడం నేర్చుకున్నాను. మీరు చెప్పదలిచే బాధలూ గాధలూ నాకు అపరిచితమైనవి కావు.'

తరువాత బౌండర్‌బై ఇలా అన్నాడు: 'అవునమ్మా - నీవు చెప్పినమాట వాస్తవమే. కాని ప్రపంచంలో కొందరు మనుష్యు లుంటారు, వాళ్ళకు వారిబాధలను ఇతరులతో చెప్పుకుంటేనే కాని గుండెబరువు తీరదు. ఇలాటి వ్యక్తులలో నేనూ ఒకణ్ణి ఇక నీవంటావా- నీవు భోగభాగ్యాలు అనుభవించినదానివి'—

'అవునండి. ఆ మాట నేను కాదనను' - అన్నది శ్రీమతి స్పార్సిత్.

"అంతేకాదు - నీవు మహోన్నతమైన వర్గాలతో కూడా సంచ రించావు. నీవు సంచరించిన వర్గాల ఔన్నత్యం ఎంత గొప్పదో నాకు తెలుసు" - అన్నాడు బౌండర్ బై.

'చిత్తం. అందులో సందేహం ఎంతమాత్రం లేదు' - అన్నది శ్రీమతి స్పార్సిత్ వినమ్రధోరణిలో.

ఈ సంభాషణ ధోరణిలో బౌండర్‌బై ఫలహారం పూర్తి చేశాడు. తేనీరు సేవించాడు.

శ్రీమతి స్వార్సిత్ చిరునవ్వు నవ్వుతూ, 'అమ్మాయి సిసీని యిక్కడికి పంపమంటారా?' - అని అడిగింది.

'మంచిది' - అన్నాడు బౌందర్ బై.

ఈలోగా అక్కడికి టాం, లూసాలు కూడా వచ్చారు. కొద్ది క్షణాల తరువాత శ్రీమతి స్వార్సిత్ సిసీని ఆ గదిలో ప్రవేశపెట్టింది. సిసీ భయ భయం గదిలో అడుగుపెట్టి, అక్కడున్న అందరికీ నమస్కరించింది. పొరబాటున శ్రీమతి స్వార్సిత్‌కు నమస్కరించడం మరిచిపోయింది. ఈ విషయాన్ని గమనించిన బౌందర్ బై సిసీకి ఈ క్రింది విధంగా ఉపదేశించసాగాడు :

'అమ్మాయ్ - చూడమ్మా - సిసీ - ఆ టీ కెటిల్ దగ్గర నుంచున్న స్త్రీ ఎవరో చెప్పమ్మా - ఆవిడ పేరు నీకు తెలుసా? ఆవిడ పేరు శ్రీమతి స్వార్సిత్ ఆవిడ నా గృహం తాలూకు యజమానురాలు.

శ్రీమతి స్వార్సిత్ సామాన్యురాలు కాదు. ఎన్నో గొప్పగొప్ప పరిచయాలున్న వ్యక్తి. కాబట్టి నీవు ఈవిడను గౌరవించవలసిన అవసరం ఉన్నది. ఇప్పుడు నీవు ఆవిడకు నమస్కరించడం మరిచి పోయావు. నాకు నీవు నమస్కరించినా నమస్కరించక పోయినా నేనంత పట్టించుకోను- నేను సామాన్యుణ్ణి. కాని శ్రీమతి స్వార్సిత్ నాలాంటిది కాదు. నీవు ఆవిడను విధిగా గౌరవించవలసి ఉన్నది".

'అమ్మాయి బహుశా పొరబాటుపడి ఉండవచ్చును. మీరు అలా కోప్పడకండి' - అన్నాడు గింద్.

'నా విషయంలో నేను ఎన్ని పొరబాట్లనయినా క్షమిస్తాను. కాని శ్రీమతి స్వార్సిత్ విషయంలో ఎవరు పొరబాటు చేసినా నాకు క్షమించ రాని కోపం కలుగుతుంది' - అన్నాడు బౌందర్ బై.

'తమరు చాలా మంచివారు, బౌందరుబై. కాని అమ్మాయి పొర బడి ఉంటుందనే నా నమ్మకం కూడా - అన్నది శ్రీమతి స్వార్సిత్.

ఇంతసేపూ, బౌందర్‌బై మహాశయుని ఉపదేశ సారాన్ని వింటూ, ఉబికివస్తూఉన్న కన్నీరు ఆపుకుంటూ ఒకమూల ఒదిగి నిల్చుని ఉన్న సిసీని గింద్ దగ్గరకు పిలిచాడు. సిసీ భయంతో మెల్లగా పిల్లి లా అడుగులువేస్తూ అతని దగ్గరకు వచ్చింది. తదేక దృష్టితో గింద్ వంక

చూడసాగింది. గింద్ ప్రక్కనేఉన్న లూసా చూపులతో నేలపై చాప అల్లుతూ ఉన్నది.

దగ్గరకు వచ్చి ఎదురుగా నిల్చున్న సిసీవంక ఏకాగ్ర దృష్టితో చూస్తూ గింద్ ఇలా చెప్పసాగాడు: 'అమ్మాయ్! సిసీ! నిన్ను నాతో పాటు మా ఇంటికి తీసుకుని వెళ్ళడానికి నిశ్చయించుకున్నాను. నిన్ను బడికి పంపి చదువుకూడా చెప్పించదలిచాను. బడికి వెళ్ళే సమయాలలో నీవు బడికి వెళ్ళాలి. బడికి వెళ్ళని సమయాలలో నీవు నాభార్యకు సేవచేస్తూ ఉండాలి - నాభార్య అనారోగ్యం మనిషి. అంచాత అనవరతమూఆవిడకు ఎవరోఒకరు సేవచెస్తూ ఉండవలసిన అవసరం ఉన్నది. మా అమ్మాయి లూసాకు నీ విషయమంత వివరంగా చెప్పాను. నీ జీవితంలో జరిగిన విషాద సంఘటన లూసాకు తెలుసును. కాని నేను నీ శ్రేయస్సును కోరి నీకు ఒకచిన్న సలహాను ఇవ్వదలిచాను. నీవు గతాన్ని యావత్తూ విస్మరించడం మంచిది. గతాన్ని నెమరు వేసు కోడంవల్ల నీకు వచ్చే లాభమేమీ లేదు. నీవు ప్రస్తుతం నూతన జీవిత ప్రాంగణంలో అడుగు పెట్టినట్టుగా భావించు' -

'చిత్తం' - అన్నది సిసీ.

"ఇక నీ చదువువిషయం కూడా నీకు కొంత చెబుతాను విను. నిన్ను మామూలు ధోరణిలో అందరూ చదువుకున్న విధంగా చదివించడం నా ఉద్దేశంకాదు. నిన్ను ప్రత్యేకంగా ఎంతో శ్రద్ధతో చదివించడం నా అభిమతం. అందువల్ల నీకేకాదు - నీతో పరిచయం కలిగే ప్రతివారికీ లాభం ఉంటుంది. నిన్ను మరోవిషయం అడగ దలుచుకున్నాను. నీవు మీనాన్నకి ఎప్పుడైనా పుస్తకాలు చదివి వినిపిస్తూ వచ్చేదానివికదూ ?" - అని ప్రశ్నించాడు గ్రింద్.

"చిత్తం. మా నాన్నకి ప్రతినిత్యం పుస్తకాలు చదివి వినిపిస్తూ వచ్చేదాన్ని. ఆరోజులు ఎంతో హాయిగా గడిచేవి" - అన్నది సిసీ.

సిసీ ఇలా అనేసరికి లూసాకు దుఃఖం పెల్లుబికి వచ్చింది. తల వంచుకుని నేలవంకచూస్తూ ఉన్న లూసా తలఎత్తి ఒకమాటు సిసీవంక చూచింది.

"అయితే ఇంతకూ - అమ్మాయ్ - నీవు మీ నాన్నకి ఏ ఏ పుస్తకాలు చదివి వినిపిస్తూ వచ్చేదానివి ?" - అని ప్రశ్నించాడు గ్రిండ్.

"దేవతల కథలూ, మంత్రగాళ్ళ కథలూ చదివి వినిపించేదాన్ని" - అన్నది సిసీ.

సిసీ ఇలా అన్నదో లేదో సిసీ గొంతుకలో ఏడుపు ఉండలు చుట్టుకుని వచ్చింది.

తరువాత గ్రిండ్ బౌండర్‌బై వైపుచూచి, "మిత్రుడా ! ఇది నా జీవితంలో ఒక నూతన అనుభవం ఎలా పరిణమిస్తుందో చూడాలి"- అన్నాడు.

"మంచిది. మంచిచెడ్డలు అనుభవంమీదనే తెలుస్తాయి" - అన్నాడు బౌండర్‌బై. ఆ తరువాత గ్రిండ్, లూసా, సిసీని తమ గృహానికి తీసుకుని వెళ్ళారు. త్రోవలో లూసా సిసీతో ఒక్క మాట కూడా మాట్లాడలేదు.

# 8

ఆరు సంవత్సరాలక్రితం ఓ చిన్న గమ్మత్తు సంఘటన జరిగింది.

లూసా ఒకనాడు తమ్ముడు టాంతో ఏదో పిచ్చాపాటీ మాటాడుతూ, 'టాం, నాకు ఒక విషయం ఆశ్చర్యకరంగా వున్నది !' అన్నది. సరిగా ఆ సమయంలో ప్రవేశించి ఆ మాటలను విన్న గ్రిండ్, 'అమ్మాయి లూసా - జీవితంలో దేన్నిచూచి కాని ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు' - అన్నాడు గిండ్ మహాశయుడు. తన పిల్లలపట్ల అమలుపరిచే విద్యా విధానం తాలూకు మూలరహస్యం యిదే. కల్పనలకు కలంకూ ఆవగింజంతయినా చోటుండరాదు. ఆలోచన మరలాగ పనిచెయ్యాలి. హృదయం, ఉద్వేగం, అనుభూతి, అనురాగం, అనుబంధం, - ఇలాటి భ్రాంతిజనిత ఉన్మాద వైపరీత్యా లన్నిటిని విసిరి గిరాటెయ్యాలి. బ్రతుకంతా ఒక లెక్క లాంటిది. కూడిక, తీసివేత,

భాగారింపు, హెచ్చవేత బ్రతుకనే భవనానికి నాలుగు స్తంభాల్లాంటివి. కొండంత సమస్యనయినా లెక్కప్రకారం పరిష్కరిస్తే గోటితో గిల్లి వేసినట్లు గిల్లివెయ్యవచ్చు.

కోక్ టౌన్‌లో బాలబాలికల జీవితాలను పాలించేది 'ఆశ్చర్యానికి జీవితంలో తావులేదు' - అనే యీ మహా మంత్రరాజమే. పిల్లలు ఏడాది పిల్లలు కావచ్చు, రెండేళ్ళ పిల్లలు కావచ్చు, 5, 10 సంవత్సరాల పిల్లలూ కావచ్చు. కాని పిల్లలందరూ ఆహరహాలూ యీ మహా మంత్రాన్ని జపించి తీరవలసిందే. ఈ పిల్ల మనస్తత్వాలు విభిన్నమైనవి కావచ్చు. వీరి మనస్తత్వాల ధోరణులలో విభిన్నరీతులూ వుండవచ్చు. కొందరు జీవితమంతా పరస్పర విశ్వాసంపై ఆధారపడి వున్నదని అనుకోవచ్చు. మరికొందరు జీవితానికి రాజకీయ, ఆర్థిక శాస్త్రం పునాది అని భావించవచ్చు. కొందరు విజ్ఞానాన్ని ఆశ్రయించవచ్చు. కొందరు వినోదాన్ని ఆశ్రయించవచ్చు.

కాని ఈ పిల్లలందరికి జీవితంలో మూలసూత్రం, 'జీవితంలో దేనికీ ఆశ్చర్యపడవలసిన అగత్యం లేదు' - అది ఒక్కటి మాత్రమే. కోక్ టౌన్‌లో ఒక గ్రంథాలయం ఉన్నది. అందరికీ అందుబాటులో ఉన్న గ్రంథాలయం అది. ఎవరైనాసరే ఆ గ్రంథాలయానికి వెళ్ళి ఆ గ్రంథాలను చదువుకోవచ్చు. విజ్ఞానాన్ని ఆర్జించుకోవచ్చు. కాని గింద్‌కు ఒకబెంగ పట్టుకుంది. దాన్ని బెంగ అనడంకంటె బాధ అనడమే ఎక్కువ ఉచితంగా ఉంటుంది. "ఇందరు ప్రజలు ఈ గ్రంథాలయానికి వెడుతూ ఉన్నారు. ఈ ప్రజలు ఎలాటి గ్రంథాలు చదువుతూ ఉన్నారో - అవగతం కాకుండా ఉన్నది" - అని గింద్ విచారించసాగాడు. ఇహ ఈ గ్రంథాలు చదువుతున్న ప్రజలు మాట్లాడే మాటలను పరిశీలిద్దామా అంటే ఆ మాటలు మరీ విడ్డూరంగా కనిపిస్తున్నవి. వారి అభిప్రాయాల మహాసముద్రంలో మనిషి వస్త్రోత పిచ్చివాడై కాని పైకి తేలిరావడం లేదు. ఆ గ్రంథాలయంలోని గ్రంథాలను పఠించే పాఠకులకుకూడా ఈ విషయం ఎంతో ఆశ్చర్యకరంగా కనుపిస్తూ ఉన్నది. మానవ స్వభావాలు, మానవుల ఉద్వేగాలు, జయాపజయాలు, కష్టసుఖాలు, మంచిచెడ్డలు, జనన మరణాలు - ఈ ద్వంద్వాలను భావా

అన్నీ వారికి ఆశ్చర్యకరంగా కనుపిస్తూ ఉన్నవి. గిందీకు ఈ పాఠకుల స్వభావం చాలా విపరీతంగా కనుపించిసాగింది.................అనాటి సాయంత్రం గింద్ ఇంట్లో లూసా, థామస్‌లు ఈ క్రిందిరీతిగా సంభాషించుకోసాగారు.

"లూసా, నాకు జీవితమంటే రోతకలిగింది. ఈ ప్రపంచంలో నేను ఒక్క నిన్నుతప్ప మరెవరినీ ప్రేమించలేకుండా ఉన్నాను" - అన్నాడు థామస్.

"నీవు సిసీనికూడా ద్వేషిస్తూ ఉన్నావా టాం ?" - అని ప్రశ్నించింది లూసా.

"సిసీని జూప్ అని పిలవడం నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు. అందుచేత సిసీకి నేనంటే కోపం" - అన్నాడు టాం.

"సిసీకి నీవంటే కోపంలేదు టాం. నాకు గట్టిగా తెలుసు" - అన్నది లూసా.

"కోపం ఉండితీరాలి. కోపం లేదని ఊహించడానికి ఎంతమాత్రం అవకాశం లేదు, మనలాటి వాళ్ళతో సిసీకి పొత్తు కుదరదమనేది వట్టి భ్రాంతి. ఇప్పటికే సిసీ సగమైంది. వెలిగించిన కొవ్వొత్తి లాగ కరిగిపోతూ ఉన్నది."

థామస్ కుర్చీలో వెనక్కు వాలి అర్ధనిమీలితాలైన అలోచనాలతో ఏదో ఆలోచిస్తూ ఈ వాక్యాలను చెప్పసాగాడు. లూసా ఒకమూలన కూచుని ఉన్నది. మరో మూలన పొయ్యిలో నిప్పు చిటచిట మని రగులుకుంటూ ఉన్నది.

"నా మటుకు నేను గాడిదలా మొద్దుఘటాన్ని. అదేం చిత్రమో- నాకు గాడిదలా మొద్దుగా ఉండాలని, గాడిదలా తన్నాలని, అనిపిస్తూ ఉంటుంది" - అన్నాడు టాం.

"నన్నుమటుకు తన్నాలని అనిపించదు కదా" - అన్నది లూసా -చిరునవ్వు నవ్వుతూ.

"అలాటి చెడు ఉద్దేశం నాకు ఎన్నడూ కలగదు లూసా. ఈ లోకంలో నేను గౌరవించే వ్యక్తివి నీవు ఒక్కదానివే. నీవే లేక

పోతే జైలాంటి యీ యింట్లో నేను ఒక్క నిమిషం కూడా నిలవగలిగి వుండేవాణ్ణి కాదు" - అన్నాడు థామస్.

"టాం - ఈ మాటలు నిజంగా నీవు హృదయపూర్వకంగానే అంటున్నావా ?" - అన్నది లూసా.

"అవును. ముమ్మాటికీ" - అన్నాడు థామస్.

లూసా కాసేపు మౌనంగా చిటపటమని రగులుతూవున్న రవ్వలవంక చూచి మళ్ళీ యిలా చెప్పసాగింది :

"టాం - ఇప్పు డిప్పుడు - నాకు వయస్సు పైబడుతూవున్న కొద్దీ నాకు ఒక విషయాన్ని గురించి ఎంతో బెంగగా వున్నది.

ఈ యింట్లో నీవు సుఖంగా వుండేట్లు చెయ్యడానికి ఎన్నో విధాలుగా యత్నించాను. కాని నా యత్నాలనీ విఫలమైనాయి. నీ వన్నట్టు నిజంగా యీ యిల్లు బందిఖానా లాంటిదే. నీతో కలిసి నేను ఆటలాడుకోడానికి వీలులేదు. పాటలు పాడుకోడానికి వీలులేదు. మనస్సు విచ్చి మాట్లాడే అవకాశం లేదు. నీవు ఆలోచనతో అలసి వున్నప్పుడు కులాసా కబుర్లను చెప్పికాని, కులాసాగా వుండే పుస్త కాలు చదివి వినిపించికాని నీ మనస్సుకు ఆనందం కలిగించడానికి వీలులేదు".

"దీని విషయమే కాదు - నా విషయం కూడా అంతే లూసా. నాన్నగారు నన్నుకూడా ఒక మొద్దుగాడిదను తయారుచేసినట్లు తయారు చేస్తున్నారు" - అన్నాడు థామస్.

"అవును టాం. మనం ఇరువురం అభాగ్య జీవులం" - అన్నది లూసా.

"నీవు ఆడపిల్లవు, నీవు ఎలాగో ఒకలాగ ఈ చీకటి కూపం నుంచి బైట పడవచ్చు. కాని, మరి నేనో ; ఈ చీకటి కూపంలో ఇలా క్రుగ్గిపోవలసిందే. నాకు ముక్తిమార్గ మనేదిలేదు. ఈ చీకటి బావినుంచి బైట పడడానికి నాకు దోవ చూపవలసిన దానివి నీవే" - అన్నాడు థామస్.

"నీవెంతో మంచివాడివిరా అన్నాయ్ అన్నది లూసా.

"యీ లెక్కలూ డొక్కలూ అన్నీ సేకరించి ఒక్కమాటుగా వీటిని ఫిరంగిగుండు పేల్చి ధ్వంసం చేయాలని అనిపిస్తోంది. నేను బౌందర్‌బైతో కలిసి నివసించడానికి వెళ్ళినప్పుడు నాపగ తీర్చు కుంటాను" - అన్నాడు థామస్.

"పగ తీర్చుకుంటావా టాం ?" - అని ప్రశ్నించింది లూసా.

"అవును, అప్పటికి కాని నా పగ తీరదు. అప్పుడుకాని నాకు ఊపిరి సలపదు" - అన్నాడు థామస్.

"కాని, ఒకవిషయంలో నీవు పొరబడుతూ ఉన్నావేమో అను కుంటాను. బౌందర్‌బై కూడా నాన్నగారిలాంటి వాడే. ఒకవిధంగా బౌందర్‌బై నాన్నగారికంటెకూడా ఘటికుడు" - అన్నది లూసా. ఇప్పటికి బాగా చీకటిపడింది. గోడమీద వా రిరువురి నీడలు స్పష్టంగా కనుపిస్తున్నాయి.

"బౌందర్‌బై ఎంత మొండిఘటమైనా ఆ ముసలాణ్ణి దువ్వి వంచుకొచ్చే పద్ధతులు నాకు తెలుసు" - అన్నాడు థామస్.

"ఆ పద్ధతులు ఏమిటి చెప్పవూ ?" - అని ప్రశ్నించిందిలూసా.

"చెప్పనా ? అదేం పెద్ద రహస్యం కాదు. అతన్ని వంచుక రావాలంటే అందుకు తగినదానివి నీవు ఒక్కతెవే. బౌందర్ బైకి నీవంటే ఎంతో గారాబం, ముద్దూ-. నీవు ఎలా ఆడిస్తే బౌందర్ బై అలా ఆడతాడు. నీవు నందిని పంది అనమంటే అంటాడు. పందిని నంది అన్నమన్నా అంటాడు.

విన్నావా మరి నా పథకం ? - అన్నాడు థామస్.

లూసా మరి జవాబు చెప్పలేదు. థామస్ కుర్చీలో మేనువాల్చి బద్ధకంగా ఆవులించాడు.

కొద్దిక్షణాల తరువాత ఎంతకూ లూసా మాట్లాడకుండా వుండే సరికి, "లూసా నిద్రపోయావా ?" - అని అడిగాడు.

"లేదు టాం. రగులుకుంటూవున్న పొయ్యివంక చూస్తూ వున్నాను" - అన్నది లూసా.

"నిప్పురవ్వలలో నీ కేదో రహస్యం కనుపిస్తూ వుందను కుంటాను. ఆ రహస్యాన్ని నేను గుర్తించలేను" - అన్నాడు థామస్.

తరువాత కొద్దిసేపు మౌనంగా ఊరుకుని లూసా అన్నగారిని ఇలా ప్రశ్నించింది.

"అయితే, అన్నయ్యా నీవు బౌండర్‌బైగారి ఇంటికి వెళ్ళడం వల్ల నీకు ఇక్కడికంటె ఎక్కువ సుఖంగా ఉంటుందని ఊహిస్తున్నావా ?" - అన్నది.

'సుఖదుఃఖాల మాట అలా వుంచు. మొత్తంమీద బందిఖానా లాంటి యీ యింటినుంచి బైటపడినవాణ్ణవుతాను' - అన్నాడు టామ్.

'అవును నిజమే' - అన్నది లూసా రుద్ధకంఠస్వరంతో.

'మిమ్మల్ని - అందులోనూ ముఖ్యంగా నిన్ను వదిలి వెళ్ళడం నాకు సుతరామూ యిష్టంలేదు. అయినా వెళ్ళక తప్పదు. వెళ్ళితీరాలి'- అన్నాడు థామస్.

థామస్ యిలా మాట్లాడుతూ వున్నంతసేపూ లూసా నిప్పుల పొయ్యివంక తదేకదృష్టితో చూస్తూ పరధ్యానంగా కూచుని వున్నది.

'టామ్ - ! నా మనస్సులో ఏవేవో భావాలు గాలిపటాలవలె ఎగురుతూ ఉన్నవి. ఒక్కొకసారి ఈ భావాలు సుడిగుండాలవలె పరిభ్రమిస్తూ ఉంటాయి. ఈ భావాలను నాకు నేనే సమన్వయించుకోలేకుండా ఉన్నాను. ఈ భావాలు ఒక్కొకసారి నాకే ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉంటాయి' - అన్నది లూసా. ఈ లోపుగా మెల్లగా తలుపు తెరుచుకుని లూసా తల్లి శ్రీమతి గిండ్ అక్కడికి వచ్చింది.

'అమ్మాయి లూసా, 'ఆశ్చర్యం' అనే మాటను ఎన్నడూ అనకు. మీ నాన్నగారు ఆ మాటవింటే ఏమంటారు ? అయినా, అబ్బాయ్ టామ్, నీవుకూడా అలా చూస్తూ ఊరుకుంటా ఏమిట్రా? ఇంత కష్టపడి నిన్ను చదివించి నిన్ను ఎంతో జాగ్రత్తగా తరిఫీదు చేసినందుకు ఇదేనా ఫలితం ? లూసా అలా 'ఆశ్చర్యం' అన్నమాటను ప్రయోగించిన వెంటనే దాన్ని మందలించవద్దూ ?' - అన్నది శ్రీమతి గిండ్.

'అమ్మా - ఇందులో అన్నయ్య తప్పేమీ లేదు. అన్నయ్య నన్ను ఇలా మాట్లాడమని ప్రోత్సహించలేదు' - అన్నది లూసా.

"ఊరుకో అమ్మాయ్ - అన్నయ్య ప్రోత్సహించకపోతే నీవు ఇలా మాట్లాడబోయావా ?" - అన్నది శ్రీమతి గ్రిండ్.

"నన్ను ఎవరూ ప్రోత్సహించలేదమ్మా చిటచిటమని రగులు కుంటూవున్న ఆ నిప్పురవ్వలవంక చూచినప్పుడు నాకు అలా మాట్లా డాలని అనిపించింది. మాట్లాడాను. అంతే." - అన్నది లూసా.

"అమ్మాయ్ - ఇహ నీరెటమతం కట్టిపెట్టు. మీ నాన్నగారు వింటే ఏమంటారు ?" - అని మందలించింది తల్లి.

# 9

ఇరువరు గురువులవద్ద సిసీ జూప్ శుశ్రూష సాగుతూవున్నది. ఒక గురువు బడిపంతులు ఛాకమ్ బైల్డ్. మరో గురువు గృహ యజ మానురాలైన శ్రీమతి గ్రాడ్ గిండ్. ఈ యిరువురివద్ద సిసీ శుశ్రూష చేస్తూవున్నది. రెండు మూడు నెలలు గడిచాయి. ఈ యిరువురివద్ద శుశ్రూష చెయ్యడం సామాన్యమైన విషయం కాదు. అది నిజంగా ఒక అగ్నిపరీక్ష వంటిదే. వీరి దృష్టిలో జీవితం ఒక ఎక్కాల పుస్తకం లాంటిది, సిసీకి మధ్యలో పారిపోవాలని కోరిక కూడా కలుగకపోలేదు. కాని ఎంతో బలవంతంమీన తనను తాను చిక్కబట్టుకున్నది. తన మనస్సును తాను నిగ్రహించుకున్నది. తనను తాను ఓదార్చుకున్నది. ఈరోజు కాకపోతే రేపటికైనా మంచిరోజులు రాకపోతాయా అను కున్నది సిసీ.

సిసీ ఆత్మనిగ్రహానికి కారణం వారివద్ద శుశ్రూష చెయ్యడము కాదు. వారు బోధించే పాఠాలలోని సూత్రాలను వల్లెవెయ్యడమూకాదు. సిసీకి ఒక ఆశ వున్నది. ఈ ఆశాలత సిసీ హృదయంలో పచ్చగానే ఉన్నది. ఎండిపోలేదు. తన తండ్రి తనను పూర్తిగా విడిచిపోలేదు. ఒకనాటికి తన తండ్రి తప్పక తిరిగి వస్తాడనే ఆశ వున్నది సిసీకి. ఈ ఆశతోనే సిసీ ఏదో ఒకవిధంగా తన ప్రాణాలను నిలుపుకుంటూ వున్నది.

కాని గ్రింద్ మహాశయునికిమటుకు సిసీ ఇలా తండ్రినిగురించి ఆశపెట్టుకోవడం పటుబుగా కనుపించలేదు. సిసీ అజ్ఞానానికి అయ

పకు జాలికూడా కలిగింది. సిసీ తండ్రి తిరిగి రావడంకన్న సిసీకి విజ్ఞానం కలిగించడం ఆయన ఉద్దేశంలో ఎంతో ముఖ్యం. కాని సిసీ ఈ విషయాన్ని గమనించినట్లు లేదు. ఎప్పుడూ తండ్రినిగురించే ఆలోచిస్తూ ఉన్నది. విజ్ఞానాన్ని ఆర్జించే విషయంలో అంత శ్రద్ధ చూపడంలేదు. పంతులుగారు భాకమ్బైర్డ్‌కూడా ఈ విషయాన్ని ఎన్నో పర్యాయాలు గ్రిండ్‌కు తెలియచేశారు. లెక్కల విషయంలో సిసీబుర్ర అంత చురుకుగా పనిచెయ్యడంలేదని అన్నారు పంతులుగారు. భౌగోళిక శాస్త్రంలోనూ ఆవిడ అంత శ్రద్ధ చూడడంలేదు. ఒక్కొకసారి దేశాల ఎల్లలనుకూడా మరిచిపోతూ ఉన్నది, చరిత్ర విషయంలోనూ ఇంతే ఆవిడకు తేదీలుకూడా జ్ఞాపకం ఉండడంలేదు. రాజకీయ ఆర్థికశాస్త్రం తాలూకు "ఓనమాల"ను కూడా ఆవిడ గ్రహించలేదు, ఒకరోజున బడిలో పంతులుగా," రాజకీయ ఆర్థికశాస్త్రం తాలూకు మూలసూత్రం ఏమిటని" ప్రశ్నిస్తే ఆవిడ ఈ క్రిందిరీతిగా ఆ ప్రశ్నకు సమాధానం చెప్పింది.

"మనం ఇతరులు మనపట్ల ఎలా ప్రవర్తించవలెనని కోరు తామో మనం వారిపట్ల అలా ప్రవర్తించాలి" - అని - పంతులుగారు ఈ విషయాలన్నీ చెప్పగా గ్రిండ్ మహాశయుడు విమర్శంగా తల ఊపుతూ విన్నాడు. అంతావిన్న తరువాత బరువుగా నిర్వపించి, "అయితే సిసీ విషయం నానాటికీ తీసి కట్టుగానే ఉన్నదన్నమాట" - అన్నాడు.

ఒకరోజున సిసీ లూసాతో ఇలా అన్నది: "లూసా నీతో స్నేహంవల్ల నేను నేర్చుకోవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి" - అని లూసా చిరునవ్వు నవ్వి ఊరుకున్నది. సిసీ, గ్రిండ్ మహాశయుని ఆశ్రయంలో ఉంటూఉన్నప్పటికి సిసీకి లూసాకు అంతగా సంబంధ బాంధవ్యాలు ఉండేవికావు. ఎందుచేతనంటే గ్రిండ్ మహాశయుని గృహం "శిలాలయం" ఒక బందిఖానా వంటిది. ఒకరితో ఒకరు మాట్లాడుకోవడమనేది ఈ శిలాలయ రాజ్యాంగ నియమాలకు పూర్తిగా విరుద్ధమైనది. అదీకాక సిసీ పేద ఇంటిపిల్ల. అందుచేత సిసీతో లూసా చనువుగా ఉండరాదని గ్రిండ్ మహాశయుడు శాసించాడు.

"సిసీ నీవు మా అమ్మగారితో ఎంతో చనువుగా ఉంటున్నావు నేను కూడా మా అమ్మతో అంత చనువుగా ఉండను. నీవు మా అమ్మగారితో ఇంత చనువుగా ఉండడం చూస్తోంటే నాకే ఎంతో ఆశ్చర్యంగా ఉన్నది" - అన్నది లూసా.

"లూసా, నిజం చెప్పాలంటే నేను అంత తెలివిగలదాన్నేమీ కాదు. నేను పట్టి వెర్రివాగులదాన్ని" - అన్నది సిసీ.

"సిసీ - తెలివితేటలనేవి ఒక్కరోజులో వచ్చేవికావు. క్రమ క్రమంగా తెలివి పెంపొందుతుంది" - అన్నది లూసా.

"లూసా - నేనెంత తెలివితక్కువదాన్నో చెప్పడానికి వీలేకాదు. నేను బళ్ళోచేసే తప్పులు అన్నీ ఇన్నీ కావు. ప్రతిరోజూ ఏదో ఒక తప్పు చేస్తూనే ఉంటాను. ఈ తప్పులు దిద్దుకుందామని నేనెంత ప్రయత్నించినా ఈ తప్పులు దిద్దుకోలేకుండా ఉన్నాను" - అన్నది సిసీ.

"బడిపంతులుగారు ఎన్నడూ తప్పులు చెయ్యరా?" - అని ప్రశ్నించింది లూసా.

"వారు తప్పు లెందుకు చేస్తారు ? వారికి తెలీని విషయమంటూ లేదు" - అన్నది సిసీ.

'ఏవీ నీవుచేసిన తప్పులు కొన్ని చెప్పు చూదాం' - అన్నది లూసా.

'నా తప్పులు చెప్పాలంటే నాకెంతో సిగ్గేస్తూవున్నది. ఒక చిన్న ఉదాహరణ చెబుతాను. ఈ రోజున బడిపంతులుగారు 'ప్రకృతి అభ్యుదయా'న్ని గురించి ప్రసంగిస్తూ వున్నారు.

ఆయన ప్రసంగించింది 'ప్రకృతి' అభ్యుదయాన్ని గురించి కాదు - 'జాతి అభ్యుదయాన్ని గురించి' - అన్నది లూసా.

'రెండూ ఒకవిధమైనవి కావా ?' - అన్నది సిసీ.

'కావు' - అన్నది లూసా అన్నది ముక్తసరిగా.

తరువాత మళ్ళీ సిసీ యిలా చెప్పసాగింది :

"బడిపంతులుగారు జాతీయ అభ్యుదయాన్ని గురించి యిలా ప్రసంగిస్తూ వున్నారు : "ఈ గది ఒకజాతి అనుకోండి- 50 మిలియన్ల ధనంగల జాతి. ఇంత ధనంగల జాతి అభ్యుదయ జాతి కాదని

అనగలమా? అమ్మాయ్. సిసీ నీవు యీ జాతిలో ఒక సభ్యురాలవు కాదూ?" - అని నన్ను పంతులుగారు ప్రశ్నించారు."

"అందుకు నీ వేమని జవాబు చెప్పావు?" - అని ప్రశ్నించింది లూసా.

"ఆ ప్రశ్నకు ఏమని సమాధానం చెప్పవలెనో నాకు తోచలేదు. ఆ డబ్బు ఎక్కడినుంచి ఎలా వచ్చిందో తెలియకుండా, ఆ డబ్బులో నాకు భాగం ఉన్నదోలేదో తెలియకుండా ఆ ప్రశ్నకు జవాబు చెప్పడం సబబవునో కాదో నాకు తోచలేదు. అందుచేత ఏ సమాధానమూ చెప్పకుండా ఊరుకున్నాను" - అన్నది సిసీ.

"నీవు అలాసమాధానం చెప్పకపోవడం చాలా పొరబాటుసుమా" అన్నది లూసా.

"అవును లూసా. ఆ విషయం నాకూ తెలుసు. పంతులుగారు మళ్ళీ నన్ను ఇలా ప్రశ్నించారు: "ఈ బడిగది ఒక పెద్ద నగరమని అనుకో. ఈ మహా నగరంలో కోటిమంది ప్రజలు నివసిస్తూ ఉన్నారు. తిండీ తిప్పలూ లేక చనిపోయే వారు సంవత్సరానికి 25 మంది మాత్రమే ఉంటారు. ఈ నిష్పత్తి లెక్కవెయ్యి" - అన్నారు పంతులు గారు. ఈ మాటుకూడా పంతులుగారు అడిగిన ప్రశ్నకు జవాబు చెప్ప లేక పోయాను" - అన్నది సిసీ.

"అయ్యో!" - అన్నది లూసా, తరువాత సిసీ మళ్ళీ ఇలా చెప్పసాగింది.

"పంతులుగారు నన్ను మరో ప్రశ్న అడిగారు. కొందరు సముద్ర యానం బయలుదేరారు. త్రోవలో కొందరు సముద్రంలో మునిగి చనిపోయారు. మరికొందరు మిగిలారు. నూటికి ఎంతమంది యాత్రికులు మిగిలారు?" - అని ప్రశ్నించారు."

"నీవు ఈ ప్రశ్నకైనా సమాధానం చెప్పావా?" - అని అడి గింది లూసా.

"ఈ ప్రశ్నకు కూడా నేను జవాబు చెప్పలేకపోయాను" - అన్నది సిసీ సిగ్గుతో.

లూసా సిగ్గుతో తలవంచుకుని తన ఎదుట నిల్చున్న సిసీ వంక తదేక దృష్టితో చూడసాగింది.

ఒక క్షణం అలా మౌనంగా నిల్చుని సిసీ మళ్ళీ యిలా చెప్పసాగింది :

"నేను చదువుకోవాలనీ, చక్కగా చదువుకుని ఎంతో విజ్ఞానాన్ని ఆర్జించాలని మా నాన్నగారు ఎంతో ఉబలాటపడ్డారు, చివరకు నా బుద్ధి మాంద్యంవల్ల మా నాన్నగారి ఆశలన్నీ యిలా నేలపాలైనాయి" - అన్నది సిసీ.

"మీ నాన్నగారు బాగా చదువుకున్నారా ?" - ప్రశ్నించింది లూసా.

సిసీ సమాధానం చెప్పడానికి తటపటాయించింది.

"భయపడకు సిసీ. నాతో మాట్లాడు. ఇప్పుడు మనల్ని ఎవరూ వినరులే. ఒకవేళ ఎవరైనా మన మాటలను విన్నా, మర్మంలేని మన మాటలు అపార్థం చేసుకునే అవకాశం ఎంతమాత్రం లేదు" - అన్నది లూసా.

"నిజం చెప్పాలంటే నాన్నగారు అంత ఎక్కువేమీ చదువుకో లేదు. ఆయనకు చదవనూ వ్రాయనూ వచ్చు అంతే.

మా తల్లిగారుమాత్రం బాగా చదువుకున్నదట ఆవిడకు గొప్ప పాండిత్యం ఉండేదని నాన్నగారు చెప్పేవారు. మా అమ్మ గొప్ప నర్తకిట" - అన్నది సిసీ.

"మీ నాన్నగారు మీ అమ్మను ఎంతో ప్రేమిస్తూ వచ్చేవా రను కుంటాను" - అని అడిగింది లూసా.

సిసీ జీవితం తాలూకు వివరాలను తెలుసుకోవాలనే ఔత్సుక్యం లూసాలో ఎక్కువ కాసాగింది.

"అవును మా నాన్నగారు మా అమ్మను ఎంతో ప్రేమించేవారట. ఆవిడంటే పడిచచ్చేవారట. మా అమ్మ నేను పుట్టగానే చనిపోయింది. నాన్నగారు నన్నుకూడా ఎంతో గారాబంగా చూచుకునేవారు. ఒకక్షణం కూడా నన్ను విడిచి వుండేవారుకాదు" - అన్నది సిసీ.

"అలాటివాడు నిన్ను వదిలి ఎలా వెళ్ళగలిగాడు ?" - అని ప్రశ్నించింది లూసా.

"అది నా మంచికోసమే. నా మంచికోసమే నాన్నగారు నన్ను వదిలివెళ్ళారు. నాన్నగారిని ఎవరూ అర్ధం చేసుకోలేదు. నా ఒక్కదానికి మటుకే ఆయన హృదయం తెలుసు" - అన్నది సిసీ.

"మీ నాన్నగారిని గురించి మరికొన్ని విషయాలు చెప్పు. మీ నాన్నగారిని గురించి వినాలని నేనెంతో ఉబలాటపడుతున్నాను" - అది అడిగింది లూసా.

తరువాత సిసీ ఇలా చెప్పసాగింది.

"నాన్నగారూ నేనూకలిసి దేశమంతా సంచారం చేశాము. నాన్నగారు విదూషక "పాత్ర" ను ధరించి అందరినీ ఆనందపరిచే వారు. అదే మాకు జీవనాధారంగా ఉండేది. ఒకొక్కొక్కసారి నాన్న గారి విదూషక వృత్తి ప్రజలను రంజింప చెయ్యగలిగేది కాదు. అలాటి సమయాలలో నాన్నగారి మనస్సుకు ఎంతో కష్టంగా ఉండేది" - అన్నది సిసీ -

"అలాటి కష్టసమయాలలో నీవు మీ నాన్నగారిని ఓదార్చేదాని వని అనుకుంటాను" - అన్నది లూసా.

అవునన్నట్లు తలవూపింది సిసీ. ఆవిడ కండ్లవెంట కన్నీరు కార్ధి చెక్కిళ్ళు కన్నీళ్ళతో తడిపై.

తరువాత సిసీ ఇలా చెప్పసాగింది.

"అవును మా నాన్నగారిని నేను ఓదార్చేదాన్ని. ఆయన సహజంగా ఎంతో భయస్తుడు నాదగ్గర కూర్చుని కంటతడి పెట్టేవాడు. తను చాలా బలహీనుణ్ణని జ్ఞానం లేనివాణ్ణని అంటూ వచ్చేవాడు. అప్పుడప్పుడు ఆయనకు ధైర్యాన్ని కలగజేయటంకోసం నేను ఆయనకు పుస్తకాలు చదివి వినిపించేదాన్ని నేను ఆ పుస్తకాలు చదివి వినిపించటమంటే ఆయనకు ఎంతో ఇష్టంగా వుండేది."

"ఆ పుస్తకాలంటే మీ నాన్నగారు ఎంతో ఇష్టపడేవారా ?" అని అడిగింది లూసా.

"అవును మా నాన్నగారికి ఆ పుస్తకాలంటే ఎంతో ఇష్టం. నేను ఆ పుస్తకాలు చదువుతుంటే రాత్రంతా మేలుకొని వుండేవారు. తన బాధలన్నీ మరిచిపోయేవారు. సుల్తాను కథ సాగనిస్తాడో లేక కథ ముగిసే లోపుగానే ఆ స్త్రీ కంఠాన్ని తెగనరుకుతాడో? అనే విషయాన్ని తెలుసుకోవాలనే ఔత్సుక్యంతో కథ సాంతం అయేవరకూ చదవమని అడిగేవారు నాన్నగారు" అన్నది సిసీ.

"మీ నాన్నగారెంతో దయామయు లనుకుంటాను" అన్నది లూసా.

"అవును ఆయనింత దయామయుడు ఈ లోకంలో వుంటాడని నేననుకోను ఆయన హృదయం ఎంత మెత్తనిదో నిజంగా చెప్పటానికి వీలులేదు. ఒకమాటు నాన్నగారికి కోపం వచ్చింది. ఆ కోపం కూడా నామీదకాదు. మా పెంపుడు కుక్క మెర్రీలెగ్స్‌మీద. మెర్రీలెగ్స్ చేత ఆయన ఆటలాడిస్తూ వచ్చేవాడు" అన్నది సిసీ.

"మీ నాన్నగారికి కుక్కమీద కోపం రావడానికి కారణం ఏమిటి?" - అని ప్రశ్నించింది లూసా.

"రోజూ బజార్లో ప్రదర్శనం కాగానే నాన్నగారు యింటికి వచ్చి మెర్రీలెగ్స్‌ను రెండు కుర్చీలపై కాళ్ళుంచి నిల్చోమని అడిగేవారు. ప్రతినిత్యం మెర్రిలెగ్స్ నాన్నగారి ఆజ్ఞను శిరసావహిస్తూ వుండేది. ఇలా వుండగా ఒకరోజున ఆ కుక్క నాన్నగారి ఆజ్ఞను ధిక్కరించింది. అంతటితో నాన్నగారు ఉగ్రులైపోయి దాన్ని చావబాదడం మొదలెట్టారు. "దాన్ని అలా కొట్టకండి నాన్నగారూ- పాపం!" - అంటూ నేను కేకలు వెయ్యసాగాను. తరువాత దాన్ని కొట్టడం ఆపారు, తరువాత అది నెత్తురోడుస్తున్న నాలికతో మెల్లగా ఆప్యాయంగా నాన్నగారి కాళ్ళను నాకసాగింది" - అన్నది సిసీ.

ఈ ఉదంతాన్ని చెబుతూ సిసీ వెక్కి వెక్కి ఏడవ సాగింది.

లూసా కూచున్న చోటినుంచి లేచి సిసీ వద్దకువెళ్ళి సిసీ చేతిని తన చేతిలోకి తీసుకుని సిసీప్రక్కనే కూచున్నది.

'సిసీ, నాకు ఇంక ఒక్క విషయం చెప్పు - చాలు - ఇహ మరి నిన్ను అడగను. అడిగిన తప్పు నాదే. అనవసరంగా నీకు బాధ కలి

గించాను. మీ నాన్నగారు నిన్ను ఎలావదిలి వెళ్ళారో చెప్పు - చాలు'- అని అడిగింది లూసా. తరువాత సిసీ ఇలా చెప్పసాగింది:

'ఆరోజు మధ్యాహ్నం నేను బడినుంచి ఇంటికి వచ్చాను. నేను ఇంటికి వచ్చేసరికి నాన్నగారు కుర్చీలో కూచుని అటూ ఇటూ ఊగుతూ ఉన్నారు. ఏదో బాధను అనుభవిస్తున్నట్లుగా ఉన్నారు. 'నాన్నగారూ, ఏమిటి ఇలా బాధపడుతున్నారు? కడుపులో నొప్పిగా ఉన్నదా?' - అని అడిగాను. ఆయనేమీ జవాబు చెప్పలేదు. నేను దగ్గరకువచ్చి చూచేసరికి ఆయన ముఖమంతా కన్నీటితో తడిసి ఉన్నది.

"అమ్మాయ్, యిలా రా" - అంటూ నాన్నగారు నన్ను కౌగిలించుకుని ఏడవసాగారు."

ఈ సందర్భంలో లూసా అన్న థామస్ అక్కడికి వచ్చాడు.

"ఒరెయ్ అన్నాయ్ - సిసీ నాకు కొన్ని విషయాలు చెబుతూ వున్నది. ఇప్పుడు నీవు అనవసరంగా గొడవ చెయ్యకు" - అన్నది లూసా.

"ఓ. అలాగే. కానీ, ఒక్కమాట. బౌంచర్ బై మనింటికి వచ్చారు" - అన్నాడు థామస్.

తరువాత మళ్ళీ అశ్రురుద్ధ కంఠస్వరంతో సిసీ ఇలా చెప్ప సాగింది:

"అలా నన్ను కౌగిలించుకుని ఏడుస్తూ నాన్నగారు తనను తాను అడిపోసుకోసాగారు. ఆయన నన్ను ఎన్నడూ సుఖపెట్టలేదని అన్నారు. ఆయనతో కలిసి ఉండడంకన్నా ఆయన లేకపోవడం వల్లనే నేను ఎక్కువ సుఖపడతానని అన్నారు. నేనప్పుడు నాన్నగారిని ఎన్నో విధాల ఓదార్చాను. అనవసరంగా మనస్సు కష్టపెట్టుకోవద్దని అన్నాను. ఆ తరువాత నాన్నగారు నిమ్మళంగా ఉపశమనాన్ని పొందారు. నన్ను దగ్గరకు తీసుకున్నారు. నేను ఆయన ప్రక్కనే కూచుని బళ్ళో జరిగిన విషయాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పసాగాను. ఆయనకు ఎంతో సంతోషం కలిగింది. ఆయన నన్ను కౌగిలించుకుని ముద్దాడి, "అమ్మాయ్ నాకు కొద్దిగాయం తగిలింది. ఊళ్ళోకి వెళ్ళి తైలం తీసుకుని రామ్మా" - అంటూ నన్ను ఊళ్ళోకి పంపారు.

నేను మెట్లు దిగివస్తూ ఒకమాటు వెనుదిరిగి చూచి, 'నాన్నగారూ, నాతోపాటు 'మెర్రీలెగ్స్'ను కూడా తీసుకుని వెళ్ళమంటారా ?' - అని అడిగాను.

"వద్దమ్మా - దాన్ని యిక్కడే వుండనీ" - అన్నారు నాన్న గారు. నేను ఊళ్ళోకి వెళ్ళి తైలం తీసుకుని తిరిగివచ్చాను. నేను తిరిగి వచ్చి చూచేసరికి నాన్నగారు లేరు. వెళ్ళిపోయారు" - అంటూ తన తండ్రి తనను విడిచివెళ్ళిన ఉదంతాన్ని వినిపించింది సిసీ.

తరువాత ఒకక్షణం ఆగి మళ్ళీ యిలా అన్నది :

"ఇంతేనమ్మా కథ, ఇహ చెప్పవలసిన దేమీలేదు. నాన్నగారి కోసం నేను తెచ్చిన తైలం యింకా నా దగ్గరే వున్నది. నాన్నగారు వస్తారనే ఆశ యింకా నాలో యింకిపోలేదు.

మీ నాన్నగారికి ఎక్కడనుంచైనా ఉత్తరం వచ్చినప్పుడల్లా నా గుండె దడదడమని కొట్టుకుంటుంది. ఆ ఉత్తరం నాన్నాగారి వద్ద నుంచే వచ్చిందని అనుకుంటాను. నాన్నగారి వద్దనుంచి కాకపోతే, స్లీరీవద్దనుంచయినా వచ్చి ఉండాలి. ఎందుచేతనంటే నన్ను మీనాన్న గారు తీసుకుని వచ్చేటప్పుడు అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తూ ఉంటా నని చెప్పాడు స్లీరీ.'

ఆ తరునాత గిండ్ ఎప్పుడు ఉత్తరం వచ్చినా. సిసీ ప్రకంపిత కంఠస్వరంతో 'అయ్యో ! ఆ ఉత్తరం మావాళ్ళ దగ్గరనుంచి వచ్చిందా ?' - అని అడుగుతూ వచ్చేది.

'లేదమ్మా ఇది నాకు మరెవరో వ్రాసినలేఖ' - అనేవాడు గ్రిండ్ ఆ మాట విన్నతరువాత సిసీ గదిలోనుంచి వెళ్ళిపోయేది. లూసాకూడా అక్కడే ఉండేది లూసా కళ్ళలో నీళ్ళు తిరిగేవి. సిసీ గదిలోనుంచి వెళ్ళిపోయిన తరువాత గ్రిండ్ సిసీ మనస్తత్వాన్ని గురించి వ్యాఖ్యా వించేవాడు.

"చూశారా, చిన్నతనంనుంచీ క్రమశిక్షణలో పెంచకపోవడం వలన అమ్మాయి లేనిపోని ఆశలను పెట్టుకుంటూ వున్నది "- అనేవారు.

లూసా, థామస్ యీ వ్యాఖ్యానాన్ని విని మౌనంగా వూరుకునే వారు. గ్రాద్ గ్రింద్ సతీమణి మాత్రం సహజంగా స్త్రీలు చూపే చిరాకును చూపుతూ యిలా అనేది :

"నామటుకు నాకు యీ అమ్మాయి పరిస్థితి చూస్తోంటే తల తిరిగిపోతూ వున్నది. ప్రతినిత్యం యీ అమ్మాయి తన ఉత్తరాలకోసం అడుగుతుంది. ఏమిటో యీ గొడవంతా నాకు అర్థంకాకుండా వున్నది. తుదీ మొదలూ తెలీకుండా వున్నది."

ఈ సందర్భంలో గ్రాద్ గ్రింద్‌గారు ఆవిడవంక తన తీవ్ర దృష్టిని ప్రసరింపచేసేవారు. అంతటితో ఆవిడ మౌనంగా వూరుకునేది,

# 10

ప్రపంచంలో అనేక దేశాలలో కాయకష్టం చేసే ప్రజలు ఉండ వచ్చు. కాని కాయకష్టం చేసే విషయంలో ఇంగ్లీషు ప్రజలు వీరి కెందుకూ తీసిపోరని నా దృఢవిశ్వాసం. నా అభిప్రాయం సమంజస మైనది అయినా కాకపోయినా ఈ అభిప్రాయంలో మటుకు నాకు గట్టి నమ్మకం ఉన్నది.

పద్మవ్యూహం లాంటిది కోక్‌టౌను నగరం. కాయకష్టం చేసి కడుపు నింపుకునే శ్రామిక జనాళి అంతా అక్కడే నివసిస్తుంది.

పచ్చని ప్రకృతిని శిథిలంచేసి ఇటుకల ఇళ్ళగా మార్చాడు మాన వుడు. స్వేచ్ఛగా దశదిశలూ విహరించే గాలి దేవుణ్ణి వీధుల్లో కట్టి పడే శాడు. వీధిప్రక్కనే వీధి. మేడ ప్రక్కనే మేడ. సందు ప్రక్కనే సందు. మనిషి ప్రక్కనే మనిషి. నిమ్మళంగా ఊపిరి పీల్చుకోడానికి అడుగంతయినా చోటుండదు. నగరం చివర కార్మికుల పేట. కార్మి కుల పేట చివరన ఫాక్టరీలు. అహర్నిశలూ పొగలు కక్కే ఫ్యాక్టరీ గొట్టాలు. చెప్పరాని జనసమ్మర్దం. భూత గృహంవంటి ఈ కోక్

టౌను మహానగరంలో స్టీఫెనుబ్లాడ్‌పూల్ అనే పేరుగల ఒక వ్యక్తి నివసిస్తూ వచ్చాడు. అతనివయస్సు దాదాపు 40 సంవత్సరాలు.

స్టీఫెను 40 సంవత్సరాల వయస్సు గలవాడైనా అంతకన్నా ఎక్కువ వయస్సున్న ముసలివానిలా అగుపించేవాడు. బ్రతుకంతా కష్టాంతో గడపడంవల్ల అతని ముఖంలో ముసలి తనం తాలూకు రేఖలు త్వరగా ఏర్పడ్డాయి. ప్రతి జీవితంలోనూ కష్టసుఖాలనేవి ఉంటాయి. కొన్నాళ్ళు వెన్నెల ఉంటే మరి కొన్నాళ్ళు చీకటి ఉంటుంది.

కాని స్టీఫెను జీవితం మటుకు అలాంటిదికాదు. అతని బ్రతుకులో వెన్నెలన్నది లేనేలేదు. అంతా చీకటి. స్టీఫెను బ్రతుకులో కష్టాలే అనుభవించాడు. అతని వల్ల సుఖాలు పొందినవారు ఎందరో ఉన్నప్పటికీ ఆ అభాగ్యుడు మాత్రం కష్టాలే చవి చూచాడు—

ఆపేటలో అందరూ అతన్ని 'స్టీఫెను తాతా' అని పిలిచేవారు.

వృద్ధాప్యం పైబడ్డవానిలాగ వరిగి నడిచేవాడు స్టీఫెను.

ముఖం ఎప్పుడూ గంభీరంగా ఉండేది. ఏదో తీవ్రమైన విషయాన్ని ఆలోచిస్తూ ఉన్నట్లుగా కనిపించేవాడు. జుట్టు నెరిసింది. స్టీఫెన్‌ను ఎవరైనా చూస్తే, ఇతను జీవితంలో ఎంతో అనుభవం ఉన్న వ్యక్తి. గొప్ప వేత్త: - అని అనుకుంటారు.

కాని స్టీఫెను అంత తెలివిగలవాడేమీ కాదు. పైగా అతను చదువుకున్నవాడు కూడా కాదు. కొందరు వ్యక్తులుంటారు. వారు అప్పుడప్పుడూ తమ జీవితాలలో తీరిక కల్పించుకుని ఉత్తమ శాస్త్ర గ్రంథాలను అధ్యయనంచేసి గొప్ప పాండిత్యాన్ని సముపార్జిస్తారు. ప్రసంగాలలో చర్చలలో వారికి అగ్రస్థానం ఉంటుంది.

స్టీఫెను తాతని ఇన్నులాటివారిలో జత కట్టడానికి వీలులేదు.

కాయకష్టం చేసే విషయంలో మటుకు స్టీఫెను తాతది పెద్ద చెయ్యి. బట్టలు తయారు చేసే మర మగ్గాన్ని నడపడంలో స్టీఫెను గొప్ప నేర్పుగలవాడు. ఆ రోజు—

ప్రొద్దుగూకింది. ఫాక్టరీ గొట్టాలు ఆఖరుకూత కూశాయి. కండ్లు మిరుమిట్లుగొలిపే విద్యుద్దీపాలు ఆరిపోయాయి. ఫ్యాక్టరీలలో

పని చేసే పురుషులు, స్త్రీలు, పిల్లలు, అంతా గుంపులుగుంపులుగా ఇండ్లకు మరలి వస్తున్నారు.

స్టీఫెను కూడా పనిముగించుకుని ఫ్యాక్టరీనుంచి వచ్చి బైట వీధిలో నిల్చున్నాడు. 'ఇంకా రాషెల్ రాలేదేమిటి చెప్మా!'—అను కున్నాడు స్టీఫెను.

ఆ రాత్రి ఎంతో చలిగా ఉన్నది. కొందరు స్త్రీలు శాలువాలను ముసుగులుగా కప్పుకుని స్టీఫెను ప్రక్కగుండా నడిచివెళ్ళారు. వారిలో రాషెల్ ఉన్నదేమోనని వారిని పరీకించాడు స్టీఫెను. కాని వారిలో స్టీఫెనుకు రాషల్ కనుపించలేదు. స్టీఫెను ఒక్కచూపులోనే రాపెల్‌ను కనిపెట్టగలడు. వారిలో రాషెల్ కనిపించక పోయేసరికి స్టీఫెను నిరాశ పొందాడు. 'అయ్యో! రాపెల్ రాలేదే!' - అనుకున్నాడు స్టీఫెను. మరో మూడు సందులు దాటాడు స్టీఫెను. అవతలి పేవ్‌మెంటుమీద ముసుగువేసుకుని వస్తూ ఉన్న ఒక స్త్రీ కనుపించింది. ఆ స్త్రీ వంక స్టీఫెను తదేక దృష్టితో చూడసాగాడు. ఆ స్త్రీ ఒక నీడలాగ అతని వైపు కదిలి వస్తూంది.

'రాషెల్!'- అని పిలిచాడు స్టీఫెను. ఆ స్త్రీ ఆగి దీపపు వెల్తురులో అతని వంకచూచింది. ముసుగు కొంచెం తొలగించింది. కోలగా ఉన్న ముఖం విశాలంగా ఉన్న నేత్రాలు. ఆ స్త్రీకి ౩౦, ౩౫ సంవత్సరాల వయస్సు ఉండవచ్చు.

'నీవా అబ్బాయీ!'—అన్నది ఆస్త్రీ చిరునవ్వు నవ్వుతూ 'నీవు ఈరాత్రి కనుపించవని అనుకున్నాను రాషెల్!'- అన్నాడు స్టీఫెను.

"అలాగా?"—అన్నది ఆ స్త్రీ.

"ఈ రాత్రి పెందరాళే బయలుదేరావేం?" - అని ప్రశ్నించాడు స్టీఫెను.

"ఒక్కో రోజు పెందరాళే బయలుదేరు తాను. ఒక్కోరోజు ఆలస్యంగా బయలుదేరుతాను"—అన్నది ఆస్త్రీ.

అతను ఆస్త్రీవంక చూచాడు.

అతని ముఖంలో నిరాశ గోచరించింది.

"ఈ విడ ఏపనిచేసినా ఎంతో సమయోచితంగా చేస్తుంది"— అనుకున్నాడు స్టీఫెను.

ఆవిడ అతని బుజంమీద చెయ్యివేశి మెల్లిగా ఇలా అన్నది.

'అబ్బాయీ మన మైత్రి ఈనాటిది కాదు. మన మైత్రితోపాటు మన వయస్సూ మళ్ళింది -

'రాషెల్, నీవు అలా అనకు. నీ వయస్సు మళ్ళినా నీ అందం ఎంతమాత్రం తరిగిపోలేదు' అన్నాడు స్టీఫెను.

'మన ఇదువురిలోనూ ఒకరికి ముసలితనం వచ్చి, మరొకరు వయస్సులో ఉంటే అది ఎంతో ప్రమాదకరమైన విషయం సుమా? అన్నది ఆవిడ చిరునవ్వు నవ్వుతూ.

'ఏమైనా మన మైత్రి ఈ నాటిది కాదు, కాని రోజులుమారాయి. కలికాలం! ఏం చేస్తాం మరి" అన్నది.

"అవును రాషెల్— నీవు అన్నమాట అక్షరాలా సత్యం. కలి కాలం! మనుష్యులు మనుష్యులుగా లేరు" - అన్నాడు స్టీఫెను.

"ఆలోచించి లాభంలేదు. ఆలోచించడం కంటె ఆలోచించ కుండా ఉండడంలోనే ఎక్కువ హాయి ఉన్నది" - అన్నది ఆవిడ.

"అవును రాషెల్. నీవు చెప్పింది నిజమే. ఆలోచించకుండా హాయిగా ఉండాలని ఎంతో ప్రయత్నించాను. కాని లాభంలేదు. అలా ఉండలేక పోయాను. మన నేస్తాన్ని గురించి ప్రజలు అనేక విధాలుగా ఆడి పోసుకున్నారు. అప్పుడు నీవునన్ను ఎంతో ఓదార్చావు. నీ మాట నాకు పెట్టనికోట. శాసనం!"—అన్నాడు స్టీఫెను.

'అవును. ప్రజలెప్పుడూ అలాగే మాట్లాడుతారు. అది ఒక బురద గుంట. అన్నది ఆవిడ.

ఆవిడ మళ్ళీ అతని బుజంపై చెయ్యి ఉంచింది. ఇరువురూ ప్రక్క ప్రక్కనే నడవ సాగారు. అలా ఎంతో దూరం నడిచారు. సందులూ గొందులూ దాటారు. అంతా నిశ్శబ్దం. చీమ చిటుక్కు మన్నా వినిపిస్తుంది. రాత్రి చల్లగా ఉన్నది, మంచు మెల్లిగా కురుస్తూ ఉన్నది. వారు వారి ఇండ్లవద్దకు వచ్చారు.

ముందు రాషెల్ ఇల్లు వచ్చింది. 'వెళ్ళివస్తాను స్టీఫెను. సెలవు. అంటూ ఆవిడ ఇంట్లోకి వెళ్ళిపోయింది.

గంభీరంగా అడుగులు వేస్తూ ఇంట్లోకి వెడుతున్న ఆవిడవైపే తదేకంగా చూస్తూ వాకిట్లోనే నిల్చున్నాడు స్టీఫెను.

ఆవిడ ఇంట్లోకి వెళ్ళిపోయిన తరువాత ఇంటిముఖం పట్టాడు స్టీఫెను. మెల్లిగా అడుగులు వేస్తూ నడుస్తూ ఉన్నాడు. అతని వయస్సును ఏదో నిరాశ నిస్పృహ ఆవరించాయి. మధ్య మధ్యలో ఆకాశం వంక చూస్తూ నడుస్తూ ఉన్నాడు. ఆకాశంలో మేఘాలు తీవ్రవేగంతో పరుగులు తీస్తూ ఉన్నాయి, వర్షంవెలిసింది. మబ్బులు చెదిరిపోయాయి. చంద్రబింబం నిర్మలంగా వెలుగుతూ ఉన్నది.

ఆ సన్నని చిరువెన్నెలలో ఎంతో ఉత్సాహంగా నడుస్తూ వెడుతున్నాడు స్టీఫెను,

అతని ఇల్లు మరో వీధిలో ఉన్నది. ఇంటిముందే ఒక చిన్న దుకాణం ఉన్నది. ఆ దుకాణంలో ఒక స్త్రీ చిన్న చిన్న బొమ్మలూ - అవీ ఇవీ - అమ్ముతూ ఉంటుంది.

స్టీఫెను తన ఇంటిలోకి వెళ్ళాలంటే ఆ దుకాణంలో గుండానే వెళ్ళాలి.

స్టీఫెను ఇంటికి చేరేసరికి దుకాణం యజమానురాలు నేలమీద పడుకుని గాఢంగా నిద్రపోతూ ఉన్నది. స్టీఫెను ఆవిడను లేపకుండా మెల్లగా కిటికిలోనుంచి కొవ్వొత్తిని తీసుకుని వెలిగించి మెట్లెక్కి మేడమీదకు వెళ్ళాడు.

అది ఒక చిన్నగది. గది పరిశుభ్రంగా ఉన్నది. గదిలో ఒక మూలన కొన్ని పుస్తకాలు పడేసి ఉన్నాయి. మరో మూల ఒక బల్ల మలక మంచమూ ఉన్నాయి. స్టీఫెను మెల్లిగా గది మధ్యలోకి వెళ్ళి కొవ్వొత్తిని బల్లమీద ఉంచాడు. నలువైపులా ఒకమాటు కలయ చూచాడు, బల్లప్రక్కనే ఒకస్త్రీ కూచునివుండడం అతనికి కనుపించింది.

"అయ్యో భగవంతుడా! నీవు మళ్ళీవచ్చావా?" అన్నాడు స్టీఫెను ఆ స్త్రీని చూచేసరికి స్టీఫెనుకు భయంవేశింది. శిథిలమైన శరీరం, పైగా

బాగా తాగి ఉన్నది. రేంపిన కూపని ఉన్నది. ఒక చేతితో ముఖాన పడుతున్న జుట్టును ఎగ(దోసుకుంటూ ఉన్నది. చిరుగు బట్టలు. శరీరంనుంచి వెలువడుతున్న దుర్గంధం ఆభయంకర స్త్రీ మూర్తిని చూచి స్టీఫెను గజగజలాడి పోయాడు.

ఆమె ఎంత ప్రయత్నించినా ముఖాన పడుతూ ఉన్నజుట్టును ఎగ(దోసుకోలేక పోతున్నది. అందుచేత ఒకటి రెండు పర్యాయాలు తన జుట్టును తానే తిట్టుకున్నది. చివరకు ఎలాగవుతేనేం జుట్టు నిమ్మళంగా సవరించుకుని స్టీఫెను వంకచూచి "ఏమిటి అబ్బాయీ, ఏమిటో అంటున్నావు?" —అన్నది.

"ఏమీలేదు. మళ్ళీవచ్చావా?"-అని అడుగుతున్నాను అన్నాడు స్టీఫెను.

"రానూ, రావద్దంటే నేను ఊరుకుంటానా? అబ్బాయీ! నీ ఆటలు నావద్ద సాగవు. నీ పని పడతానులే"-అన్నది. స్టీఫెను ఆస్త్రీ మాటలను పట్టించుకోకుండా ప్రక్కగదిలోకి వెళ్ళాడు. ఆస్త్రీ క్రింది నుంచి లేచి పక్కమీద పడుకుని గుర్రు పెట్టి నిద్రపోసాగింది.

# 11

తెల్లవారింది. ప్రభాత కాంతిలో కోక్‌టౌన్ నగరంలోని మేడలూ మిద్దెలూ బంగారపు రంగుపూసినట్లుగా మిలమిల మెరిశాయి.

ఫ్యాక్టరీ గొట్టాలు కూతపెట్టాయి. పొగతీగలు తీగలుగా చుట్టలు చుట్టుకుని గొట్టాలనుంచి వెలువడసాగింది.

స్టీఫెను తన మరమగ్గంవద్ద కూచున్నాడు. అతని ముఖంలో ప్రశాంతి తాండవిస్తూ ఉన్నది. శ్రద్ధకనుపిస్తూ ఉన్నది.

స్టీఫెనుకూ ఇతర కార్మికులకూ ప్రధానంగా ఒక తేడా ఉన్నది. ఇతర కార్మికుల ముఖాలలో సాధారణంగా కనుపించే చీదరా చిరాకూ సాధారణంగా స్టీఫెను ముఖంలో కనుపించదు. అన్నిటికీ పైన భగ

వంతుడున్నాడు. మనం మానవ మాత్రులం ఆందోళన పడి లాభం ఏమున్నది? ఇది స్టిపెను తత్వం.

స్టిపెను పనిచేశే మిల్లులో కొన్ని వందలమంది కార్మికులు పని చేస్తూ ఉన్నారు.

కొన్ని వందల మరమగ్గాలు పనిచేస్తూ వున్నాయి. ఈ కార్మికుల వుత్పత్తినీ ఈ మరమగ్గాల శక్తినీ మనం కొలవ వచ్చు. కాని మాన వుని మంచిచెడ్డలను మనం ఎలా కొలవగలం మానవుల మంచి చెడ్డలను ధర్మాధర్మాలను కొచవగల కొలత బద్ద ఏది? ఈ ప్రశ్నకు సమాధానం ఎంత ఎదికినా దొరకదు.

ప్రొద్దెక్కింది. ఎండ కసకస లాడుతూ వున్నది. మిల్లులోపల విద్యుద్దీపాల వేడి, వెలుపల ఎండ వేడి. కార్మికులు భరించలేక పోయారు. విద్యుద్దీపాలను ఆర్పివేశారు. పని సాగుతూ వున్నది. రెండు గంటలు గడిచాయి. వర్షం ప్రారంభించింది. కాని మిల్లులోపల చెప్పరాని ఉక్క.

మధ్యాహ్నం విశ్రాంతికి గంటకొట్టారు. స్టిపెను మిల్లులోనుంచి బైటికి వచ్చాడు, గాలి చల్లగా వీస్తూ ఉన్నది. రోడ్లు వానకు తడిసి చిందరవందరగా ఉన్నాయి. స్టిపెను రొట్టెతింటూ నడక సాగిస్తున్నాడు. తన యజమాని ఉన్న ఇంటివైపుకు నడక సాగిస్తున్నాడు. యజమాని ఇల్లు ఒక చిన్న గుట్టపై ఉన్నది. ఆ ఇల్లు బౌందర్‌బై మహాశయుని ఇల్లు. ఇంటిముందు బౌందర్‌బై అనే పేరు వ్రాసిన బోర్డు వున్నది,

స్టిపెన్ వెళ్ళేసరికి బౌందర్‌బై భోజనం చేస్తూఉన్నాడు. తను వచ్చి నట్లుగా స్టిపెను లోపలికి కబురు పంపాడు. స్టిపెను ఎప్పుడు వచ్చినా బౌందర్‌బైకి కాదనే అలవాటు లేదు. లోనికి రమ్మన్నాడు బౌందర్‌బై. స్టిపెన్ లోనికి వెళ్ళాడు.

స్టిపెను లోనికి వెళ్ళేసరికి బౌందర్ బై బల్లముందు కూచుని భోజనం చేస్తూ ఉన్నారు. శ్రీమతి బౌందర్‌బై ప్రక్కనే ఉన్నది. ఎంతో శ్రద్ధతో అతనికి భోజన పదార్థాలను వడ్డిస్తూ ఉన్నది.

"స్టిపెను. ఏమిటోయ్ ఇలా వచ్చావు?"—అన్నాడు బౌందర్‌బై.

స్టిపెను తలవంచి నమస్కరించాడు. స్టిపెను నమస్కరించే పద్ధతి అది. అవతలి వారు ఎంతటివారైనా స్టిపెనుకు చేతులెత్తి నమస్కరించే అలవాటులేదు. తలవంచి మాత్రమే అతను నమస్కరిస్తూ ఉంటాడు, తరువాత బొందర్ బై ఇలా అన్నాడు.

"స్టిపెను, నీవు ఎంతో మంచివాడివి. బుద్ధిశాలివి. గుణవంతుడివి. ఇతర కార్మికులతో నిన్ను పోల్చడానికి ఎంతమాత్రం వీలులేదు. అందుచేత నీవు ఏదో ఒక ఫిర్యాదు చెయ్యడానికి వచ్చి ఉంటావని అనుకోను."

"చిత్తం. నేను అలాటి పనిమీద రాలేదండి"-అన్నాడు స్టిపెను.

స్టిపెను అలా అన్నప్పటికి, ఎందు చేతనో కాని బొందర్ బై ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

"సరేకాని" ఇంతకూ ఏ పనిమీద వచ్చావో చెప్పు"—అన్నాడు.

బొందర్ బై ఇలా అనగానే స్టిపెను ఒకమాటు ఆయన ప్రక్కనే నిల్చుని ఉన్న శ్రీమతి స్పార్సిత్ వంకచూచాడు.

"బొందర్ బై, మీరు స్టిపెనుతో ఏ వైనా ప్రత్యేక విషయాలు మాట్లాడవలసి ఉంటుందేమో, నేను ఇక్కడినుంచి వెళ్ళనా?"-అన్నది శ్రీమతి స్పార్సిత్ "అవసరం లేదు. మీరు ఇక్కడే ఉండవచ్చు"—అని బొందర్ బై స్టిపెను వంకచూచి ఇలా చెప్పసాగాడు. "చూశావూ-అబ్బాయీ - ఈ స్త్రీని సామాన్యస్త్రీగా భావించకు. ఈ విడ గొప్ప వంశంలో పుట్టింది. ఎంతో ఉదార స్వభావంగల వ్యక్తి. ప్రస్తుతం ఈ విడ నాదగ్గర జీతానికి ఉంటున్నది కాబట్టి సామాన్య స్త్రీ అని ఎంచకు. ఇప్పుడు నీవు ఈ స్త్రీ సమక్షంలో చెప్పరాని విషయం ఏదైనా ఉన్నట్లవుతే ఈ విడ ఇక్కడినుంచి వెళ్ళిపోగలదు"—అన్నాడు బొందర్ బై.

"అయ్యా! ఈ పతితుని కథ ఆ ఉత్తమురాలి సమక్షంలో చెప్పమంటారా?"—అన్నాడు స్టిపెను.

"ఫరవాలేదు. చెప్పు"-అన్నాడు బొందర్ బై. తరువాత స్టిఫెను ఇలా చెప్పసాగాడు.

"అయ్యా! తమరిని ఒక విషయంలో సలహా అడగడానికి వచ్చాను. 19 సంవత్సరాల క్రితం నాకు వివాహం జరిగింది. అప్పుడు నా భార్య ఎంతో అందంగా ఉండేది. పైగా వయస్సులోనూ చిన్నది. కాని కొన్నాళ్ళతరువాత నా భార్యనీతి తప్పి ప్రవర్తించసాగింది. ఆవిడ పట్ల నేను ఎన్నడూ కఠినంగా ప్రవర్తించి ఉండలేదు. కాని ఆవిడ మాత్రం ఆ విషయాన్ని గ్రహించలేదు."

"ఈ కథంతా ఇంతకు పూర్వం నేను విన్నదే. ఆవిడ తాగుడుకు అలవాటు పడిందనీ, మిల్లులో పని మానేశిందనీ, వస్తువులన్నీ తాకట్టుపెట్టి తాగేదనీ విన్నాను"-అన్నాడు బౌందర్‌బై.

"ఆవిడ ఇన్ని దురాచారాలకు పాల్పడినా నేను ఆవిడను పల్లెత్తు మాటకూడా అనలేదు. నెమ్మది మీద ఆవిడను మంచిదోవకు మరలిద్దామని ఎంతో ప్రయత్నించాను. కాని లాభం లేక పోయింది"—అని చెప్పసాగాడు స్టీపెను.

స్టీపెను ఇలా చెబుతూ ఉంటే అతని ముఖంలోని ముడతలు మరింత ప్రగాఢమైనాయి.

స్టీపెను గొంతు సవరించుకుని మళ్ళీ ఇలా చెప్పసాగాడు: "నానాటికీ ఆవిడ పరిస్థితి దిగజారి పోసాగింది. చివరకు ఆవిడ నన్ను వదిలి వెళ్ళింది. ఇంటికి రావడం మానేశింది. ఈ అయిదు సంవత్సరాలూ నేను నా జీవితాన్ని ఏ కాకిగానే గడిపాను. పోయినరాత్రి నేను ఇంటికి వెళ్ళేసరికి ఆ విడ కనుపించింది. నాగదిలో నేలమీద కూచుని ఉన్నది" - అని కథముగించాడు స్టీపెను.

స్టీపెను కండ్లలో నీళ్ళు తిరిగాయి. కొనవ్రేళ్ళతో కన్నీరు తుడుచుకున్నాడు స్టీపెను.

బౌందర్‌బై దీర్ఘంగా నిశ్వసించి ఇలా అన్నాడు: "ఈ కథంతా ఇది వరకు నేను విన్నదే అబ్బాయీ. ఆవిడ తిరిగి వచ్చిన విషయం మటుకు నేను వినడం ఇదే మొదటిసారి. అయినా, ఇంతకూ, ఎవరి కర్మకు ఎవరు చేశేదిమటుకు ఏ మున్నది? అసలు ఉన్నమాట చెప్పాలంటే నీలాంటివారు వివాహం చేసుకోడమే పొరబాటు. జరిగిందేదో

జరిగిపోయింది. ఇప్పుడు మనంవిచారించినందుకు లాభం ఏమున్నది?"- అన్నాడు బౌందర్‌బై.

"ఈ వివాహం ఏవిధంగా అసమ్మతంగా ఉన్నదని అంటారు? వయస్సు విషయంలో నంటారా ?" - అని ప్రశ్నించింది స్పార్సిత్.

తరువాత బౌండర్‌బై స్టిపెను వంకచూసి ఇలా అన్నాడు.

"చూశావా - ఆవిడ ఏమంటూ ఉన్నదో? వయస్సు తేడావల్ల మీ వివాహ జీవితం ఇలా విభగ్నమైందని అంటూ ఉన్నది"— అన్నాడు బౌందర్‌బై.

"వయస్సు తేడా కారణం కాదయ్యగారూ. నాకూ నాభార్యకూ ఎక్కువ వయస్సుతేడాలేదు" - అన్నాడు స్టిపెను. ఒకక్షణం ఆగి స్టిపెను మళ్ళ ఇలా అన్నాడు: ఇంతకూ నేను మిమ్మల్ని ఒక చిన్న సలహా అడగాలని వచ్చానయ్యగారూ - ఈ స్త్రీని వదిలించుకునే మార్గాన్ని తమరు సెలవివ్వాలి" - అన్నాడు స్టిపెను.

స్టిపెను ఇలా ప్రశ్నించి నప్పుడు అతని ముఖంలోని గంభీర తను చూచి స్పార్సిత్ విచలితురాలైంది.

బౌందర్‌బై కూడా ఆశ్చర్య చకితుడయ్యాడు. "ఏమిటి నీవు అడుగుతూ ఉన్నది ?"-అన్నాడు.

"నేను ఆవిడను వదిలించుకుని తీరాలి. ఇహ ఆవిడ పొత్తు నేను భరించలేను. ఇన్నాళ్ళూ ఏదో ఒక విధంగా గుండెలపై నిప్పులకుంపటి పెట్టుకున్నట్లుగా ఆ విడను భరించాను ఇక ఈ బాధను నేను భరించ లేను"—అన్నాడు స్టిపెను.

"అతను ఈ స్త్రీని వదిలించుకుని తను ప్రేమిస్తూ ఉన్న స్త్రీని వివాహం చేసుకోవాలని అభిలషిస్తూ ఉన్నట్లుగా ఉన్నాడు" అన్నది స్పార్సిత్ మెల్లని కంఠస్వరంతో.

"చిత్తం. తమరు నా మనస్సును సరిగ్గా కనిపెట్టారు. నేను కోరుతూఉన్నదికూడా అదే. నేను ఆ విషయాన్నే తమకు మనవి చేసుకోదలిచాను. కాట్లాడుతూ పోట్లాడుతూ సంసారాలు చెయ్యడంకన్న విడిపోవటమే మంచిది. విడిపోయే మార్గాన్ని చెప్పమని నేను తమరిని

కోరుతూ ఉన్నాను" అన్నాడు స్టిపెను. 'అంటే నీ వుద్దేశం?' అని ప్రశ్నించాడు బౌందర్‌బై.

"నేను నా భార్యను విడిచిపెడితే చట్టం నన్ను శిక్షిస్తుందని అంటారా?" అని ప్రశ్నించాడు స్టిపెను,

"అవును. చట్టం శిక్షిస్తుంది. భార్యాభర్తలు విడిపోవడాన్ని చట్టం అంగీకరించదు" అన్నాడు బౌందర్‌బై.

"అయితే మరి గత్యంతర మేమిటి?" అని ప్రశ్నించాడు స్టిపెను,

"వివాహబంధం పవిత్రమైనది. వివాహబంధాన్ని అతిక్రమించ డానికి వీలులేదు" అన్నాడు బౌందర్‌బై.

"అలా అనకండి అయ్యగారూ! వివాహబంధం పవిత్రమైనదనే మాట వాస్తవమే. కాని వివాహాలూ ఒకవిధంగా ఉండవు, నేను నా బాల్యంనుంచి తమరి మిల్లుపని చేస్తూన్నాను. ఎన్నో వివాహాలు విచ్ఛిన్నం కావడం నేను చూశాను. వివాహాలు విచ్ఛిన్నమైనమాట అలా ఉంచండి. వివాహాలు హత్యలకూ ఆత్మహత్యలకూ దారితీసిన సంఘ టనలను కూడా నేను ఎరుగుదును" అన్నాడు స్టిపెను.

"ఏమైనా కావచ్చు. చట్టాన్ని మనం ధిక్కరించలేము"అన్నాడు. బౌందర్‌బై.

"అయితే మరి గత్యంతరం లేదంటారా?" అని దీనంగా అడిగాడు స్టిపెను.

"ఎన్ని విధాల చూచినా నాకు చట్టాన్ని ధిక్కరించడమనేది సాధ్యంగా కనుపించడంలేదు. కాని డబ్బువల్ల ఈపని కొంతవరకు సాధ్యం కావచ్చు" అన్నాడు బౌందర్‌బై.

"ఎంత డబ్బు అవసరం ఉంటుందంటారు?" అని అడిగాడు స్టిపెను.

"కోర్టు ఖర్చులంటే సామాన్యంగా ఉన్నాయా? 1500 పౌండ్లు. యినా ఖర్చుకావచ్చు. కోర్టులంటే రొష్టుపని. పైగా నీవు తిరిగి వివాహం చేసుకోడానికి చట్టం అనుమతించాలి"—అన్నాడు బౌందర్‌బై.

"అయ్యో!—అయితే-ఈకోర్టులకు తిరగడంకంటె చనిపోవ డమే మంచిపని"—అన్నాడు స్టిపెను.

"అబ్బాయీ - నీవు - నీవు చేశిన తప్పుకు కోర్టులు ధర్మాన్ని న్యాయాన్ని కాపాడే సంస్థలు. ఆ సంస్థలను తారుమారు చెయ్యడం నీతరమా? నా తరమా?"—అన్నాడు బొందర్‌బై.

"చిత్తం"-అన్నాడు స్టిపెను.

తరువాత బొందర్‌బై స్టిపెనుకు ఇలా ఉపదేశం చెయ్యసాగాడు.

"అబ్బాయీ! నేను పూర్వాపరాలన్నీ ఆలోచించిన మీదట ఈ సలహాను నీ మంచికోసమే చెబుతూ ఉన్నాను. స్పార్సితె సతీమణి కూడా జీవితంలో ఎన్నోకష్టనష్టాలు అనుభవించింది. ఆవిడ వివాహ జీవితంకూడా విషాద పూరితమైనదే. ఆవిడ ఆవిషవలయంనుంచి బైటపడడానికి కొన్నిపందలపౌండ్లు ఖర్చుచేశింది. జీవితంలో ఏక్షణాన ఏవిధమైన అనుభూతిని ఎదుర్కోవలసి వస్తుందో మనం చెప్పలేము. మనం మానవ మాత్రులం ఎలాటి అనుభవాన్నయినా అనుభవించ వలసిన వాళ్ళమే కాని ప్రశ్నించ వలసిన వాళ్ళం మనంకాదు. ఇంత కాలం నీవు గుట్టుగా జీవితాన్ని గడుపుతూ వస్తున్నావు. నలుగురిలోను మంచిపేరు సంపాదించావు. ఇప్పుడు ఈ లేనిపోని రగడను ఎందుకు కొని తెచ్చుకుంటావు. నీకు ఎవరో చిల్లరరకం మిత్రులు చెడు సల హాలు చెప్పి ఉంటారు. అలాటి వారి అల్లరి చిల్లర మాటలను విని అనవసరంగా చెడిపోకు"—

"చిత్తం. మరి సెలవు తీసుకుంటాను" - అన్నాడు స్టిపెను బరువుగా నిశ్వసించి.

# 12

వృద్ధుడైన స్టిపెను మెట్లుదిగి వీధిలోకి వచ్చాడు. తలవంచుకుని మెల్లగా అడుగులువేస్తూ నడుస్తూవున్నాడు. అలా నడుస్తూ వెడుతూవున్న అతని బుజాన్ని వెనుకనుంచి ఎవరో తట్టినట్టుగా తోచింది.

స్టీపెను అప్పుడున్న పరిస్థితిలో నిజంగా అది అవసరమైన స్పర్శకాదు. అప్పుడు అతని హృదయంలో చెలరేగుతూవున్న మహా ప్రళయాన్ని చల్లార్చే శక్తివున్న చల్లని స్పర్శకూడా కాదది. అయి నప్పటికీ అది ఒక స్త్రీ యొక్క హస్త స్పర్శ.

స్టీపెను వెనుక్కి తిరిగిచూచాడు. ఒక స్త్రీ కనుపించింది. ఆ స్త్రీ సన్నగా పొడుగ్గా వున్నది. పరిశుభ్రంగా ఉతికిన బట్టలు వేసుకున్నది. కాని చెప్పులకు మాత్రం కొంచెం బురదకొట్టుకుని వున్నది. అప్పుడే ఎక్కడికో ప్రయాణంచేసి తిరిగి వస్తున్నట్టుగా వున్నది. శాలువా మడిచి చంకన పెట్టుకున్నది. చేతిలో గొడుగు, మరొకచేతిలో ఒక బుట్ట వున్నవి. స్టీపెను ఆ స్త్రీ వంక తదేక దృష్టితో చూడసాగాడు.

"అయ్యా! ఇప్పుడు ఆ యింట్లోనుంచి వస్తున్నది తమరే అను కుంటాను" - అన్నది ఆ స్త్రీ.

"అవును. నేనే" - అన్నాడు స్టీపెను.

"ఈ ముసలిది యిలా ప్రశ్నిస్తూ వున్నందుకు తమరు అన్యథా భావించకండి.

"ఇంతకూ తమరు ఆ ఇంట్లో ఉన్న పెద్దమనిషిని కలుసు కున్నారా?" అని ప్రశ్నించింది ఆస్త్రీ.

"ఆ. కలుసుకున్నాను! అన్నాడు స్టిపెను.

ఆయన ఎలా వున్నాడండీ?" కులాసాగా ఉన్నాడా? మనసిచ్చి మీతో నిర్మొహమాటంగా మాట్లాడారా?" అని ప్రశ్నించింది ఆ స్త్రీ.

స్టిపెనుకు ఆస్త్రీ ధోరణి ఎంతవరకూ అర్థంకాలేదు. ఆవిడవంక పరిశీలనగా చూడసాగాడు అలా కొంతసేపు ఆ స్త్రీ వంక పరిశీలనగా చూడగా ఆవిడను ఇంతకుముందు ఎక్కడో చూచినట్టుగా అనిపించింది స్టిపెనుకు.

"అవును. ఆయన కులాసాగానే ఉన్నాడు" అన్నాడు స్టీపెను.

"ఆరోగ్యంగా ఉన్నారా?" ప్రశ్నించింది ఆ స్త్రీ.

'ఆరోగ్యంగా లేకేం?" దిబ్బరొట్టెలా ఉన్నాడు" అన్నాడు స్టిపెను.

ఎన్నివిధాలుగా యత్నించినా ఈ స్త్రీని స్టిపెను ఆనవాలు పట్ట లేక పోతున్నాడు. ఎక్కడో చూచినజ్ఞాపకం మటుకు ఉన్నది. కాని ఎక్కడ ఎప్పుడు చూశాడో అతనికి స్పష్టంగా జ్ఞాపకం రాకుండా ఉన్నది. తరువాత ఇరువురూ ప్రక్కప్రక్కనే నడవసాగారు. స్టిపెను కోక్‌టౌను నగరవిశేషాలను గురించి ఆవిడకు చెప్పసాగాడు. "కోక్ టౌన్ నగరం పగలూ రాత్రీకూడా నిద్రపోని నగరం. ఇంతకూ అడగడం మరిచాను. మీరెక్కడినుంచి వస్తున్నారు?" పల్లెసీమనుంచి వస్తున్నారనుకుంటాను" అన్నాడు స్టిపెను.

"అవును. నేను పల్లె సీమనుంచే వస్తున్నాను" - అన్నది ఆస్త్రీ.

"అలాగా?" - అన్నాడు స్టిపెను.

"ఈ రోజు 40 మైళ్ళు ప్రయాణంచేశి ఇక్కడికి వచ్చాను. రైల్లో ప్రయాణం 40 మైళ్ళు. మా ఊరినుంచి స్టేషనుకు 9 మైళ్ళు. ఆ 9 మైళ్లూ నడిచే వచ్చాను ఈ మధ్యాహ్నమే నేను మళ్ళా తిరిగి వెళ్లాలి" - అన్నది ఆస్త్రీ.

తరువాత ఒక్కక్షణం ఆగి ఆ స్త్రీ మళ్ళీ యిలా చెప్పసాగింది: "చూడండి - ఈ ముసలితనంలో నడవాలంటే యమయాతనగా వుంటుంది."

"అవును. నిజమే." - అన్నాడు స్టిపెను.

తరువాత ఆ స్త్రీ మళ్ళీ యిలా చెప్పసాగింది: "చూడండి, నేను సంవత్సరానికి ఒక పర్యాయం యిలా నగరానికి వస్తూవుంటాను. నాకు పరిచయంవున్న వ్యక్తులను చూచి వెడుతూవుంటాను. ఇప్పుడు మీరు వస్తున్నారు చూచాచూ ఒక యింటినుంచి ఆ యింటి యజమాని బౌందర్‌బై గారితోకూడా నాకు ఎంతో పరిచయం వున్నది" - అన్నది ఆ స్త్రీ.

ఇరువురూ కలిసి నడుస్తూవున్నారు. స్టీఫెను ఒకమాటు చర్చి గడియారంవంక చూచాడు. మిల్లుకు సమయం దాటిపోతుందేమోనని మరింత వేగంగా నడవసాగాడు.

"మీ రెక్కడ పనిచేస్తూ ఉంటారు?" - అని ప్రశ్నించింది ఆస్త్రీ.

"ఇక్కడ. మిల్లులో పనిచేస్తూ - ఉంటాను" - అని జవాబు చెప్పాడు స్టిపెను.

అతనలా చెప్పినప్పుడు ఎందుచేతనో కాని ఆవిడ ముఖంలో విషాదపూరితమైన ఒకరేఖ ఏర్పడింది.

హఠాత్తుగా, "మీకు జీవితంలో సుఖం లేదనుకుంటాను"— అన్నది.

"ప్రపంచంలో ప్రతివ్యక్తి జీవితంలోనూ ఏదో ఒక దుఃఖం ఉండనే ఉంటుంది. కష్టాలు లేని జీవితం ప్రపంచంలో ఎక్కడుంటుంది?"-అన్నాడు స్టిపెను.

"మీకష్టాలు మీసంసారానికి సంబంధించినవని అనుకుంటాను"- అన్నది ఆస్త్రీ.

ఆస్త్రీ ఇలా అనేసరికి ఈ మాటు స్టిపెను నిజంగా ఆశ్చర్యపోయాడు.

"అవును. మీరన్నమాటలో కొంతవరకు సత్యం లేకపోలేదు" అన్నాడు స్టిపెను.

"కాని మీ మానసికవ్యథలవల్ల మిల్లులో పనికీ ఏవిధమైన భంగమూ ఉండదని అనుకుంటాను" అన్నది ఆమె.

"అవును. మిల్లులో కార్మికుడుగా నా జీవితానికీ నా వ్యక్తిగత జీవితానికీ ఏమీ సంబంధంలేదు. అదీగాక బౌండర్బై చండశాసనుడు. మిల్లుపనిలో ఏమాత్రం భంగపాటు కలిగినా ఆయన సహించడు" అన్నాడు స్టిపెను.

ఇలా మాట్లాడుకుంటూ ఇరువురూ మిల్లువద్దకు చేరుకున్నారు.

ఇప్పుడే మిల్లు గంట మోగింది. పనివారు చేరుకుంటూ ఉన్నారు. ఫ్యాక్టరీ గొట్టం మళ్ళీ పొగలు గ్రక్కుతూ ఉన్నది.

స్టిపెను ఆవిడవద్ద సెలవు తీసుకుని లోనికి వెళ్ళబోయేముందు ఆ స్త్రీ అతన్ని ఇలా ప్రశ్నించింది.

"మీరు యీ మిల్లులో ఎంతకాలంనుంచి పనిచేస్తూవున్నారు?" - అని ప్రశ్నించింది.

"ఇప్పటికి నేను యీ మిల్లులో పనిచేయడం మొదలుపెట్టి 12 సంవత్సరాలు కావస్తూవున్నది" - అన్నాడు స్టిపెను.

అవుతే, 12 సంవత్సరాలపాటు యీ మిల్లులో కష్టంచేసిన మీ చేతిని ఒకమాటు ముద్దాడనివ్వండి" - అన్నది ఆ స్త్రీ. ఇలా అని అతని చేతిని తన చేతిలోకి తీసుకుని మెల్లగా ముద్దాడి అతనివద్ద సెలవు తీసుకుని వెళ్ళింది. ఆ వృద్ధురాలి నిరాడంబరత్వం, ఆప్యాయత, ఆర్ద్రత్వమూ స్టిపెను హృదయాన్ని ద్రవింపచేశాయి. స్టిపెను మిల్లులో ప్రవేశించాడు.

మరమగ్గం ముందు కూచున్నాడు.

కాని ఆవిడను గురించిన ధ్యానంనుంచి అతని మనస్సును మరలించలేకుండా వున్నాడు. ఆవిడను గురించే ఆలోచిస్తూ కూచున్నాడు. ఒకమాటు కిటికీలోనుంచి తొంగిచూచాడు. ఆవిడ అక్కడే మిల్లు బయట ఆవరణలో నిల్చుని ఫ్యాక్టరీ గొట్టంనుంచి వెలువడుతున్న పొగలవంక ఆశ్చర్యంతో చూస్తూ నిల్చుని వున్నది.

ఆవిడ తిరిగి తన స్వంత గ్రామానికివెళ్ళి కొన్నిరోజులగడిచాయి. కాని ఆవిడ తాలూకు జ్ఞాపకం మాత్రం స్టిపెను మనస్సులో ఇంకా చెరిగిపోలేదు.

స్టిపెను ప్రతిరోజూ మిల్లుకు పోతూనే ఉన్నాడు. పనిచేస్తూనే ఉన్నాడు. కాని అతని హృదయంలోని బరువు మాత్రం అలాగే ఉన్నది.

పోయిన రాత్రి అతను రాషెల్‌ను కలుసుకుని మాట్లాడాడు. తన బాధలన్నీ ఆవిడతో చెప్పుకున్నాడు. ఇరువురూ రాత్రి ఎంతో ప్రొద్దపోయేవరకూ మాట్లాడుకున్నారు. అలా మాట్లాడినప్పుడు స్టిపెనుకు తాత్కాలికంగా కొంత మానసికమైన ఉపశాంతి కలిగినప్పటికి ఇంటికి వెళ్ళగానే అతని మనోవ్యధల మళ్ళీ మేలుకుని అతన్ని కలిచి వెయ్యసాగాయి.

స్టిపెను యిల్లున్నది. కాని యిల్లు వుండడంకన్న యిల్లు లేకపోవడమే మంచిదని అనిపించింది స్టిపెనుకు. ఇల్లనేది ఒకటి వున్నా

అతను యింటికి వెళ్ళడానికి వీలులేదు. అతనికి యిల్లంటే భయం. భూతంలా కనిపెట్టుకుని వుండే భార్య జ్ఞాపకం వస్తుంది.

అతను తింటూవున్నాడు - తాగుతూవున్నాడు - ఆకలివల్ల కాదు-దాహంవల్ల కాదు - బ్రతకాలి కాబట్టి. ఇంటికి వెళ్ళడు. ఆకలి వేసినప్పుడు నాలుగు మెతుకులు నోట్లో వేసుకుంటాడు. దాహం వేసినప్పుడు ఒక గుక్కెడు మంచినీళ్ళు త్రాగుతాడు. ఎక్కడ పంచ కనుపిస్తే అక్కడ తలవాల్చి నిద్రపోతాడు. ఇప్పుడు అతను జీవితంలో దేనికీ లెక్కచెయ్యడంలేదు. ఎండా వానా - రెండూ అతనికి ఒకే విధంగా కనుపిస్తూ వున్నవి.

కొన్ని సంవత్సరాలనుంచి రాషెల్‌కు అతనికీ స్నేహం వున్నది. అది ఎంతో గాఢమైన స్నేహం. అయినా వారిద్దరి మధ్య ఎన్నడూ వివాహాన్ని గురించిన ప్రస్తావన అన్నది రాలేదు. రాషెల్‌కు స్టిపెను పట్ల ఎంతో దయ, జాలి.

ఇరువురూ కలుసుకున్నప్పుడు స్టిపెను తన కష్టసుఖాలన్నీ రాషెలుకు చెప్పుకునేవాడు. కాని అతను రాషెల్‌ను ఎన్నడూ వివాహం చేసుకోమని కోరలేదు. అలా కోరినప్పటికీ ఆవిడ ఆగ్రహించుకోదని కూడా అతనికి తెలుసును. కాని స్టిపెను ఎన్నడూ ఆ ప్రస్తావనను ఆవిడ సమక్షంలో తీసుకొనిరాలేదు. ఒకొక్కక్కమాటు స్టిపెను తనకు రాషెల్ భార్య అయినట్లుగా ఊహించుకునేవాడు. అవి వట్టి ఊహ మాత్రమే. రాషెల్. తనకు భార్య అయిఉండినట్లవుతే తన జీవితం ఇలా అధఃపతితమై విభగ్నమై ఉండేదికాదని అనుకునేవాడు స్టిపెను. రాషెల్‌ను వివాహం చేసుకుని ఉండిఉన్నట్లవుతే తనజీవితంపూలబాటలా ఉండిఉండేది. ఆ స్వప్న జీవితాన్ని ఊహించుకున్నప్పుడు స్టిపెను మనస్సులో ఆనందమూ ఒకవిధమైన అతిశయమూ నిండుకునేది.

కాని ఇప్పుడు తన జీవితం విభగ్నమై పోయింది. శిథిలమై పోయింది. పీడకలగా మిగిలింది. ఎంతో చక్కగా చల్లగా వెళ్ళిపోవలసిన జీవితం గుదిబండలాగ తయారైంది. ఇంతకీ కారణం తనభార్య. భూతంలా తనని పట్టుకున్నది.

తను వయస్సులో ఉన్నప్పుడు రాషెర్‌ను కలుసుకున్నాడు. అప్పుడు రాషెల్ కూడా యువతి. జీవితం బంగారు కలలాగ కనిపించిన రోజులవి. కాని ఆరోజులు వెళ్ళిపోయాయి. జీవితంలో చీకటి కమ్ముకున్నది. ఇరువురి జీవితాలనూ వృద్ధాప్యం కబళించింది.

ఈ లోగా ఎందరో యువతులకు వివాహాలూ జరిగాయి వారందరూ రాషెల్ తోటివారే వారికి పెండ్లిళ్లూ పేరంటాలూ జరిగి ఒకొక్కరు గంపెడు మంది పిల్లల్ని కని హాయిగా చల్లగా సంసారాలు చేస్తూ ఉన్నారు. కాని రాషెల్ మటుకు వివాహం చేసుకోలేదు. తనకోసం తన జీవితంలోని సౌఖ్యాన్ని త్యజించింది. ఏ కాంత జీవితాన్ని గడిపింది. కాని తను కూడా రాషెల్‌ను సుఖపెట్టలేకపోయాడు. రాషెల్ ముఖంలోని విచారముద్రను చూచినప్పుడల్లా స్టిపెనుకు పేగులుకలచి వేశినట్లుగా ఉండేది. ఈ ఆలోచనలతో సతమత మవుతూ స్టిపెను ఇంటి వైపుకు నడకసాగించాడు.

# 13

స్టీఫెను యిల్లు చేరాడు.

కిటికీలో కోడిగుడ్డు దీపం కొడిగట్టింది, ఇక క్షణంలో దీపం ఆరిపోవచ్చు.

మసకవెల్తురు పడుతూవున్నది.

కిటికీ ప్రక్కనే ఎప్పుడూ ఒక నిచ్చెన నిల్పోబెట్టి వుంటుంది. రాత్రి పొద్దుపోయి వచ్చినవారు ఆ నిచ్చెనను ఎక్కి మేడమీదకు వెళ్ళవచ్చు.

ఎందుచేతనో కాని యింటి గడపదగ్గరకు చేరేసరికి స్టీఫెను మనస్సులో జనన మరణాలను గురించిన ఆలోచన కలగసాగింది. ఒకేక్షణంలో రాజుకూ పేదకూ సంతానం కలగవచ్చు. కాని యిరువురి జీవితాలూ ఒకతీరుగా సాగవు. కాని మృత్యువు మాత్రం యిరువురికీ తప్పదు.

స్టీఫెను మనస్సులో యీ ఆలోచన తళుక్కున మెరుపుతీగలా మెరిసింది.

స్టీఫెను మెల్లగా మెట్లెక్కి మేడమీదకు వెళ్ళాడు. చప్పుడు కాకుండా తలుపు తెరిచాడు, మెల్లగా గదిలో ప్రవేశించాడు.

గదిలో వాతావరణం ప్రశాంతంగా వున్నది. రాషెల్ మంచం ప్రక్కనే కూచుని వున్నది. మంచంమీద స్టీఫెను భార్య పడుకుని వున్నది.

స్టీఫెను అడుగుల చప్పుడు వినగానే రాషెల్ తలయెత్తి చూచింది. ఆ మసక చీకట్లో ప్రశాంతమైన రాషెల్ ముఖం స్టీఫెను కండ్లకు పూర్ణిమా చంద్రబింబంవలె నిండుగా చల్లగా కనుపించింది.

స్టీఫెను భార్య పడుకున్న మంచం ప్రక్కనే నేలమీద కూచుని రాషెల్ ఆవిడకు పరిచర్య చేస్తూవున్నది.

ఇప్పుడు గది పరిశుభ్రంగా వున్నది. రాషెల్ వచ్చి, స్టీఫెను భార్య గదిలో చిందరవందరగా పడేసిన బట్టలన్నిటినీ మూటకట్టి ఒక మూల వుంచింది. గదిని శుభ్రంగా ఊడ్చింది. స్టీఫెను రాషెల్ ముఖం వంక చూచాడు.

రాషెల్ ముఖంలో ఒకవిధమైన ప్రశాంతత తాండవిస్తూవున్నది.

స్టీఫెను కండ్లలో నీళ్ళుతిరిగాయి.

రాషెల్ కూడా స్టీఫెను కళ్ళలోకి చూచింది.

స్టీఫెను కళ్ళలో నీళ్ళుతిరగడం చూచి ఆవిడ కళ్ళలోనూ నీళ్ళు తిరిగాయి.

ఆవిడ మెల్లని కంఠస్వరంతో యిలా అన్నది: 'స్టీఫెను - నీవు వచ్చినందుకు ఎంతో సంతోషం. కాని యింత ఆలస్యంగా వచ్చావేం?' అన్నది.

'ఏమీ తోచక వీధులవెంబ తిరుగుతూవున్నాను' - అన్నాడు స్టీఫెను.

"నేనూ అలాగే ఊహించాను. కాని ఇలాటి వర్షరాత్రులలో అలా తిరిగితే ఆరోగ్యం పాడైపోతుంది. గాలికూడా తీవ్రంగా వీస్తున్నది. అన్నది రాషెల్.

"అవును. కాని ఆ గాలి హోరు నాకు వినిపిస్తేనా ?" అన్నాడు స్టీఫెను.

"నేను ఇంతక్రితం ఒకమాటు ఇక్కడికి వచ్చి వెళ్ళాను, ఇంటి యజమానురాలు మా ఇంటికివచ్చి నీ భార్యకు చాలా జబ్బుగాఉన్నదని చెప్పి నన్ను పిలుచుకువచ్చింది. స్టీఫెను ఆవిడ చెప్పినమాట నిజమే. నీ భార్యకు చాలా జబ్బుగా ఉన్నది. పైగా గాయాలుకూడా తగిలాయి" అన్నది రాషెల్.

స్టీఫెను మెల్లగా ఒక కుర్చీదగ్గరకు నడిచివెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు.

తరువాత రాషెల్ మెల్లగా ఇలా చెప్పసాగింది :

"నాకు చేతనైన సాయం చేయ్యాలని నేనిక్కడికి వచ్చాను స్టీఫెను. నీ భార్య నాకు చిన్ననాటి నేస్తం, ఇదువురం కలిసి ఒకే మిల్లులో పనిచేశాము. ఆ తరువాత నీవు ఆవిడను వరించి వివాహం చేసుకున్నావు."

స్టీఫెను నుదుటిని చేతితో గట్టిగా అదుముకుని బాధతో మూల్గసాగాడు.

రాషెల్ మళ్ళీ ఇలా చెప్పసాగింది :

"స్టీఫెను - నీ హృదయం నాకు తెలియందికాదు. నీది ఎంతో జాలిగుండె. నీభార్య రోగగ్రస్తురాలై చనిపోతే నీవు భరించలేవని నాకు తెలుసు.

రాషెల్ ! రాషెల్ ! ఇహ నీకు ఆవిషయాన్ని చెప్పకు అన్నాడు స్టీఫెను.

"స్టీఫెను - నీవు ఎంతో బాధను అనుభవించావు. భగవంతుడు నిన్ను అనుగ్రహిస్తాడుగాక !" అన్నది రాషెల్.

ఆ తరువాత రాషెల్ స్టీఫెను భార్యకు పరిచర్యలు చేయసాగింది. స్టీఫెను భార్య కంఠప్రదేశంలోని గాయాలను కడిగింది. మందురాసింది.

స్టీఫెన్ భార్యపడుకుని ఉన్న మంచం ప్రక్కనే ఒకబల్ల ఉన్నది. ఆబల్లమీద రెండుమందు సీసాలు ఉన్నాయి.

స్టీఫెనుకు ఆమందు సీసాల వంక చూచినప్పుడు అతన్ని ఏదో తీవ్రమైన భయం ఆవరించసాగింది.

"నేను మూడుగంటలయ్యే వరకూ ఇక్కడే ఉంటాను స్టీఫెను. మూడు గంటలకు మళ్ళీ ఒకమాటు మందు ఇవ్వాలి"-అన్నది రాషెల్.

"అంతసేపు మేలుకుని ఉంటే మళ్ళీరేపు పనికి వెళ్ళొద్దా?"-అన్నాడు స్టీఫెను.

"పరవాలేదు. పోయినరాత్రి హాయిగా నిద్రపోయాను. నీవు చాలా అలసినట్టు కనుపిస్తున్నావు. నీవు విశ్రాంతి తీసుకో"-అన్నది రాషెల్.

రాషెల్ సానుభూతి పూర్వకమైన శీతల వాక్కులతో స్టీఫెను మనస్సు కొంచెం చల్లబడినట్టయింది.

"స్టిపెను - నేనువచ్చినట్టు నీ భార్యకు తెలియనే తెలియదు. నీభార్య అపస్మారక స్థితిలో ఉన్నది. మధ్యమధ్యలో మూలుగుతుంది. అర్ధంలేని ఏవేవో మాటలను సణుగుతుంది. వెర్రి చూపులుచూస్తుంది. పలకరించినా పలకడంలేదు"-అన్నది రాషెల్.

"డాక్టరుగారు ఏమన్నారు?"-అని ప్రశ్నించాడు స్టిపెను.

"రేపు తెల్లవారేసరికి తేరుకుంటుందని చెప్పారు" - అన్నది రాషెల్.

అతని చూపులు మళ్ళీ బల్లపై ఉన్న మందు సీసాపై పడ్డాయి. ఆమందు సీసా కళ్ళపడగానే అతని శరీరం యావత్తూ నరనరం వణికి పోయింది. అతను చలికి వణికి పోతున్నాడని ఊహించింది రాషెల్. "చలిగా ఉన్నదా? అలా వణుకుతూ ఉన్నావు?"-అని ప్రశ్నించింది.

"చలిగాలేదు. ఏదోభయం నన్ను ఆవహించింది" - అన్నాడు స్టిపెను.

"భయం! ఏమిటాభయం?" - అని ప్రశ్నించింది రాషెల్.

"ఏదోభయం నన్ను ఆవహించింది. నడుస్తున్నప్పుడూ అదే భయం! ఆలోచిస్తున్నా అదేభయం! నన్ను వెంటాడుతూ ఉన్నది"-అన్నాడు స్టిపెను.

మళ్ళీ అతన్ని అభయం ఆవహించిందో ఏమో అతను మెల్లిగా బీరువాను ఆధారంగాచేసి పట్టుకు లేచి నిల్చున్నాడు. ముఖంనిండా చెమటకమ్మింది. ముఖంమీద చెమట తుడుచుకున్నాడు.

అతను బరువుగా అడుగులువేస్తూ రాషెల్ వైపుకు వస్తూ ఉన్నాడు.

"స్టిఫెను - ఏమిటది ? అలావున్నావు ? తూలిపోతూ ఉన్నావు?" అంటూ రాషెల్ అతనివైపుకు రాసాగింది.

అతను పడకుండా పట్టుకోడానికి ప్రయత్నించింది. కాని అతను చెయ్యి అడ్డంవుంచి—

"రాషెల్ నువ్వు అక్కడే ఆ మంచంప్రక్కనే కూచుని పరిచర్య చేస్తూఉండు. అలా నీవు పరిచర్య చేస్తోంటే చూస్తూఉండడం నాకెంతో ఇష్టం" అన్నాడు స్టిఫెను.

ఒక తీవ్ర భయోద్వేగం అతన్ని ఆపాదమస్తకం ప్రకంపితం చేసింది, తీవ్రమైన తుఫాను గాలికి చెట్టు వణికిపోయినట్టుగా వణికిపోయి కుర్చీలో కుప్పగా కూలిపోయాడు.

ఒకక్షణం తరువాత మెల్లిగా తనను తాను నిభాయించుకుని, ఒకచేతితో మోకాలుపట్టుకొని మరోచేతితో తలపట్టుకొని రాషెల్ వంక అశ్రుజల సంసిక్త నయనాలతో చూడసాగాడు.

కొవ్వొత్తి మసకవెలుతురులో రాషెల్ అతని దృష్టికి ఒక దేవతామూర్తిలా కనుపించింది. నిజంగా కూడా ఆవిడ దేవతామూర్తి.

నిండుతనానికి నిబ్బరానికి మారుపేరు.

'స్టిఫెను - నీ భార్యకు జబ్బు నయమైపోతుంది. ఆ తరువాత ఆవిడ పూర్వం నీకు కష్టం కలిగించినట్టుగా కలిగించదు. నాకు గట్టి విశ్వాసం వున్నది.

మన విశ్వాస అవిశ్వాసాల మాట అలా వుంచి - మనం మానవులం కాబట్టి ముందు మంచి జరుగుతుందని ఆశిస్తాము - ఇక నీవు విశ్రాంతి తీసుకో - కాసేపు నిద్రపోవడానికి ప్రయత్నించు' - అని సాదర కంఠస్వరంతో చెప్పసాగింది రాషెల్.

రాషెల్ మాటలు మండుతూవున్న స్టీఫెను మనస్సును కొంత ఉపశమింపచేశాయి.

స్టీఫెను మెల్లిగా కళ్లుమూశాడు. క్రమక్రమంగా అతన్ని నిద్రా దేవత ఆవహించింది. గాలిచప్పుడు - పగటి జ్ఞాపకాలు - అన్నీ నిద్రలో విలీనమైపోయాయి. ఆ నిద్రలో అతనొక దీర్ఘమైన కల కన్నాడు. ఒక చర్చి - ఆ చర్చిలో వేలవేల దీపాలు వెలుగుతూ వున్నాయి. ఆ దీపాల కాంతులలో తనకు వివాహం జరుగుతూవున్నది. పెండ్లికుమార్తె రాషెల్ కాదు. మరెవరో కొత్తపిల్ల. తను ఎంతో ప్రేమించిన అమ్మాయి. కాని ఆ అమ్మాయిని ఎవరో తను గుర్తించ లేకుండా వున్నాడు. వివాహ సందర్భంలో సాక్షులుగా స్టీఫెనుకు పరిచితు లైనవారు చాలామంది వచ్చారు. వారిలో కొందరు బ్రతికివున్నవారు.

మరికొందరు చనిపోయిన వారుకూడా ఉన్నారు.

వివాహం జరుగుతూ ఉండగా చీకటి కమ్మింది. చీకటి ఇంతలో హఠాత్తుగా మాయమై పెళ్ళున ఒకకాంతి మండపాన్నంతా ఆవరించింది దైవ పీఠంపై ఉన్న మతగ్రంథంలోనుంచి ఆకాంతి బయలు వెడలింది మతగ్రంథంలోని మహావాక్యాలు మండపాన్ని యావత్తూ వ్యాపించాయి. ఈ కాంతి బయలు వెడలడంతో స్టీఫెను చుట్టూతా ఉన్న వాతావరణం యావత్తూ మారిపోయింది. మండపంలో తానూ పురోహితుడూ తప్ప మరెవరూ కనుపించడంలేదు. ఇంతకు పూర్వం కనుపించిన వారం దరూ ఎక్కడో మాయమై పోయారు. చర్చినిండా ఒక పెద్దజన సమూహం చేరి ఉన్నది.

ప్రపంచంలోని జనసంఖ్య యావత్తూ అక్కడేచేరి ఉన్నట్లు స్టీఫెనుకు అనిపించింది. ఆజన సమూహం అతని వంక పగతోను ద్వేషంతోను చూస్తున్నది.

అతనికి మృత్యువు సమీపించి నట్లుగా ఉన్నది.

మృత్యు యాతనను అనుభవించ నున్న అతన్ని చూడడానికి ఆజన సంఖ్య అక్కడ చేరినట్లుగా ఉన్నది. ఒక్కక్షణంలో స్టీఫెను నిల్చుని ఉన్న పీఠం కూలి పోయింది.

స్టిపెను మరణించాడు. మృత్యులోకంలో కొంతకాలం విహరించి మళ్ళీ మామూలులోకంలోకి వచ్చాడు. తన పరిచితమైన ప్రదేశాలను చూచి వచ్చాడు. కాని ఎక్కడా అతనికి రాషెల్ ముఖం కనుపించలేదు.

ఘాతంలాంటి ఒక అదృశ్య అవ్యక్తస్వరూపం ఏదో అతన్ని వెన్నాడసాగింది. అతను ఏ వస్తువునుచూచినా ఆవస్తువు ఆ రూపాన్ని ధరించసాగింది.

గాలి రివ్వున వీస్తోంది.

వర్షం ఇండ్ల చూరులపైబడి భీకరమైన శబ్దంచేస్తూ కుండపోతగా కురుస్తున్నది. స్టిపెను ఇంకా స్వప్నావస్థలోనేఉన్నాడు.

రాషెల్ మంచం ప్రక్కనే ఉన్న కుర్చీలో కూచుని కునికిపాట్లు పడుతూ వున్నది. శాలువా కప్పుకుని కుర్చీలో నిశ్చలంగా ప్రతిమవలె కూచునిఉన్నది రాషెల్.

స్టిపెను కండ్లుతెరిచి ఇంతలో మళ్ళీ కళ్ళు మూస్తూఉన్నాడు. తను స్వప్నావస్థలో ఉన్నాడో లేక జాగ్రదవస్థలో ఉన్నాడో తనకే తెలియడంలేదు.

ఒక తెర కదిలినట్టుగాఉంది. అతను పరికించిచూచాడు. నిజమే, తెర కదిలింది. ఆ తెరచాటునుంచి ఒకచెయ్యి చాచినట్లు కనుపించి ఇంతలో మళ్ళీ ఆ చెయ్యి అదృశ్యమైపోతూ ఉన్నది.

తన భార్య మంచంమీద లేచి కూచున్నట్లుగా ఉన్నది. ఆవిడ కండ్లు ఎరుపెక్కి, బరువుగా భయానకంగా కనుపిస్తూ ఉన్నవి. ఆవిడ గది నాలుగు మూలలా ఒకమాటు కలయజూచింది.

స్టిపెను స్తబ్దుడై తను ఉన్నచోటనే కూచుని ఆవిడవంక చూస్తూ ఉన్నాడు.

ఆవిడ ఒకమాటు స్టిపెనువంక పరికించి చూచింది. ఆవిడమంచం ప్రక్కన రెండుసీసాలు ఉన్నాయి. ఒకసీసాలో మందు, మరొక సీసాలో మృత్యుద్రావకం వున్నాయి. ఆవిడ ఒకమాటు రెండుసీసాల వంక పరకాయించి చూచింది. ఏ సీసాలోని ద్రావకం తాగాలా అవి

కొంతసేపు ఆలోచించింది. చివరకు విషద్రావకంఉన్న సీసా మూతను గట్టిగా నోటితో తెరిచింధి.

ఇది కలకావచ్చు - లేక నిజంకావచ్చు - కాని స్టిపెనుకు మటుకు గొంతుక పెకిలిరాలేదు. అతను కూచున్న చోటినుంచి కదల్లేక పోయాడుకూడా.

ఆవిడ ఆ విషద్రావకాన్ని పెదవులవద్దకు తీసుకున్నది. ఇక ఒక క్షణం గడిస్తేచాలు - ఈ యావత్ప్రపంచమూ సాయంవచ్చినా ఆవిడను మేలుకొల్పలేము. ఈ క్షణంలోనే దైవికంగా రాషెల్ మేలుకుని ఆవిడ పెదవుల నుంచి విషపుసీసాను లాగి వేశింది. స్టీఫెన్ ఉలికి పడి కళ్ళు తెరిచాడు. 'రాషెల్- నేనునిద్రిస్తున్నానా? మేలుకుని ఉన్నానా?'- అని రాషెల్‌ను ప్రశ్నించాడు. 'బాగుంది ఈప్రశ్న! ఇంత సేపూ నిద్ర పోతూనే ఉన్నావు'- అన్నాది రాషెల్. 'అప్పుడు గంట ఎంతై ఉంటుంది?'- అన్నాడు స్టీఫెన్. 'మూడుగంటలై ఉంటుంది' అన్నది రాషెల్. రాషెల్ అలా అన్నదో లేదో చర్చిగడియారం మూడు గంటల కొట్టింది.

స్టీఫెన్ ఒకమాట రాషెల్ ముఖంవంక చూచాడు. రాషెల్‌ముఖం నిద్ర సరిగా లేక పోవడం వల్ల పాలి పోయిఉన్నది జుట్టుచెదిరి ఉన్నది

ఇంకా ఆవిడ చేతిలో సీసా ఉన్నది. రాషెల్ సీసాలో ద్రావ కాన్ని బేసిన్‌లో పారబోశి గుడ్డతో తుడిచింది. తరువాత సాదర దృక్కులతో స్టిపెను వంకచూస్తూ ఇలా అన్నది.

"ఇంతకీ నేను ఇక్కడ ఉండడం ఎంతో మంచిదైంది. లేక పోతే అంతపనీ జరిగిపోయేదే."

తరువాత రాషెల్ శాలువా కప్పుకుని, "స్టిపెను నేను వచ్చి చాలాసేపైంది. ఇహ ఇంటికి వెడతాను"— అన్నది.

'ఈ వర్షంలోను గాలిలోను యింటికి వెడతావా రాషెల్? ఈ రోగి ప్రక్కన నన్ను ఒంటిగా వదలి వెడతవా!'- అని అడిగాడు స్టీపెన్ పరిదీన కంఠస్వరంతో.

'వెళ్ళక తప్పదు స్టీపెన్. ఇంట్లో కొండంత పని పేరుకుని ఉన్నది'- అన్నది రాషెల్.

స్టీపెను మెల్లిగా అడుగులు వేస్తూ రాషెల్ వద్దకు వెళ్ళాడు. ఆవిడ పాదాలముందు మోకరిల్లి. "నీవు నిజంగా దేవతవు రాషెల్. నీవు అమృతమూర్తివి. త్యాగ దేవతవు" - అన్నాడు.

"నేను దేవతను కాను స్టీఫెన్. నేను సామాన్య మానవ వ్యక్తినే, నీకు స్నేహితురాలిని. అంతే. నిష్కళంకమైన దేవతలకూ. పాపాలకు పుట్టినిల్లయిన నాలాటి అధమురాలికీ సంబంధం ఏమిటి? నన్ను దేవతలతో పోల్చకు. సామాన్య మానవులలో వుండే మంచితనం నాలోనూ వుంటే చాలు. ఇంతకన్న నేను కోరేది మరేమీలేదు" - అన్నది రాషెల్.

రాషెల్ యిలా అంటూ ఒకమాటు కనురెప్పలెత్తి స్టీఫెన్‌వంక సాదరంగా చూచింది. ఇంతలో మళ్ళీ కనురెప్పలను దించుకున్నది.

"రాషెల్! నీవు అద్భుతమైన వ్యక్తివి. రాక్షసునివంటి నన్ను నీవు దేవతగా మార్చావు. నీవు నిజంగా దేవతవే. పతనమైపోతున్న నా ఆత్మను నీవు పునరుజ్జీవితం చేశావు" - అన్నాడు స్టీఫెన్.

రాషెల్ తన పాదాలవద్ద మోకరిల్లి యిలా చెబుతూవున్న స్టీఫెన్ వంక చూడసాగింది. ఆవిడ కండ్లు చెమరించాయి. స్టీఫెన్ ముఖం బాధతో మెలికలు తిరుగుతూ వున్నది.

"నిరాశ నిస్పృహతో బరువుగా కాళ్ళీడ్చుకుంటూ యింటికి చేరుతాను. నాకేదో భయంగా వుందని నీతో అంటూవచ్చాను. ఆ భయం యీ విషపాత్రే- నీవే లేకపోతే యీ రోజున యీ విషపాత్ర రెండు నిండుప్రాణాలను కబళించి వుండేది" - అన్నాడు స్టీఫెన్.

"అలాటి మాట అనకు" - అంటూ రాషెల్ అతని నోటికి చెయ్యి అడ్డం వుంచింది.

"రాషెల్ - నీవు నిజంగా దేవతవు" - అంటూ స్టీఫెను ఆవిడ శాలువా కొంగును ముద్దిడాడు.

రాషెల్ అ[illegible]రుద్ధ కంఠస్వరంతో అతనివద్ధ సెలవుగైకొని అక్కడినుంచి కదిలి వెళ్ళింది.

రాషెల్ వీధిలో అడుగుపెట్టింది.

గాలి హోరున వీస్తోంది. వర్షం వెలిసింది. ఆకాశపథంలో నక్షత్రాలు పరిశుభ్రంగా ప్రకాశిస్తూ వున్నవి.

రాషెల్ యింటివైపుకు నడక సాగిస్తోంది.

# 14

క్రోక్ టౌన్ నగరంలోని ఫాక్టరీలలో మరచక్రాలు గిర్రున తిరుగుతున్నట్లే కాలచక్రం కూడా గిర్రున తిరిగిపోతూవుంది.

అపరిహార్యాలూ లెక్కలేనంత మానవశక్తి వెచ్చింపబడుతూ వున్నది.

గుట్టలకొద్దీ ధనం పెరిగిపోతూ వున్నది.

లూసా, థామస్‌లు పెరిగి పెద్దవారవుతూవున్నారు. ఇలా వుండగా గ్రాడ్ గిండ్ ఒకరోజున కుమార్తె లూసాను పరికాయించి చూచి యిలా అన్నాడు: "అమ్మాయి లూసాకు అప్పుడే పెళ్ళీడు వచ్చినట్టుగా వున్నది" - అని.

థామస్ కూడా మరో అడుగు పొడుగు పెరిగాడు.

"థామస్ కూడా పెరిగి పెద్దవాడైనాడు" - అన్నాడు గ్రాడ్‌గిండ్ మహాశయుడు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

రోజులు దొర్లిపోతూ ఉన్నాయి. ప్రపంచంలో అనేకమార్పులు జరుగుతూ ఉన్నాయి. కాని గ్రాడ్‌గిండ్ మహాశయునిలో మటుకు పెద్ద మార్పేమీ కనుపించడంలేదు.

"థామస్ బౌండర్‌బై వద్దకు వెళ్ళవలసిన సమయం ఆసన్నమైంది" - అన్నాడు గ్రాడ్‌గిండ్.

ఒక రోజున గ్రాడ్‌గిండ్ సిసీని దగ్గరకు పిలిచి ఇలా అన్నాడు: "ఇకముందు నీ బడిచదువు కొనసాగించడంవల్ల లాభమేమీలేదని నాకు తోస్తూ ఉన్నది" - అని.

"చిత్తం" - అన్నది సిసీ వినమ్రంగా.

తరువాత గ్రావ్‌గిండ్ కను బొమ్మలను దగ్గరకు ముడిచి సిసీతో ఇలా చెప్పసాగాడు. "అమ్మాయీ! ఉన్న విషయాన్ని నీతో చెప్పకుండా దాచి ఉంచలేక పోతున్నాను. అందుచేత వున్న విషయం వున్నట్లుగా నీతో చెబుతూ ఉన్నాను. ఇలా చెప్పవలసి వచ్చినందుకు నీవు మరోవిధంగా భావించవని ఆశిస్తాను. నీబడిచదువు నాకు ఎంత మాత్రం సంతృప్తిని కలిగించలేదు. నీచదువు విషయంలో నేనుపెట్టుకున్న ఆశలన్నీ నిరాశగా పరిణమించాయి. భాకమ్ చైల్డ్‌వద్ద నీవు చదువుకుని ఎంతో విజ్ఞానాన్ని ఆర్జిస్తావని అనుకున్నాను. కాని అలాటిదేమీ జరగలేదు" - అన్నాడు గ్రాడ్‌గిండ్.

"చిత్తం. తమరుచెప్పిన మాటలలో అసత్యమేమీ లేదండి. కాని నా దొక చిన్నమనవి. నేనూ శాయశక్తులా ప్రయత్నించాను. కాని నాకు చదువు అబ్బలేదు" - అన్నది సిసీ భయచకిత కంఠస్వరంతో.

'అవును. ఆవిషయం నేనుకూడా గమనించక పోలేదు నీవు నీ కష్టాన్నేమీ దాచుకోలేదు. శాయశక్తులా కృషిచేశావు. కాని భగవంతుని అనుగ్రహమేలేదు. నీ కృషిలోలోపమెన్నడానికి ఏమాత్రం వీలులేదు" - అన్నాడు గ్రిండ్.

'చిత్తం. కాని ఈ విషయంలో నేనుకూడా తమకు ఒక చిన్న మనవి చెయ్యదలిచాను. విజ్ఞానాన్నంతా ఒక్కమాటే మింగాలనుకోడం పొరబాటు. నేనూ ఈ పొరబాటే చేశాను. అందుచేత విజ్ఞానాన్ని జీర్ణించుకోలేక పోయాను. మెల్లమెల్లగా క్రమపద్ధతిలో విజ్ఞానాన్ని ఆర్జించడానికి నేను యత్నించి వున్నట్లవుతే నేను మరికొంత అభివృద్ధి చెంది ఉండేదాన్ని' - అన్నది సిసీ.

గ్రిండ్ మహాశయునికి సిసీ వ్యాఖ్యానం ఎంతమాత్రం రుచించలేదు. ఆయన తలపంకిస్తూ ఇలా అన్నాడు. 'నీవు చెప్పినమాట ఎంత మాత్రం సబబుగాలేదు సిసీ. ఎందుచేతనంటే నీవు మా విద్యాపద్ధతిలోనే లోపాన్ని ఎన్నుతున్నావు. కాని నీవు అనుకున్నట్లుగా మా విద్యాపద్ధతిలోపభూయిష్టమైనదికాదు. నీకు చదువు అబ్బకపోవడానికి కారణం చిన్ననాడు నీవు పెరిగిన పరిస్థితులేనని నా ఉద్దేశం. ఆ పరి

స్థితులు నీ మనస్సును సంకుచితం చేశాయి. నీలో పెంపొందవలసిన వివేచనా శక్తిని అణిచివేశాయి. నీవు చదువు ప్రారంభించడమే ఆలస్యంగా ప్రారంభించావు. ఇందుకు మనం విచారించి లాభంలేదుకూడా పరిస్థితుల ప్రభావానికి మనం చెయ్యగలిగింది ఏమున్నది ?" అన్నాడు గ్రిండ్.

'అవును. మీరన్నమాట నిజమే. అందుచేత నేనూ ఎంతో చింతిస్తూ వున్నాను, అనాథబాలికనైన నన్ను మీరు దగ్గరకుతీసి పెంచారు. నాపట్లఎంతో ఆదరాన్నీ దయనూ చూపారు. కాని మీకు ఋణాన్ని నేను తీర్చుకోలేక పోయాను' - అన్నది సిసీ. ఇలా అన్నప్పుడు సిసీ కండ్లవెంట కన్నీరు జలపాతంలా ప్రవహించసాగింది.

గ్రిండ్ మహాశయుని హృదయం కరిగింది. 'అమ్మాయీ ! సిసీ ! కంట తడిపెట్టకు. ఇందులో నీతప్పేమీలేదు. నీవు ఎంతో మంచిపిల్లవు. ఎంతో గుణవంతురాలవు, హృదయశుద్ధిగల వ్యక్తివి. నీవు చింతించవలసిన పనేమీలేదు' - అన్నాడు.

'చిత్తం' - అన్నది సిసీ వినమ్రంగా.

'నీవు మా ఆవిడకుకూడా ఇంటిపనులలో ఎంతో అక్కరకు వచ్చావు. లూసాకూడా నాతో ఈ విషయాన్ని చెప్పింది. లూసా చెప్పడం మాట అలాఉంచి - నేనూ గ్రహించాను. నీవు ఈ పనులు చక్కబెడుతూ ఉండడమే మంచిదని నా ఉద్దేశం' - అన్నాడు గ్రిండ్.

"చిత్తం. అలాగే చేస్తాను. నా జీవితంలో పెద్ద ఆశలేమీలేవు. ఒక్క...." - అంటూ ఏదో చెప్పబోయి ఇంతలో ఆగింది సిసీ.

"నాకు అర్థమైంది అమ్మాయీ - నీకు జీవితంలో ఫలించని ఆశ ఒక్కటే ఉన్నది - మీ నాన్న తిరిగిరావడం - అదేకదూ ?" - అన్నాడు గ్రాడ్‌గిండ్.

"చిత్తం" - అన్నది సిసీ.

"అవును. అమ్మాయి లూసా కూడా ఈ విషయాన్నినాతో అనేక పర్యాయాలు చెప్పింది. మీ నాన్నగారికోసం నీవు తైలం తెచ్చిన సీసా యింకా నీదగ్గరే ఉన్నదట. కాని నాది ఒక సలహా - జీవితంలో

మంచివీ చెడ్డవీ అనేక సంఘటనలు జరుగుతూ ఉంటాయి. దేనికోసం కావి మనం చింతించి లాభంలేదు" - అన్నాడు గ్రాడ్‌గింద్.

సిసీ అంటే గ్రాడ్‌గింద్ మహాశయునికి ఎంతో ప్రేమ, ఆదరమూ. అందుచేతనే సిసీవి ఒకచిన్న మాట అనాలన్నా ఆయన ఎంతో సంశ యిస్తాడు. ఆయన సహజంగా జీవితంలో ప్రతివిషయాన్ని లెక్క ప్రకారం తూచేవ్యక్తి. ఎలాటి క్లిష్ట సమస్య నైనా లెక్క తేల్చినట్టుగా తేల్చగల సమర్థుడు. కాని సిసీవిషయంలో ఆయన లెక్కల మనస్తత్వం ఎందుకూ అక్కరకు రాలేదు. ఈ లెక్కలన్నిటికి అతీతమైన ఏదో విచిత్రమైన విశేషం ఆయనకు సిసీలో కనుపించింది.

కొందరి విషయంలో కాలం మరింత తీవ్ర వేగంతో పరుగు తీసినట్టుగా అనిపిస్తుంది. థామస్, సిసీ ఇదే దశలో ఉన్నారు. కాలం వారిరువురిలోను ఎంతో వేగంగా మార్పులను తీసుకుని వచ్చింది. కాని గ్రాడ్‌గింద్ మహాశయునిలో మటుకు ఏవిధమైన మార్పూ కను పించడంలేదు. ఆయనమటుకు స్థిరంగా ఉన్నాడు.

ఇంత స్థిరమైన ఆయన జీవితంలోనూ ఒక చిన్నమార్పు జరి గింది. కోక్‌టౌను నగరవాసుల తరపున ఆయన పార్లమెంటు సభ్యు డుగా ఎన్నికైనాడు. కోక్‌టౌను నగరంలోని రకరకాల జనానికి ఆయన యిప్పుడు పార్లమెంటులో ఏకైక ప్రతినిధి.

లూసా జీవితం కూడా మామూలుగా జరిగి పోతూ ఉంది. ఆవిడ జీవితంలోనూ మార్పు లేమీలేవు. మెల్లగా చల్లగా ప్రవహించే పంటకాలవలాగ ఆవిడ జీవితం సాగిపోతూ ఉన్నది. ఆవిడకు వయస్సు రావడం తండ్రిగారు గమనించినప్పటినుంచి ఆమె ఇల్లుదాటి ఎక్కడికీ వెళ్ళడం లేదు.

మరో రోజున కూడా గ్రాడ్‌గింద్ లూసానుచూచి, "అమ్మా యికి వయస్సువచ్చింది" - అన్నాడు.

ఆనాటినుంచి ఎందుచేతనో కాని ఆయన మనస్సులో విచార భారం ఎక్కువకాసాగింది. ఆయన అహరహాలూ ఆవిషయాన్ని తర్కించే ఆలోచిస్తూ వున్నట్టుగా కనుపించసాగాడు.

ఇలా వుండగా ఒకనాటి రాత్రి ఆయన పనిమీద ఇల్లు విడిచి ఎక్కడికో వెళ్ళవలసివచ్చింది. లూసా తండ్రిని సాగనంపడానికి వాకిటి దాగా వెళ్ళింది. అప్పుడు గ్రాడ్‌గిండ్ ఏదోపనిమీద ఎక్కడికో వెడుతూ ఉన్నాడని ఎంతో ప్రొద్దుపోయి కాని ఇంటికి రాడని లూసాకు తెలుసు. వాకిటవరకూతనను సాగనంప వచ్చిన కుమార్తెవద్ద సెలవు గైకొంటూ గ్రాడ్‌గిండ్ ఎంతో ఆదరంతో ఆ అమ్మాయిని కౌగిలించు కుని శిరస్సుపై ముద్దాడి అమ్మాయీ! నీవిషయం నాకెంతో బెంగగా ఉన్నది. నీవు పెరిగి పెద్దపిల్లవైనావు' - అన్నాడు.

లూసా లజ్జావనత వదనయై, 'అవును నాన్నగారూ' - అన్నది.

'అమ్మాయ్, నీతో ప్రత్యేకంగా నేనొక విషయాన్ని మాట్లాడ వలసి వున్నది. రేపు భోజనాలయ్యాక ఒక్కమాటు నన్ను నాగదిలో కలుసుకో' - అన్నాడు గ్రిండ్.

'అలాగే నాన్నగారూ' - అన్నది లూసా.

'అమ్మాయ్ లూసా, నీచేతులిలా చల్లగా ఉన్నవేమిటమ్మా? నీకు శరీరంలో స్వస్థతగా లేదా?' - అని అడిగాడు గ్రిండ్.

శరీరంలో అస్వస్థతగా లేదునాన్నగారూ. ఆరోగ్యంగానే వున్నది' - అన్నది లూసా.

'మనస్సు సంతోషకరంగానే వున్నదాఅమ్మా' - అని ఆప్యా యంగా ప్రశ్నించాడు గ్రిండ్.

'హాయిగానే వున్నాను నాన్నగారూ ఎప్పుడూ సుఖంగా వున్నట్లు గానే ఇప్పుడుకూడా సుఖంగా ఉన్నాను' - అన్నది లూసా.

'మంచిదమ్మా' - అని గ్రాడ్ గిండ్ ఒకమాటు కుమార్తె శిర స్సును అశీర్వాదపూర్వకంగా ముద్దాడి తన పనిమీద వెళ్ళిపోయాడు.

లూసా మళ్ళీ గదిలోకి వచ్చింది. కుర్చీలో కూచుని చెక్కిలికి చెయ్యి చేర్చి ఆలోచించసాగింది. ఒక మూలన పొయ్యి మండుతూ ఉన్నది. లూసా భగభగమని రగులుతూవున్న నిప్పురవ్వలవంక చూస్తూ కూచున్నది. ఒకక్షణంలో మండిన నిప్పురవ్వలు మరుక్షణంలో ఆరి బూడిదిగా మారుతున్నది.

'లూసా !' - అని పిలుస్తూ థామస్ తలుపు తెరుచుకుని లోనికి వచ్చాడు.

ఇప్పుడు థామస్‌లో ఎంతో మార్పు కనుపిస్తూ వున్నది. మనిషి చూపులకు బెత్తంలా అగుపిస్తున్నాడు.

'రారా అన్నాయ్ ! ఎన్నాళ్ళకు కనుపించావురా ! ఇటీవల అసలు కనుపించడమే మానేశావేం ?' - అన్నది లూసా.

'అసలు తీరికే చిక్కడంలేదు లూసా. సాయంత్రాల పూట ఏదో పనిమీద వెళుతున్నాను. పగలంతా బొందర్‌బై గారితో గడిచి పోతూవున్నది. సరేకాని - నాన్నగారు నీతో ప్రత్యేకంగా మాట్లాడుతా నన్నారు. మాట్లాడారా ? - అని ప్రశ్నించాడు థామస్.

"ఇంకా మాట్లాడలేదు టాం. రేపు మాట్లాడుతానని అన్నారు"- అన్నది లూసా.

"అలాగా. ఇవాళ నాన్నగారు ఎక్కడికి వెళ్ళారు ?" - అని అడిగాడు థామస్.

"ఎక్కడికో వెళ్ళాడో నాకు తెలీదు" - అన్నది లూసా.

"నాన్నగారు ఎక్కడికి వెళ్ళారో నాకు తెలుసు. బొందర్‌బై గారి ఇంటికి వెళ్ళారు. స్వార్సిత్ ను గురించి ఇరువురూ వాదోపవాదాలు సాగిస్తూ ఉంటారు" - అన్నాడు థామస్. లూసా పరధ్యానంగాఉన్నది పొయ్యిలో రగులుతున్న నివ్వు రవ్వలవంకచూస్తూ ఉన్నది.

"లూసా - నేనంటే నీకు ఏంతో ఇష్టంకదూ ? - అని అడిగాడు థామస్.

"నిజమే టాం - నీవంటే నాకెంతో ఇష్టం. నీవు ఎప్పుడూ నాకు కనుపించకపోయినా నీవంటే నాకు ఇష్టమే" - అన్నది లూసా.

'అవును లూసా. మన శరీరాలు వేరైనా మన మనస్సు లొకటే'- అన్నాడు థామస్.

లూసా యీ మాటలు సరిగా వినిపించుకోలేదు, ఆవిడ ముఖం గంభీరంగా వున్నది. ఏదో తీవ్రమైన అలోచనా ముద్ర ఆవిడ ముఖంపై స్పష్టంగా కనుపిస్తూ వున్నది.

ఆవిడ ముఖంలోని గంభీరత థామస్‌ను చకితుణ్ణి చేసింది.

'లూసా - జరుగుతున్న విషయాలను సూచనప్రాయంగా నీతో మాట్లాడాలని వచ్చాను. అంతే. నీవు నా అభిప్రాయాన్ని గ్రహించే వుంటావని అనుకుంటాను. ఇక మరి వెళ్ళివస్తాను' అన్నాడు థామస్.

'అవును టాం. నా కన్నీ తెలుసు' - అన్నది లూసా.

టాం లూసావద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. లూసా ఎంతో ఆదరంగా అతన్ని వాకిటిదాకా వచ్చి సాగనంపింది. అతను వెళ్ళిపోయిన తరువాత లూసా కాస్సేపు వాకిటివద్దే నిల్చున్నది. అక్కడ నిల్చుని చూస్తే కోక్‌టౌన్ నగరంలోని దీపాల వరుసలన్నీ కనుపిస్తాయి. ఆ దీపాల వరుసలను అవలోకిస్తూ అక్కడే నిశ్చలప్రతిమలా నిల్చున్నది లూసా.

వెళ్ళిపోతూవున్న థామస్ అడుగుల చప్పుడును ఆవిడ వింటూ నిల్చున్నది. క్రమక్రమంగా ఆ అడుగుల చప్పుడు సన్నగిలి పోయింది.

లూసామటుకు అక్కడే నిల్చుని ఉన్నది. కోక్‌టౌన్ నగరం యావత్తూ నిద్రిస్తున్నది. వాతావరణం ప్రశాంతంగా ఉన్నది. లూసా వాకిటివద్దనే నిల్చుని ఆలోచించ సాగింది.

కాలం చాలా చిత్రమైంది. కాలం ఒకపెద్ద మగ్గంలాంటిది. తన హృదయంలో కాలం ఎన్నో చిత్రచిత్రాలైన దారాలను అల్లింది. ఇకముందు ఎలాటి దారాలను అల్లనున్నదో అని ఆశ్చర్యపోతూ నిల్చున్నది లూసా.

కాని ఈ కాలమనే మగ్గం జీవితాలను అల్లుతూ ఉన్నప్పుడు ఎలాటిశబ్దమూ వినిపించదు. అదృశ్యహస్తాలతో నిశ్శబ్దంగా జీవితాలను అల్లుతుంది.

# 15

గ్రాడ్ గ్రిండ్ మహాశయుని పఠన మందిరాన్ని (ఆయన ఆలోచనా మందిరం కూడా అదే) ఎవరైనా చూచినప్పుడు వారికి

చటుక్కున నీలాకాశం జ్ఞాపకం వస్తుంది. ఆయన పఠన మందిరం లోని గ్రంథాలన్నీ నీలిరంగు అట్టలున్న గ్రంథాలే.

ఈ పఠన మందిరంలో ఆసీనుడై గ్రాడ్ గింద్ మహాశయుడు జీవితానికి సంబంధించిన ఎంతటి విషమ సమస్యనైనా యిట్టే పరిష్కరించివేస్తూ వుంటాడు. సిద్ధాంత రాద్ధాంతాలు, వాదోపవాదాలు, తర్కవితర్కాలు - అన్నీ యీ పఠన మందిరంలోనే జరుగుతూ వుంటాయి: ఎంతటి గడ్డుసమస్యనైనా ఛేదించి భేదించి పరిష్కరించే స్థలం కూడా అదే.

ఖగోళ పరిశీలనా మందిరానికి కిటికీలు లేనట్లుగానే యీ మందిరానికి కూడా కిటికీలు లేవు.

ఖగోళ శాస్త్రజ్ఞుడు తన పరిశీలనా మందిరంలో కూచుని పలకపై లెక్కలువేసి గ్రహగతులను తేల్చివేసినట్టుగా, గ్రాడ్ గింద్ మహాశయుడు యీ పఠనమందిరంలో కూచుని మానవుల కష్ట సుఖాల తాలూకు చిక్కు సమస్యలన్నీ ఎంతో సులభంగా సూత్రప్రాయంగా పరిష్కరిస్తూ వుంటాడు. సుఖ దుఃఖాలను ఒక్క తుడుపుతో చెరిపివేస్తూ ఉంటాడు.

అసలే భూతమందిరంలా అగుపించే ఆ పఠనమందిరంలో భూతంలాంటి ఒక గడియారంకూడా ఉన్నది. తాతల కాలంనాటి ఆ గడియారం "టిక్ టిక్" మని కొట్టుకుంటూ వుంటే ఒక అదృశ్యశక్తి మనల్ని అనుక్షణం ప్రశ్నిస్తున్నట్టుగా వుంటుంది.

అలాటి పఠనమందిరంలో - ఆ వుదయాన - నిర్ణీత కార్యక్రమాన్ని అనుసరించి లూసా అడుగుపెట్టింది. గదిలోకివచ్చి తండ్రిగారి బల్లప్రక్కనే కూచున్నది. కిటికిలోగుండా కనుపిస్తున్న నగర దృశ్యాన్ని పరధ్యానంగా అవలోకించ సాగింది.

అలా తన ప్రక్కనే మౌనంగా కూచున్న కుమార్తెతో గ్రింద్ మహాశయుడు మెల్లిగా ఇలా చెప్పసాగాడు; "అమ్మాయ్! నీతో ఒక ప్రత్యేక విషయాన్ని మాట్లాడవలెనని గతరాత్రి నీతో చెప్పాను. ఇప్పుడు అందుకనే నిన్ను పిలువనంపాను. నీవు అందరిపిల్లల లాంటి దానివి కాదు. నిన్ను నేను ఎంతో క్రమశిక్షణతో పెంచి పెద్దదాన్ని

చేశాను. చదువు చెప్పించాను. నీ మనస్సు పరిపక్వత చెందడానికి నేను ఎంతో కృషిచేశాను. నీమనస్సుకూడా ఎంతో పరిపక్వమైన మనస్సు. అర్థంలేని వుద్రేకాలకు నీవు లోనుకావన్న విషయం నాకు తెలుసు. సాధారణంగా నీ వయస్సుకు మించిన నిగ్రహాన్ని నీవు అలవరుచు కున్నావు. జీవితంలో ప్రతి అనుభవాన్ని నిర్దిష్టంగా అర్థం చేసుకోగల శక్తి నీకున్నది. అందుచేతనే ఇప్పుడు నేను నీతో చెప్పనున్న విషయాన్నికూడా నీవు సానుభూతి పూర్వకంగా అర్థం చేసుకోగలవని నేను ఆశిస్తూ ఉన్నాను".

తండ్రిగారు చెప్పిన మాటలన్నీ లూసా మౌనంగా విన్నది, ఆవిడ సమాధానం చెబుతుందేమోనని గ్రింద్ మహాశయుడు ఎదురు చూశాడు. కాని లూసా ఎంతకూ సమాధానం చెప్పకపోయేసరికి గ్రింద్ మహాశయుడు మళ్ళీ ఇలా ప్రారంభించాడు.

"అమ్మాయ్ లూసా! ఇప్పుడు నీతో నేను వివాహప్రస్తావన చెయ్యనున్నాను" - అన్నాడు గ్రింద్.

ఈ మాటుకూడా లూసా జవాబు చెప్పలేదు. గ్రింద్‌మహాశయునికి ఆశ్చర్యం కలిగింది. "ఏమిటమ్మాయ్ జవాబు చెప్పవు?" - అని అడిగినట్లుగా లూసావంక చూచాడు. లూసా ఆ చూపులోని భావాన్ని గ్రహించి, "చెప్పండినాన్నగారూ-నేను వింటూనేవున్నాను"- అన్నది.

ఈ మాటు గ్రాద్ గింద్ మహాశయుడు చిరునవ్వు నవ్వి, 'అమ్మాయ్ లూసా - నీవు యింత మనోనిగ్రహం కలిగినదానివని నేను ఎన్నడూ ఊహించలేదు. ఇలాటి సమయంలో నీవు నిశ్చలంగా, నిబ్బరంగా వుండగలగడం చూస్తే నాకు ఆశ్చర్యం కలుగుతూ ఉన్నది. ఇందుకు కారణం నీ మనోనిగ్రహమూ కావచ్చు. లేక నేను చెప్పనున్న విషయము యింతకుముందే నీకు తెలిసివుండడమైనా కావచ్చు' - అన్నాడు.

"మీనుంచి వినవలసినదంతా విన్నవరకు నేనేమీ చెప్పదలచుకో లేదు నాన్నగారూ" - అన్నది లూసా.

అంతటి మనోనిగ్రహం కలిగిన గ్రాద్ గింద్ మహాశయుడు కూడా యీ క్షణంలో కొంత తటపటాయించాడు. ఏమీ తోచక కాగి తాలను కోసే కత్తిని తీసుకుని చేతులతో అటూ యిటూ త్రిప్పసాగాడు. ఒకక్షణం ఆలోచించిన మీదట లూసాతో మళ్ళీ యిలా అన్నాడు :

"అమ్మాయ్, లూసా నీవు అన్నమాట ఎంతో సబబుగా వున్నది. నీతో నేను చెప్పదలిచిన విషయాన్ని యిప్పుడు చెబుతున్నాను. విను. బౌందర్బై మహాశయుడు నీ మంచి చెడ్డలను యింతకాలంనుంచి పరిశీలిస్తూ వున్నాడు. నీ సుగుణాలు. నీ ప్రవర్తన, నీ క్రమశిక్షణ, నీ శీల సంపన్నత ఆయనకు ఎంతో ఆనందాన్ని కలగచేశాయి. అందుకని ఆయనకు నిన్ను వివాహం చేసుకోవాలని వాంఛకలిగింది, ఈ విషయాన్ని నాతో తెలియచేశాడు, తన ఈప్సితాన్ని నీతో తెలియ చేసి, తన మనవిని సావకాశంగా పాటించవలసిందిగా నిన్ను అడగమని నన్ను అర్థించాడు"- .

లూసా స్తబ్ధురాలైంది. ఇరువురి మధ్య నిశ్శబ్దం బండపడినట్లుగా పడింది. గడియారం 'టిక్ టిక్' మంటున్న శబ్దం తప్ప మరే శబ్దమూ వినిపించడంలేదు.

"నాన్నగారూ - నేను బౌందర్బైని ప్రేమిస్తూ ఉన్నానని మీరు భావిస్తున్నారా ?" - అన్నది లూసా బరువుగా. లూసా యిలా ప్రశ్నిస్తుందని గ్రాద్ గింద్ మహాశయుడు భావించలేదు. అనూహ్యమైన యీ ప్రశ్నను లూసా అడిగేసరికి గ్రాద్గింద్ చకితుడైనాడు. "అవునమ్మా. ఆ విషయాన్ని నేను ఎలా చెప్పగలను ? అది నీకు సంబంధించిన విషయం" - అన్నాడు.

తరువాత ఒకక్షణం ఆగి లూసా మళ్ళీ యిలా అన్నది : 'నాన్న గారూ, బౌందర్బైని నేను ప్రేమించడం మీకు అభిమతమేనా '? - అని అడిగింది.

"అలా నేను అంటానుటమ్మా ?" - అన్నాడు గ్రాద్ గింద్.

లూసా మళ్ళీ ఇలా ప్రశ్నించింది; "నాన్నగారూ - బౌందర్బై నేను తనని ప్రేమించవలెనని కోరుతూ వున్నాడా ?" - అని.

"ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడం చాలా కష్టమైన పనితల్లీ" - అన్నాడు గ్రిండ్.

"ఇందులో కష్టమేముంది నాన్నగారూ ? అవుననో కాదనో జవాబు చెప్పకూడదా ?" - అన్నది లూసా.

"అవునమ్మా ఇది చాలాక్లిష్టమైన విషయం. బౌండర్‌బై ని నేను బాగా ఎరుగుదును. నీవూ బాగా ఎరుగుదువు. ఆయన సాధారణంగా తప్పటడుగువేసే వ్యక్తికాదు నీకు అన్యాయం చెయ్యడంకాని లేక తనకుతాను అన్యాయం చేసుకోడంకాని ఆయన వుద్దేశ్యం కాదు. పైగా ఆయన నిన్ను వివాహం చేసుకోవలెనని కోరడం ఒక వెర్రి మొర్రి ఊహకూడా కాదు. అందుచేత ఈ విషయంలో నీవు మరో విధంగా ప్రశ్నించి వుండవలసింది అమ్మాయీ" - అన్నాడు గ్రిండ్.

"నేను ఏ విధంగా ప్రశ్నించడం సబబని మీరు భావిస్తూవున్నారు నాన్నగారూ ?" - అడిగింది లూసా.

తరువాత గ్రాడ్ గ్రిండ్ మహాశయుడు కుమార్తెకు మెల్లగా యిలా ఉపదేశించసాగాడు :

"అమ్మాయీ ! నీవు యీ విషయాన్ని కూడా వాస్తవిక దృష్టితో అర్థంచేసుకోవాలని నా అభిమతం. నీవు నీ జీవితంలో ప్రతి విషయాన్నీ వాస్తవిక దృష్టితోనే అర్థం చేసుకుంటూ వచ్చావు. ఆ విధంగానే ఈ విషయాన్నికూడా అర్థంచేసుకుంటావని భావిస్తున్నాను. అజ్ఞానులు ఏ విషయాన్నయినా స్పష్టంగా అర్థం చేసుకోలేరు, లేనిపోని ఊహలకూ, భ్రాంతిజనితాలైన కల్పనలకూ తావిస్తారు. కాని నీవు అలాటి దానివి కావు. అందుచేత నీవు యీ విషయాన్ని స్పష్టంగా అర్థం చేసుకోగలవు. ముందు యీ సమస్యలో అంతర్గర్భితమైన ముఖ్య విషయాలను పరిశీలించి చూదాం. నీకు 20 సంవత్సరాల వయస్సు. బౌండర్‌బై మహాశయునికి 50 సంవత్సరాల వయస్సు. వయోరీత్యా మీ యిరువురికీ ఎంతో వ్యత్యాసం ఉన్నమాట నిజమే. కాని ధనరీత్యా కాని, సాంఘిక ప్రతిపత్తిరీత్యా కాని మీ యిరువురికీ వ్యత్యాసం ఏమాత్రం లేదు. వ్యత్యాసం లేకపోవడమేకాక యీ విషయాలలో మీ యిరువురికీ అతికినట్లుగా పొత్తుకూడా కలుస్తుంది, ఇహ వయస్సులో

వున్న ఒక్క వ్యత్యాసాన్ని పురస్కరించుకుని వివాహాన్ని అంగీకరించకపోవడం సమంజస మవునా కాదా అన్న విషయాన్ని మనం విచారించవలసి ఉన్నది. ఈ విషయాన్ని మనం విచారించేటప్పుడు యింతకు పూర్వం మనదేశంలో జరిగిన వివాహాలను మనం పరిశీలిద్దాం. మనదేశంలో యింతకుపూర్వం జరిగిన అనేక వివాహాలను మనం పరిశీలించినట్లవుతే యీ వివాహాలలో నూటికి 80 పాళ్ళు వివాహాలలో దంపతుల మధ్య ఎంతో వయో వ్యత్యాసం ఉన్నట్లు మనం గమనించగలం" - అన్నాడు గ్రాబ్ గించ్.

"ఇంతకూ మీ సలహా ఏమిటి నాన్నగారూ ?" - అని ప్రశ్నించింది లూసా.

తన తండ్రిగారు ఇంత దీర్ఘంగా ఉపన్యసించిన తరువాతకూడా లూసా తన గాంభీర్యాన్ని కోలుపోలేదు.

"అమ్మాయి లూసా - వున్నవిషయాన్ని వున్నట్లుగా చెబుతున్నాను. అందుచేత నీవు మరోవిధంగా భావించకు. ఇప్పుడు బౌందర్‌బై నిన్ను వివాహం చేసుకోమని కోరుతూ వున్నాడా లేదా అన్నది ప్రశ్నకాదు. బౌందర్‌బై నిన్ను వివాహం చేసుకోమని కోరుతూ వున్నాడు. అందులో సందేహమేమీ లేదు. ఇహ మనం పరిష్కరించుకోవలసిన సమస్య నీవు ఆయన్ను వివాహం చేసుకోడానికి సమ్మతిస్తూ వున్నావా లేదా అన్నది" - అన్నాడు గ్రింద్.

"అయితే, నన్ను బౌంధర్‌బైని వివాహం చేసుకోమని అంటారా నాన్నగారూ ?" - అని ప్రశ్నించింది లూసా.

"అవునమ్మా. నేను నీకిచ్చే సలహా అదే. నీవు బౌంధర్‌బైని వివాహ మాడడమే నా అభిప్రాయం. వివాహవిషయాన్ని నిశ్చయించుకోవడంలో సాధారణ యువతులకూ నీకూ కొంత తేడావున్నదని నేను భావిస్తున్నాను" - అన్నాడు గ్రింద్.

"మంచిది నాన్నగారూ" - అన్నది లూసా.

"ఇహ నీఇష్టం అమ్మాయీ. వున్నవిషయాలన్నీ నీకు చెప్పాను. పూర్వాపరాలను ఆలోచించుకుని ఒక నిశ్చయానికి వచ్చే బాధ్యత నీది"- అన్నాడు గ్రింద్.

ఈ సంభాషణ ప్రారంభించి నప్పటినుంచి, సంభాషణ ముగిసే వరకూ, లూసా తనతండ్రిగారివంక తదేకదృష్టితో చూస్తూకూచున్నది. అంతా చెప్పినతరువాత గ్రిండ్ మహాశయుడు కుర్చీలో వెనక్కి వ్రాలాడు. ఇప్పుడు ఆయనకుమార్తె లూసావంక నిశితంగా నిశ్చలంగా చూస్తూ ఉన్నాడు.

ఇంతసేపూ నిశ్చల గంభీరంగా ఉన్న లూసా ముఖంలో ఆయనకు యత్కించితే చలనలేశం కనుపించి వుండవచ్చు. ఆ అమ్మాయికీ తనకూ మధ్య ఉన్న కృత్రిమమైన అడ్డుగోడలన్నీ ఒక్కమాటుగా కూలిపోయి ఆ అమ్మాయి హఠాత్తుగా తనను కౌగిలించుకుని గుండె మీద శిరస్సును వాల్చి వెక్కి వెక్కి ఏడుస్తూ హృదయాంతరాలలోని రహస్యవేదన నంతటినీ తనముందు వెళ్ళబోసుకుంటుందని ఆయన ఊహించి ఉండవచ్చు. కాని నిజంగా గ్రాడ్ గిండ్ మహాశయుడు యింతటి ఆర్ద్రహృదయుడని మనం ఊహించడానికి అవకాశం లేదు. ఎందుచేతనంటే ఆయన అలా లూసా మనస్సులోని అంతర్వేదనను అర్థంచేసుకుని వుంటే, యింతకాలమూ ఆయన తనకూ, మానవతకూ మధ్యన కట్టుకున్న అడ్డుగోడలు ఒక్కక్షణంలో ఫెళ్ళున కూలిపోయి ఉండేవి. మానవతకూ తనకూ మధ్యన ఆయన కట్టుకున్న కృత్రిమమైన అడ్డుగోడలు సామాన్యమైనవి కావు. అవి ఎంతో ఎత్తైనవి. ఒక్కక్షణంలో ఆ అడ్డుగోడలను దాటడంకూడా అసాధ్యమైన పని.

ఇందువల్లనే గ్రిండ్ మహాశయుడు ఈ క్షణంలో లూసా మనోవేదనను అర్థంచేసుకునే అంచులకు వచ్చికూడా ఇంతలోనే తనను తాను నిగ్రహించుకుని తన గుండెను దిటవు చేసుకున్నాడు.

తండ్రిని కుమార్తెను ఏకంచేయవలసిన ఈ క్షణంకూడా గతంలో కలిసిపోయింది.

తరువాత చాలాసేపు లూసా కిటికీ ఊచల సందులలోనుంచి నగరదృశ్యాన్ని అవలోకిస్తూ నిశ్చల ప్రతిమలా కూచున్నది.

అలా మౌనంగా కూచున్న కుమార్తెతో గ్రిండ్ మహాశయుడు, "అమ్మాయ్ లూసా! నగరంలోని చిమ్నీగొట్టాలను సలహా అడుగుతూ వున్నావా?" అని అడిగాడు.

"చిమ్నీ గొట్టాలు సలహా యిస్తాయా నాన్నగారూ ? పగలంతా విసుగుపుట్టేలా పొగలు వెళ్ళగ్రక్కుతాయి. అంతే" - అని లూసా చటుక్కున తండ్రివైపు తిరిగి "కాని యీ చిమ్నీగొట్టాలే రాత్రివేళల విప్పురవ్వలను విరజిమ్ముతాయి నాన్నగారూ" - అన్నది లూసా,

"ఆ విషయం నాకు తెలుసునమ్మా. కాని యీ సందర్భంలో నీవు అన్నమాటకు ఎలా అన్వయించుకోవలెనో నాకు అవగతం కావడంలేదు" - అన్నాడు గ్రాడ్ గిండ్.

లూసా ఆ మాటను పట్టించుకోలేదు. ఒకక్షణం మౌనంగా వూరుకుని మళ్ళీ యిలా అన్నది : "నాన్నగారూ - నేను ఎప్పుడూ జీవితం బుద్బుదప్రాయమైనదని భావిస్తూవచ్చాను" - అన్నది.

మనుష్య జీవితంయొక్క తరళత్వాన్ని గురించి గ్రిండ్ మహాశయునికీ లూసాకూ అనేక పర్యాయాలు వాదప్రతివాదాలు జరిగాయి.

ఈ సమయంలోకూడా లూసా ఆ విషయాన్ని ప్రస్తావించేసరికి గ్రిండ్ ఆవిడ తన వాక్యాన్ని పూర్తిగావించక ముందే తను జోక్యం చేసుకుని, "జీవితం శాశ్వతమైనదని ఎవరూ అనరమ్మా. ఆమాట నిజమే. గాని ఇటీవల లెక్కలనుబట్టి ఆయుఃప్రమాణం పెరిగినట్లు తెలియవస్తున్నది. వివిధ భీమాకంపెనీల లెక్కలను పరిశీలిస్తే మనకు ఈ విషయమే స్పష్టమవుతుంది" - అన్నాడు.

నేను యితరుల జీవితాన్ని గురించి మాట్లాడడంలేదు నాన్నగారూ. నేను నా జీవితాన్ని గురించి మాత్రమే మాట్లాడుతూ వున్నాను" - అన్నది లూసా.

"కావచ్చు లూసా. కాని జీవితాలన్నిటికీ ఏ ధర్మాలు అన్వయిస్తాయో నీ జీవితానికి కూడా అవే ధర్మాలు అన్వయిస్తాయమ్మా" - అన్నాడు గ్రాడ్ గిండ్.

"పోనీండి నాన్నగారూ, కాని ఉన్నన్నాళ్ళూ నాకు చేతనైన పనిని చేదామని నా వాంఛ. నా ఈప్సితం యీడేరిన తరువాత బుడగలాంటి యీ బ్రతుకు పగిలిపోయినా నాకు చింతలేదు" - అన్నది లూసా.

గిండ్ మహాశయునికి లూసా అన్న కడపటి మాటలు అర్థం కాలేదు. "అంటే నీ ఉద్దేశం ఏమిటమ్మా ?" అని అడిగాడు.

"బౌందర్‌బై నన్ను తనను వివాహ మాడవలసిందని కోరారు. కాని 'బౌందర్‌బైని వివాహం చేసుకొనడం సబబవునా కాదా ?' - అని నన్ను నేను ప్రశ్నించుకోవలసిన అవసరం ఉన్నది' - అన్నది లూసా సూటిగా.

'అవునమ్మా. నిజమే' - అన్నాడు గ్రిండ్.

'సరే నాన్నగారూ. బౌందర్‌బై నన్ను భార్యగా భావించి నన్ను వివాహ మాడవలెనని కోరుతూఉన్నాడు కాబట్టి అందుకు నేను అంగీక రించానని ఆయనకు తెలియచేయండి. నేను అన్న మాటలు అక్షరాలా ఆయనకు తెలియచేయండి. ఆయన ఈ మాటలను యధాతధంగా వినా లని నా ఉద్దేశం' - అన్నది లూసా.

"మంచిదమ్మా, అలాగే చెబుతాను. ఇంతకూ వివాహ ముహూ ర్తాన్ని నిశ్చయించే విషయంలో నీ అభిప్రాయం ఏమిటి ?" - అని ప్రశ్నించాడు గ్రిండ్.

"వివాహ ముహూర్తాన్ని మీరు ఎప్పుడు ఏర్పాటు చేసినా నాకు ఒకటేనాన్నగారూ" - అన్నది లూసా.

గ్రిండ్ తనుకూచున్న కుర్చీని లూసా దగ్గరకు లాక్కొని ఆ అమ్మాయి చేతిని తనచేతిలోకి తీసుకుని, "అమ్మాయీ! ఇలా అడిగా నని మరోవిధంగా అనుకోకు. కాని నాకొకవిషయం చెప్పు - ఇంతకు పూర్వం వివాహమాడుతానని నీవు ఎవరితోనైనా మాట ఇచ్చివుండలేదు కదా !" - అని అడిగాడు.

అందుకు లూసా సన్నని చిరునవ్వు నవ్వి యిలా జవాబు చెప్పింది : "నాన్నగారూ - ఒకవేళ నేను అలా మాట యివ్వాలని అనుకున్నప్పటికీ - నాకు గడపదాటి వెళ్ళే అవకాశం ఎక్కడున్నది ? నేను యితరులను కలుసుకుని ఎలా మాట్లాడగలను ?"

"అవునమ్మా. ఆ విషయం తెలియక నేను నిన్ను యిలా అడగ లేదు. అడగవలసిన బాధ్యత వున్నది కాబట్టి అడిగాను" - అన్నాడు గ్రాద్ గ్రిండ్.

లూసా మెల్లని కంఠస్వరంతో యిలా చెప్పసాగింది :

"నాన్నగారూ - నా యీడు ఆడపిల్లలు సహజంగా ఎన్నో వరదాలను వాంఛిస్తారు. కాని ఆ వరదాలు నాకు ఎలా తెలుస్తాయి? ఆశలూ, ఆశయాలూ, అనురాగాలూ, అనుబంధాలూ ఎన్నో ఉంటాయి. కాని అవన్నీ నాకు దూరం. అవి చివురించే ప్రకృతి నాలో ఎన్నడో ఎండిపోయింది" - అన్నది లూసా.

ఈ మాటలను చెబుతూ ఉన్నప్పుడు లూసా తన పిడికిలిని గట్టిగా బిగించి - పిడికిలిలోఉన్న దుమ్మునో లేక మరేపదార్థాన్నో మెల్లగా వదులుతూ ఉన్నట్టుగా పిడికిలిని తెరవసాగింది. ఆవిడ :అను కునిచేసిన పనికాదిది. ఆవిడ మనోబాధకు చిహ్నం అది.

లూసా చెప్పిన మాటలు విన్నాక, 'అవునమ్మా, నిజమే' - అని మాత్రమే అనగలిగాడు.

లూసా అంతటితో ఆగలేదు. తన హృదయ వేదనను మళ్ళీ ఇలా విశదం చేయసాగింది.

'నాన్నగారూ - స్త్రీలకు సహజంగా మాతృహృదయం ఉంటుంది. పసిపిల్లల్ని ఎత్తుకోవాలని ఆడించాలని వారు ఉవ్విళ్ళూరుతూ ఉంటారు. కాని ఈకాస్త భాగ్యానికికూడా నేను నోచుకోలేదు. శిశు హృదయం అంటే ఏమిటో నాకు తెలీదు. అంతజాగ్రత్తతో పంజరంలో చిలుకను పెంచినట్లుగా మీరు నన్ను పెంచారు.'

ఈ మాటలుకూడా గ్రిండ్ మహాశయుని హృదయంలో ఎంత మాత్రం చలనం కలగచేయలేదు. పైగా తనను లూసా ప్రశంసిస్తూ ఉన్నదని ఆయన భావించాడు.

"నిజంతల్లీ. నిన్ను అంత జాగ్రత్తగా పెంచాను" - అన్నాడు.

కుమార్తెకు తనపట్లగల భక్తి ప్రపత్తులకు ఆవిడను మెచ్చు కుంటూ ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు.

"అమ్మాయ్! నీవు నీ వివాహ విషయంలో ఇంత సమంజస మైన నిశ్చయానికి వచ్చినందుకు నాకెంతో సంతోషంగా ఉన్నది. బౌండర్‌బై సామాన్యమైన వ్యక్తికాదు. ఎంతో బుద్ధిశాలి. మీ ఇరువు రికీ వయస్సులో తేడా ఉండవచ్చు. కాని నీవు మానసికంగా సాధించిన పరిపక్వతను బట్టి ఆలోపం కమ్ముకునిపోతుంది" - అన్నాడు గ్రిండ్.

తరువాత ఒకక్షణం ఆగి, "సరేకాని అమ్మాయ్ - ఇహ మీ అమ్మను చూదాంపద" - అన్నాడు.

ఇరువురూ మేడదిగి డ్రాయింగ్ రూమ్‌లోనికి వెళ్ళారు. శ్రీమతి గ్రిండ్ డ్రాయింగ్ రూమ్‌లో కూచుని ఉన్నది. ఆవిడ ప్రక్కనే సిసీ కూడా ఉన్నది.

డ్రాయింగ్ రూమ్‌లో అడుగుపెట్టగానే గ్రాడ్ గిండ్ మహాశయుడు భార్యతో యిలా అన్నాడు: "ఇప్పుడు నీవు మాట్లాడనున్నది ఎవరితోనో తెలుసా? మన అమ్మాయి లూసాతో కాదు. బౌందర్‌బై సతీమణితో మాట్లాడనున్నావు" - అన్నాడు.

భర్త యిలా అనేసరికి ఆవిద ముఖం చేటంత అయింది.

"ఆయితే అంతా ఖాయంచేసుకుని వచ్చారన్నమాట! నేను అనుకుంటూనేవున్నాను లెండి. అమ్మాయ్ లూసా - ఒకమాటు యిలా రామ్మా. ఏదీ నన్ను కౌగిలించుకుని ఒక్క ముద్దిచ్చి వెళ్ళు. నిమ్మళంగా కౌగిలించుకో తల్లీ. జబ్బు మనిషిని" - అన్నది శ్రీమతి గ్రాడ్ గిండ్.

గ్రాడ్ గిండ్ మహాశయుడు చిరునవ్వు నవ్వాడు.

చూశారండీ - అన్నీ బాగానే ఉన్నాయి కాని నాకు ఒకటే బెంగగా ఉన్నది. అతను యివాళో రేపో మనకు అల్లుడవుతాడు. అప్పుడు అతన్ని ఎలా పిలవాలీ అని ఆలోచిస్తూ వున్నాను. ఎంత తల బద్దలు కొట్టుకున్నా నాకు తట్టి చావడంలేదు" - అన్నది శ్రీమతి గ్రాడ్ గిండ్.

బౌందర్‌బైని వివాహం చేసుకోడానికి లూసా అంగీకరించిందని గ్రాడ్ గిండ్ చెప్పగానే పిడుగుపడ్డట్టు వున్నట్లుగా సిసీ తల త్రిప్పి లూసావైపు చూచింది. సిసీ ముఖంలో ఆశ్చర్యం, జాలి, దుఃఖం, సంశయం, అన్నీ ఒక్కమాటుగా మిళితమై కనుపించాయి. లూసా కూడా సిసీ మనోవేదనను సిసీ ముఖంవైపు చూడకుండానే అర్థం చేసుకోగలిగింది. ఆనాటినుంచి సిసీపట్ల లూసా వైఖరిలో మార్పు కనుపించసాగింది. లూసా సిసీకి దూరదూరంగా మసులుకోసాగింది.

# 16

ఈ శుభవార్త బౌందర్‌బై మహాశయుణ్ణి తారుమారు చేసింది. ఆయనకు ఇంచుమించుగా మతిపోయిందనే చెప్పవచ్చు. కాని ఐహికమైన ఒక బాధ్యత ఆయన్ను మళ్ళీ మామూలు పరిస్థితిలోకి తీసుకుని వచ్చింది.

ఈవార్తను శ్రీమతి స్పార్సిత్‌కు తెలియచెయ్యవలసిన అవసరం ఉన్నది. కాని ఈవార్తను ఆవిడకు ఏవిధంగా తెలియచేయాలో బౌందర్‌బైకి బోధపడలేదు. అందువల్ల కలిగే ఫలితాలనుకూడా ఆయన ఊహించలేకుండా ఉన్నాడు. ఈవార్త ఆవిడకు చెవిన పడిన వెంటనే ఏవిధమైన వైపరీత్యమైనా సంభవించవచ్చు. ఆవిడ వెంటనే మూటా ముల్లె కట్టుకుని తన అత్తగారింటికి వెళ్ళిపోవచ్చు. లేదా నేలమీద కూలబడి జుట్టురేపుకుని పెద్దపెట్టున ఏడుస్తూ అఘాయిత్యం చేయవచ్చు. అద్దాలు పగలుకొట్టవచ్చు. ఏమైనా చేయవచ్చు.

బౌందర్‌బై మహాశయుడు ఏ విషయాన్ని ఊహించలేకుండా ఉన్నాడు. కాని ఆవిడకు ఈ విషయాన్నిమటుకు చెప్పకతప్పదు. ఎలా చెప్పాలి అన్న విషయమే తోచడంలేదు. మొదట్లో ఒకలేఖ ద్వారా ఈ విషయాన్ని ఆవిడకు తెలిపితే సబబుగా ఉంటుందేమోనని అనుకున్నాడు బౌందర్‌బై. ఈ లేఖను వ్రాయడానికి ఒకవంద కాగితాలనైనా ఖరాబు చేసిఉంటాడు. చివరకు ఈ విషయాన్ని తెలపడానికి లేఖ సరియైన మార్గంకాదని, ఆఖరుకు ముఖతః చెప్పడానికి నిశ్చయించుకున్నాడు. ఆ సాయంకాలం ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు ఎందుకైనా మంచిదని దోవలో ఒక మందులదుకాణానికి వెళ్ళి ఘాటైన వాసనలుగల కొన్ని మందులను కొన్నాడు. 'ఒక్కవేళ ఈవార్త వినగానే శ్రీమతి స్పార్సిత్ మూర్ఛిల్లవచ్చు. అలాటి సందర్భాలలో ఆవిడకు వాసనచూపి ఆవిడను మేలుకొల్పడానికి మందులు ఎంతో అవసరం' - అనుకున్నాడు బౌందర్‌బై.

"మందుల దుకాణంలో మందులను కొనుక్కొని యింటికి వచ్చాడు బౌందర్‌బై. ఇంటి గడపలో అడుగు పెట్టగానే బౌండర్‌బై గుండె గబగబమని కొట్టుకోసాగించె. బౌందర్‌బై యింటికి వెళ్ళగానే శ్రీమతి స్వార్సిత్ ఆయన్ను ఆదరంతో ఆహ్వానించింది.

బౌందర్‌బై తన యథాస్థానంలో కూచుని ఆవిడతో యిలా సంభాషించసాగాదు :

"మీరు నాకు యింతకాలం ఎంతో చేదోడు వాదోడుగా ఉన్నారు. మీ సేవను నేను ఈ జన్మలో మరిచిపోలేను. మీ రుణం తీర్చుకోలేను"- అన్నాడు బౌందర్‌బై.

స్వార్సిత్ సతీమణి చిరునవ్వు నవ్వింది.

"మీరు నాపట్ల పక్షపాతంకొద్దీ అలా అంటున్నారు" - అన్నది.

"ఇప్పుడు మీకు నేను ఒక వార్త చెప్పనున్నాను. ఈ వార్త మీకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించవచ్చు" - అన్నాడు బౌందర్‌బై.

"ఏమిటండీ ఆ వార్త?" - అని ప్రశ్నించింది శ్రీమతి స్వార్సిత్.

ఒక పెద్ద అగ్నిపరీక్షను ఎదుర్కొనబోతూ ఉన్నట్లుగా తటపటా యించాడు బౌందర్‌బై.

"నేను గ్రాడ్ గింద్ మహాశయుని కుమార్తెను వివాహమాడ నున్నాను" - అన్నాడు బౌందర్‌బై.

"శుభం! వివాహ జీవితం మీకు సుఖప్రదంగా వుండాలని కోరుతూ నేను భగవంతుణ్ణి ప్రార్థిస్తూవున్నాను" - అన్నది శ్రీమతి స్వార్సిల్.

శ్రీమతి స్వార్సిత్ ఈవార్త వినినవెంటనే మూర్ఛిల్లుతుందని ఊహించిన బౌందర్‌బై మహాశయునికి. ఆవిడ ఇంత నిమ్మళంగా నిబ్బరంగా ఆ వార్తను స్వీకరించేసరికి ఆశాభంగం కలిగింది. ఒక క్షణం ఆయన నివ్వెరపోయాడు. తరువాత తననుతాను నిమ్మళించుకుని ఇలా అన్నాడు.

"ఇలాటి సమయాలలో మీవంటి శ్రేయోభిలాషులు కూడా ఇక్కడేఉండి నా మంచిచెడ్డలను చూస్తూ ఉండడం నా అభిమతం" - అన్నాడు బౌందర్‌బై.

అందుకు శ్రీమతి స్వార్సిత్ సతీమణి వెంటనే సమాధానం చెప్ప లేదు. ముందు చిరునవ్వు నవ్వి ఊరుకున్నది. కొంతసేపు ఆగిన తరు వాత ఆవిడ ఇలా చెప్పసాగింది:

"మహాశయా ! మీరు నాపట్ల ఎంతో ఆదరంతో ప్రవర్తించారు. ఆ విషయాన్ని ఎవరూ కాదనలేరు. అందుకు నేను మీకు ఎంతో రుణ పడి ఉన్నానుకూడా. నేను నా జీవితంలో కోరేదొక్కటే, గింద్ మహా శయుని కుమార్తె మీ మనస్సును ఎరిగి సంచరించుకోవాలని ఆశి స్తున్నాను" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

వివాహ ముహూర్తం దగ్గరికి వచ్చింది. 8 వారాలలో వివాహం జరపడానికి పెద్దలు నిశ్చయించారు. బౌందర్‌బై మహాశయుడు ప్రతి నిత్యం సాయంత్రం గ్రింద్ మహాశయుని గృహానికి వెడుతూవున్నాడు. కాబోయే తన అత్తమామలతోను, లూసాతోను పిచ్చాపాటీ మాట్లాడి ఇంటికి తిరిగివస్తూ ఉన్నాడు.

వివాహ యత్నాలు చురుకుగా సాగుతూవున్నాయి. దుస్తులు కుట్టటానికి దర్జీలను ఏర్పాటు చేశారు. నగలు చేయించారు. పిండి వంటకాలను సిద్ధపరిచారు, గ్రింద్ మహాశయుడు ఏవిషయంలోకాని చిన్న పొరబాటునైనా సహించేవ్యక్తి కాడు, అందుచేత ప్రతి చిన్న విషయానికీ తాను స్వయంగా ఆధ్వర్యాన్ని వహించాడు.

8 వారాలూ గడిచాయి. పెండ్లిరోజు వచ్చింది. పెండ్లిజరిగింది. పార్లమెంటుసభ్యుడు గ్రింద్ మహాశయుని కుమార్తె లూసాకు బౌందర్ బైకి వివాహం జరిగింది. చర్చిలో వివాహ ప్రమాణాదిక కార్యకలా పాలు ముగిసినవెనక నూతనదంపతులిరువురూ విందుకు "శిలాల యా"నికి వచ్చారు.

ఈ శుభముహూర్తంలో నూతన దంపతులను ఆశీర్వదించడానికి గ్రాద్ గింద్ మహాశయుని బంధువులూ, మిత్రులూ చాలామంది వచ్చారు.

విందు కమ్మనిపండుగగా జరిగింది. విందు ముగిసిన వెనుక పెండ్లికొడుకు అతిధులతో యీ క్రింది విధంగా ప్రసంగించాడు :

"మహాశయులారా! నా పేరు బౌందర్‌బై. నివాస స్థలం కోక్ టౌన్ నగరం. మీరు మా వివాహానికి విచ్చేసి మా దంపతులను ఆశీర్వదించినందులకు మీ అందరికీ నా కృతజ్ఞతను తెలియజేస్తున్నాను.

మీ రందరూ నన్ను ఎరుగుదురు. నా మనస్తత్వం ఎలాటిదో మీకు తెలుసు. నేను జీవితంలో అనుసరించే సూత్రాలుకూడా మీరు ఎరిగినవే. పిల్లిని పిల్లిగానే భావిస్తాను నేను. ఎలుకను ఎలుకగానే భావిస్తాను. పిల్లిని చూచి ఎలుక అని, ఎలుకను చూచి పిల్లి అని భ్రాంతిచెందే వ్యక్తులు కూడా వుంటారు. కాని నేను అలాటి వ్యక్తిని కాను. గ్రాడ్ గ్రింద్ మహాశయుడు నాకు మామగారు కావడమే కాక ఆప్తమిత్రుడు కూడా. ఆయన్నుకూడా మీరు ఎరిగివున్నారు. ఆయన పార్లమెంటు సభ్యుడు. ఆయన మీ అందరికీ చెందిన వ్యక్తి. మీ బాధ్యతలన్నీ ఆయన బాధ్యతలే. కాని నేనుమటుకు కొంతవరకు స్వతంత్రుణ్ణి నా జీవితానికీ, ఆయన జీవితానికీ కొంత వ్యత్యాసం వున్నది.

నా గతజీవితాన్ని నేను తలుచుకున్నప్పుడు గ్రింద్ మహాశయుని కుమార్తెను పెండ్లాడే ఉచ్చదశకు నేను రాగలనని నేను ఎన్నడూ ఊహించలేకపోయాను. కాని భగవంతుని అనుగ్రహంవల్ల గ్రింద్ మహాశయునికి అల్లుణ్ణయ్యే భాగ్యం నాకు కలిగింది. లూసా అన్ని విధాల నాకు తగిన ఇల్లాలని నేను భావిస్తున్నాను. లూసాను నేను చిన్నతనంనుంచి ఎరిగి ఉన్నాను. లూసా గుణగణాలు నాకు తెలుసు. లూసాను ఇల్లాలినిగా చేసుకోవలెనని నేను ఎన్నాళ్ళనుంచో కలలు కన్నాను. నాకల ఈనాటికి ఫలించింది. మరోవిషయం నిర్మొహమాటంగా ఈ మాటనుకూడా చెప్పవలసి వచ్చినందుకు నన్ను క్షమించండి. నేనుకూడా లూసాకు అన్నివిధాలా తగిన భర్తననే నేను భావిస్తున్నాను. మీకందరూ దయతో మా వివాహ మహోత్సవానికి విచ్చేసి మమ్ము ఆనందపరిచినందుకు మీకు నా కృతజ్ఞతాభివందనాలను తెలియచేస్తున్నాను."

బౌందర్‌బై మహాశయుడు పైవిధంగా తన మహోపన్యాసాన్ని ముగించాడు.

ఆ తరువాత నూతనదంపతు లిరువురూ, వివాహానంతరం కొన్నాళ్ళు కులాసా కాలక్షేపం చెయ్యడంకొరకు లాయిక్స్‌కు బయలు దేరి వెళ్ళారు. పెండ్లికుమార్తె ప్రయాణానికి ముస్తాబుచేసుకుని మేడ మెట్లు దిగివస్తూఉండగా థామస్ కనుపించాడు.

"నీవు ఇంత నిండైన అమ్మాయివని అనుకోలేదుచెల్లీ" - అన్నాడు థామస్.

థామస్‌ను లూసా ఆదరంతో కౌగిలించుకున్నది. ఆవిడ మనస్సు ప్రేమార్ద్రమైంది. "ఇక వెళ్ళివస్తాను టామ్" - అని కన్నీటితో సెలవు తీసుకున్నది.

# 17

వేసవి.

ఎండ పెళ పెళ కాస్తోంది.

కోక్ టౌన్ నగరానికి కూడా యిలాటి రోజును - ఏ ఏడాదికో, రెండేళ్ళకో ఒకమాటు - కాలదేవత అనుగ్రహిస్తూ వుంటుంది.

ఇంత చక్కని ఎండ తెల్లనిపాలు ఒలకబోసినట్లుగా పెళ పెళ కాస్తున్నా - దూరంనుంచి చూచినప్పుడు కోక్ టౌన్ నగరం స్పష్టంగా కనుపించడంలేదు. స్వచ్ఛమైన సూర్యకిరణాల ప్రభావానికి కోక్ టౌన్ నగరంలో మాత్రం ఏమీ చలనం కలగలేదు. మంచు ముసుగుచాటున ఉందీ లేనట్టుగా కనుపిస్తూవున్న నగరం.

దూరంనుంచి చూచినప్పుడు ఒక నల్లనిమచ్చ కనుపించి - అక్కడ ఏ ఊరో నాడో లేకపోతే ఈమచ్చ ఎందుకుండాలీ అనుకుని - అక్కడ తప్పకుండా ఒకఊరు ఉండితీరాలని మనం ఊహించుకోవల సిందేకాని - అంతకుమించి అక్కడ నగరం ఉన్నది అనడానికి ఆధారాలేమి కనుపించవు.

మచ్చకు ఒక్కొగాఒక్క ఇటుకగోడ అయినా కంటికి కనుపించక పోయినా - ఫ్యాక్టరీ గొట్టాలనుంచి దీర్ఘకాలసర్పంలా వెలువడిన పొగ

అటూ ఇటూ మెలికలు తిరుగుతూ గగన మార్గంలోని దూసుకునివెళ అక్కడనుంచి చెట్టులా ఫెళ్ళున విరుచుకపడి మళ్ళీ పృథ్వీమార్గ పట్టడంవల్లను, వుండివుండి నల్లని మబ్బులవలె ఏర్పడడంవల్లను అక్కడ కోక్‌టౌన్ అనే పేరుగల ఒక నగరం వున్నదని పోల్చుక గలం.

ఇంతకూ - అసలు విచిత్రమైన విషయ మేమిటంటే ఎన్ని అఘాతాలు తగిలినా చలించకుండా కోక్‌టౌన్ మహానగరం అక్కడ నిశ్చలంగా నిలిచి ఉన్నది.

ఇన్ని ఆఘాతాలు తగిలినప్పటికి ఆ నగరం అక్కడే అల ఎలా నిశ్చలంగా నిలిచి ఉండగలిగిందీ అన్నదే ఆశ్చర్యకరమై విషయం.

కోక్‌టౌన్ నగరంలోని గోడలంత అవిటి గోడలు మరే న రంలో ఇండ్లకూ ఉండవు. తాకితే చాలు - పడిపోయేటట్టుగా ఉంటాయి గోడలు. ఈ గోడలను అనేక సందర్భాలలో పడగొట్టి తిరిగి కట్టవలసి అవసరం ఏర్పడింది. ఏమైనా కోక్‌టౌన్ పురజనులు జన్మభూమి పట్ల ఎంతో భక్తి గలవారు అందుచేత వారు కోక్‌టౌన్ నగరానికి ఎన్ని అఘాతాలు తగిలినప్పటికి వారు తమ పుట్టినింటిని వదిలి వలస వెళ్ళ డానికి సమ్మతించలేదు. పడిపోయిన గోడలను తిరిగి కట్టారు. నగ రాన్ని పెంచి విశాలం చేశారు. వారి కృషి ఫలితంగా నగరం నానాటికీ పెరిగి దశదిశలా ఆక్రమించేటంత పెద్దదిగా తయారైంది. వేసవిలో పురవీధులు దుమ్ముతో నిండిఉంటాయి. పైగా ఇరుకు వీధులు కావడం వల్ల ఊపిరి సలపదు. ఫాక్టరీలలో పనిచేసే కూలీలు పని ముగించుకున్న తరువాత బైటికివచ్చి మెట్లమీద కూచుని ముఖాలపై చెమటను మసి పట్టిన చేరుమాళ్ళతో తుడుచుకుంటూ ఉన్నదృశ్యం మనకు కనుపిస్తుంది.

వేసవిలో మరీని - నగరం యావత్తూ పెనంపై రొట్టె కాల్చినట్టు కాలుతూ వుంటుంది. ఏ వీధిలో నడుస్తూవున్నప్పటికి ఘాటైన మర నూనె వాసన ముక్కులకు సోకుతుంది. ఆవిరి యంత్రాలు - ఫాక్టరీ కార్మికుల చేతులు - ఫాక్టరీలలో అనేక అంతస్తులు - ఊరు ఊరంతా ఈ మరనూనెలో మునిగి తేలుతూ ఉన్నదా అని అనిపిస్తుంది. వేసవి

వాతావరణం యిలా వున్నప్పటికి కోక్‌టౌన్ నగరంలోని కార్మికులపై ఈ ఋతువుల ప్రభావం ఏమాత్రం పనిచేసినట్లు కనుపించదు.

అది వేసవికావచ్చు - చలికాలం కావచ్చు - ఫ్యాక్టరీ కార్మికులు మటుకు నీడల్లాగ తలలు వంచుకుని తమ కార్యభారాన్ని నిర్వహిస్తూనే ఉంటారు. ఫాక్టరీలకుకూడా ఏకాలంలోనూ విశ్రాంతి అన్నదిఉండదు. అవి అహోరహాలు అవిరామంగా మానవశక్తిని కబళిస్తూనే ఉంటాయి.

వేసవిలో ఫాక్టరీల ప్రక్కగా వెడుతూవున్నప్పుడు జోలపాట వినిపించినట్లుగా ఫాక్టరీ మరచక్రాల చప్పుడు వినిపిస్తుంది.

నగరంలో ముఖ్యమైన వీధులనుమటుకు నీళ్ళుచల్లి తడుపుతారు. దుకాణాలలో వట్టివ్రేళ్ళ తడికలు దింపుతారు.

అందుచేత అక్కడమటుకు కొంచెం శీతలంగా ఉంటుందికాని ఫాక్టరీలు వుండే పేట మాత్రం అగ్నిగుండలా జ్వలిస్తూవుంటుంది. నగరానికి ఆనుకుని ప్రవహిస్తున్న నదిలో సాయంత్ర సమయంలో నగరంలో కుర్రవాళ్ళు కొందరు ఒక చిన్న పడవను నడుపుతారు. వారు తెడ్లతో నది నీటిని కదిలించినప్పుడల్లా ఆ నది నీటిలోనుంచి కూడా ఫాక్టరీ మరనూనె వాసనే బయలుదేరేది.

ఇలాటి వాతావరణంలో ఒకనాటి మధ్యాహ్నం శ్రీమతి స్పార్సిత్ టాంకులో కూచునివున్నది. ఆఫీసు పనిగంటలు అయిపోయ్యాయి. ఆవిడ తన ప్రత్యేకమైన గదిలో కూచుని బౌండర్‌బై మహాశయుని రాకకొరకు ఎదురుచూస్తూ వున్నది.

టాంకు భవనంకూడా వేసవి ఎండకు నలసల కాగిపోతూ ఉన్నది. ఎర్రని ఇటుకలతో కట్టిన భవనం అది. బౌండర్‌బై గృహంకంటె కొంచెం పెద్దది.

బౌండర్‌బై మహాశయునికి వివాహం జరిగి ఇప్పటికి ఒకసంవత్సరం గడవ వస్తున్నది.

సాయంసమయంలో సంధ్యారుణ కాంతులలో మిలమిలలాడుతూ తాను బాంకుభవనంలో ప్రవేశించినప్పుడు తన వింతసోయగాన్ని చూచి అక్కడున్నవారందరూ మంత్రముగ్ధులు కాగలరన్న విషయం శ్రీమతి స్పార్సిత్‌కు తెలియనిదికాదు. ఆవిడ అలాఅలా గాలిలో తేలిపోతూ

ఉన్నట్టు నడుస్తూ రాణీవలె బ్యాంకు భవనంలో ప్రవేశించి ఒక మూల నున్న కిటికీవద్ద కూచుని చేరుమాలు అల్లుకుంటూ ఉంటే - అది ఒక బ్యాంకు భవనమనీ ఆఫీసు అనీ అనిపించేదేకాదు. అక్కడి వాతావరణ మంతా క్షణంలో మారిపోయేది. వీధివెంట వచ్చిపోయేవారు కిటికీలో నుంచి కనుపిస్తున్న ఆవిడ స్వర్గసౌందర్యాన్ని చూచి అచ్చెరువు చెందుతూ ఉండేవారు. వారికి మరో విషయం కూడా తెలుసు. ఆవిడ ఆ ఖజానాలోని ధన ఆభరణాదికాలను కాపలా కాస్తున్నదనే విషయంకూడా వారికి తెలుసు.

ఆ ఖజానాలో బంగారం ఉంది. వెండి నాణేలు ఉన్నాయి. మరెన్నో రహస్య పత్రాలుకూడా ఉన్నాయి. వీటిలో ఏ ఒక్కటి కను పించకపోయినా ప్రాణాలపైకి వస్తుందనే విషయం శ్రీమతి స్వార్సిత్‌కు తెలుసును. బౌందర్‌బై మహాశయుడు వీటిని ఒక ఇనప తలుపుల గదిలో భద్రంగా దాచాడు. ఆ గదిని ఎప్పుడూ మూడు బరువైన తాళాలు కాపాడుతూ ఉంటాయి. ఒక కాపలావాడు ప్రతిరాత్రి గది గడపలో తలవాల్చి నిద్రిస్తూ వాటిని భద్రంగా కాపాడుతూ ఉంటాడు. వీటిని మాత్రమేకాక గదిలోఉండే పేపర్లు. సిరాసీసాలు మొదలైన సామగ్రిని కూడా శ్రీమతి స్వార్సిత్ తాను స్వయంగా కాపాడుతూ ఉంటుంది.

ఈ ఖజానాను కాపాడే బాధ్యతలో శ్రీమతి స్వార్సిత్‌కు మరొక స్త్రీ కూడా సాయపడుతూ వుంటుంది. ఆ స్త్రీ చెవిటిది. అంతేకాకుండా ఆ స్త్రీ శ్రీమంతురాలని కూడా ఒక వినికిడి వున్నది. ఆ స్త్రీ కొందరు అప్పులవాళ్ళను మోసగించిందని, ఆవిడను హత్య చెయ్యడానికి కోక్ టౌన్‌లో కొందరు యత్నించి విఫలులయ్యారనీ కొందరు చెబుతూ వుంటారు.

ఆనాటి సాయంత్రం శ్రీమతి స్వార్సిత్ అలా ఖజానాను అజమాయిషీ చేస్తూ కిటికీవద్ద కూచుని వున్నప్పుడు, ఖజానా కాపలా దారైన సేవకుడు టీ తీసుకునివచ్చి ఆవిడ ముందున్న బల్లపై ఉంచాడు.

"మంచిది. టీ రుచికరంగా తయారు చేశావనుకుంటాను" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

"చిత్తం, అమ్మగారూ" - అన్నాడు సేవకుడు. సేవకుడు పొట్టిగా ఉంటాడు. అతను నడుస్తుంటే బంతి ఎగురుతున్నట్లుగా ఉంటుంది.

"ఖజానా తాళాలన్నీ సరిగా వేసిసట్లేనా ?" - అని అడిగింది శ్రీమతి స్వార్సిత్.

"చిత్తం" - అన్నాడు సేవకుడు.

ఒకక్షణం ఆగి ఒక గుక్కెడు టీ చప్పరిస్తూ శ్రీమతి స్వార్సిత్ మళ్ళీ ఇలా ప్రశ్నించింది.

"సరే కాని - ఈరోజు విశేషాలేమిటి ?" -

"ఈరోజు కొత్తవిశేషాలేమీ లేవమ్మగారూ - కాని మనవా ళ్ళున్నారు చూచారూ - ఎందుకూ పనికిరాని వెధవలండి" - అన్నాడు సేవకుడు.

"వాళ్ళు ఏం చేస్తున్నారేమిటి ?" - అని ప్రశ్నించింది శ్రీమతి స్వార్సిత్.

"పూర్వం వలెనే హంగామా చేస్తున్నారు" - అన్నాడు సేవకుడు.

"ఇది ఎంతో విచారించవలసిన విషయం" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

"చిత్తం" - అన్నాడు సేవకుడు.

"మన ఖజానాలో పనిచేసేవారి గొడవ నాకేమీ అర్థం కావడం లేదు. వీరి మనస్తత్వాలు కూడా నాకు బోధపడడంలేదు" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

సేవకుడు మౌనం వహించాడు.

"వీరికి గుణపాఠం నేర్పితీరాలి" - అని శ్రీమతి స్వార్సిత్ తన నిర్ణయాన్ని తెలిపింది.

సాధారణంగా యీ సమయంలో శ్రీమతి స్వార్సిత్ ఆ సేవ కునితో ఆంతరంగిక వ్యవహారాలను మాట్లాడ తూ వుంటుంది. ఆవిడ అలా ఆంతరంగిక విశేషాలను మాట్లాడుతూవుంటే సేవకుడు బల్లలపై చెదురుగావున్న కలాలను, కాగితాలను, సిరా సీసాలను సర్దుతూ వుంటాడు.

నిజం చెప్పాలంటే అతను సర్దినట్టు నటిస్తాడు అంతే.

"ఈరోజు గుమాస్తాలకు పని ఎక్కువగా ఉన్నదా ?" ప్రశ్నించింది శ్రీమతి స్వార్సిత్.

"పని మామూలే అమ్మగారూ" - జవాబు చెప్పాడు సేవకుడు.

"గుమాస్తాలు పని సక్రమంగా చేస్తున్నారా ?" - అని అడిగింది శ్రీమతి స్వార్సిత్.

"చిత్తం" - అన్నాడు సేవకుడు.

ఈ సేవకుడు వట్టి సేవకుడుమాత్రమే కాదు ఆఫీసులో యజమానితరపున గూఢచారికూడా. ఇతడే ఆఫీసు వ్యవహారాలను ఎప్పటికప్పుడు ఇతడు ఆఫీసులో జరిగేవిషయాలను యజమానికి కాని, లేక శ్రీమతి స్వార్సిత్‌కుగాని తెలుపుతూ ఉండాలి. ఈ అదనపుబాధ్యతను నిర్వహించినందుకు, అతనికి ప్రతివారం మామూలుగా ముట్టేజీతంకాక పండగకూ పబ్బానికీ అదనపు మామూలుకూడా గిట్టుతూ ఉంటుంది.

ఈ సేవకుడు వయస్సులో చిన్నవాడైనప్పటికి ఆవులిస్తే చాలు పేగులు లెక్కపెట్టే రకం. ఎంతటి గడ్డుసమస్యనైనా ఇట్టే పరిష్కరించగలడు. ఇంత మనస్తిమితం, నిలకడ, నీతి ఉన్న యువకుణ్ణి శ్రీమతి స్వార్సిత్ తన జీవితంలో ఎన్నడూ చూచి ఉండలేదు. అందుచేతనే ఈ యువకుడంటే ఆవిడకు ఎంతో అభిమానమూ ఆదరమూ. ఈ యువకుడి చిన్నతనంలోనే తండ్రి పోయాడు. ఆ తరువాత అతను స్వయంగా కష్టించి చదువుకుని పైకివచ్చాడు. బౌందర్‌బై మహాశయుని కొలువులోచేరి తన యజమాని మన్ననలను సంపాదించుకోవడము మాత్రమేకాక శ్రీమతి స్వార్సిత్ ఆదరాభిమానాలను కూడా చూరగొనగలిగాడు.

శ్రీమతి స్వార్సిత్ టీ తాగడాన్ని ముగించి, "అయితే, గుమాస్తాలందరూ సక్రమంగానే పనిచేస్తున్నారు కదూ ?" - అన్నది మరో పర్యాయం.

"ఆఁ చిత్తం. కాని గ్రాడ్ గ్రిండ్‌గారి కుమారులైన థామస్ విషయంలోనే నాకు కొంచెం సంశయంగా వున్నది. ఆ అబ్బాయిగారి ధోరణి నాకేమీ నచ్చకుండా వున్నది" - అన్నాడు సేవకుడు.

ఆ సేవకుడు యిలా అనేసరికి శ్రీమతి స్వార్సిత్ కండ్లు కొంచెం ఎరుపెక్కాయి.

"అవ్వాయ్! నీతో యింతకుపూర్వం నిక్కచ్చిగా ఒక విషయం చెప్పాను. ఆ విషయం నీకు జ్ఞాపకం లేదా?" - అని అడిగింది శ్రీమతి స్వార్సిత్.

"జ్ఞాపకమే అమ్మగారూ" - అన్నాడు సేవకుడు.

"కొందరి పేర్లు ఎత్తవద్దని యింతకుపూర్వం నీకు ఒకసారి చెప్పాను.

ఇక్కడ నా బాధ్యత ఎలాటిదో నీవు గమనించవలసి వున్నది. ఇక్కడ నా బాధ్యత సామాన్యమైనది కాదు, బౌందర్‌బై మహాశయునికీ నాకూ మానసికంగా కొన్ని అభిప్రాయ భేదా లుండవచ్చు. కాని ఆయన నాకు అన్నదాత. ఆయనకు నమ్మినబంటును నేను. సమాజంలో నా అంతస్తు - నా మనుగడ - వీటన్నిటికి కారకుడతనే, అందుచేత ఆయన ఉప్పు తింటూ ఆయనకు ఈషత్తయినా అపకారం జరిగినప్పుడు సహించడం నాకు గిట్టదు- అంతేకాక థామస్ ఆయనకు సంబంధించిన వ్యక్తి. ఆయన ఆంతరంగిక మిత్రుని కుమారుడు. అందుచేత నీవు పేర్లు ఎత్తి వారిని నిందించడము నాకు సుతరామూ గిట్టదు" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

"చిత్తం అమ్మగారూ పొరబాటైపోయింది" - అని నుదురు కొట్టుకుని క్షమాపణ వేడుకున్నాడు సేవకుడు.

శ్రీమతి స్వార్సిత్ చిరునవ్వు నవ్వి ఇలా అన్నది: "ఓరి వెర్రి బాగులవాడా - పేర్లు ఎత్తకుండా - ఒకవ్యక్తి అంటూ - వారి విషయాలు నాకు తెలపకూడదా?" - అన్నది.

"చిత్తం" - అంటూ సేవకుడు కనురెప్పలు అల్లలార్చి ఇలా చెప్పసాగాడు:

"మన ఆఫీసులో పనిచేస్తున్న అవ్యక్తి ఉన్నాడు చూచారమ్మగారూ - అతని ధోరణి నాకేమీ అర్థం కావడంలేదు. అతను ఆఫీసులో అడుగు పెట్టినప్పటినుంచి నేను కనిపెడుతూనే ఉన్నాను. అంత సోమరి కుర్రవాణ్ణి నేను నా జీవితంలో ఎన్నడూ చూచిఉండలేదు. నిజంగా

అతనుచేసే పనికి అతనికిచ్చే జీతం వృథాగా ఇస్తున్నట్లే అమ్మగారూ-" అన్నాడు సేవకుడు.

"అలాగా !" - అన్నది శ్రీమతి స్వార్సిత్ విచారసూచకంగా శిరస్సు పంకిస్తూ.

"చూశారు అమ్మగారూ - ఇది అయినవారి ఆఫీసుకాబట్టి అతని ఆటలు ఇక్కడ సాగుతున్నాయికాని, మరో ఆఫీసులో అయితే చేరిన రోజే అతన్ని బైటికి గెంటివేశివుండేవారు. పైగా ఆ కుర్రవాడుకూడా సామాన్యుడైన కుర్రవాడు కాదు - మనఊరి కుర్రవారందరివలెనే పోకిరీఘటం. ముందువెనుకలు ఆలోచించడు. ఎవరినీ లెక్కచెయ్యడు డబ్బు నీళ్ళలా ఖర్చుచేస్తాడు. ఈ డబ్బంతా మరి ఎలా వస్తుందో మనకు తెలీదు" - అని చెప్పసాగాడు సేవకుడు.

"డబ్బు పొదుపుచెయ్యడం నిన్నుచూచి అయినా నేర్చుకోరాదా?" అన్నది శ్రీమతి స్వార్సిత్.

"చిత్తం అమ్మగారూ, తమరు బాగా సెలవిచ్చారండి. తమ రిచ్చే జీతపుడబ్బులే నేను నా పొట్టకు ఖర్చుచేసుకుంటానండి, తమరు పండగకూ పబ్బానికీ నాకిచ్చే మామూళ్ళను ముట్టనుకూడా ముట్టుకోనండి. జాగ్రత్తగా దాచుకుంటానండి" - అన్నాడు సేవకుడు.

"అవును. నిన్ను చూచి వారు ఎందుకు నేర్చుకోరాదు ?" - అని అడిగింది శ్రీమతి స్వార్సిత్.

"చిత్తం అమ్మగారూ - అలాగే - ఇహ మరో విషయం - మన ఊరి కుర్రవారు జల్సా ఖర్చులు యింతా అంతా అని చెప్పడానికే వీలులేదు. నా జీవితంలో నేను యింతవరకు జల్సా అంటే ఏమిటో ఎరగను" - అన్నాడు సేవకుడు.

"నీవు బ్రహ్మచారివి.

నీకేం ఖర్చులుంటాయి ?" - అన్నది శ్రీమతి స్వార్సిత్ చిరు నవ్వు నవ్వుతూ.

సేవకుడు నుదుటిపై చెమట తుడుచుకున్నాడు. ఒకక్షణం మౌనంగా ఊరుకుని యిలా అన్నాడు : "అమ్మగారూ - ఒక వ్యక్తి

మనకోసం ఎదురు చూస్తూవున్నాడు. ఒకక్షణం క్రితం అతను తలుపు తట్టిన చప్పుడు వినిపించింది" - అన్నాడు సేవకుడు.

"ఆ వ్యక్తి ఎవరో చూచి రా" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

సేవకుడు కిటికీవద్దకు వెళ్ళి కిటికీలోనుంచి తొంగిచూచి వచ్చాడు.

'ఎవరా వ్యక్తి?' - అని అడిగింది శ్రీమతి స్వార్సిత్.

'ఎవరో కొత్తవ్యక్తి అమ్మగారూ' - అన్నాడు సేవకుడు.

"ఈ సమయంలో ఒక నూతన వ్యక్తికి ఈ కార్యాలయంతో అవసరం ఏముంటుంది? అయినా బౌందర్‌బై మహాశయుని నమ్మిన బంటుగా అతనితో మాట్లాడడం నా విధ్యుక్త ధర్మం" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

వెలుపల అపరిచిత వ్యక్తి తలుపును గట్టిగా బాదుతూ ఉన్నాడు.

"మీరు నన్ను చూడాలని వచ్చారనుకుంటాను" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

"అవునండి మీకు అనవసరంగా శ్రమ కలిగించానేమో - క్షమించాలి" - అన్నాడు ఆ నూతన వ్యక్తి.

"పరవాలేదు. అలా కూచోండి" - అంటూ కుర్చీని చూపింది శ్రీమతి స్వార్సిత్.

శ్రీమతి స్వార్సిత్ ఒకమారు ఆ వ్యక్తివంక పరీక్షగా చూచింది.

"వయస్సు 35 సంవత్సరాలుండవచ్చు. చక్కని విగ్రహం. మధురమైన కంఠస్వరం. గొప్పఇంటి బిడ్డలాగు ఉన్నాడు" - అనుకున్నది శ్రీమతి స్వార్సిత్.

సేవకుడు పరుగెత్తుకుని వెళ్ళి తలుపు తెరిచాడు. నూతన వ్యక్తి గదిలో ప్రవేశించేలోపుగా శ్రీమతి స్వార్సిత్ బల్లపైవున్న టీ కప్పులు వగైరాలు ఖాళీచేశించి.

సేవకుడు ముందుగావచ్చి, "అమ్మగారూ - ఆ నూతనవ్యక్తి మిమ్మల్ని చూడాలని అభిలషిస్తున్నారు" - అన్నాడు.

"మంచిది లోనికి రమ్మను" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

ఆవిడ లోనికి పిలిచేలోపున ఆ నూతనవ్యక్తి వెలుపలే అటూ ఇటూ పచార్లుచేస్తూ ఈలవేస్తూ కాలక్షేపం చేశాడు.

ఆ తరువాత సేవకుడు లోనికి ప్రవేశపెట్టగా నూతనవ్యక్తి గదిలోకి వచ్చాడు.

ఆ నూతన వ్యక్తి కుర్చీపై ఆసీనుడై యిలా అన్నాడు:

"ఇప్పుడు నేను రైల్వేస్టేషను దగ్గరినుంచి వస్తున్నాను. నా సేవకుడు కూడా స్టేషను దగ్గరే ఉన్నాడు. ఇక్కడికి వస్తూ ఒకమాటు ఈ వూరిని చూచివచ్చాను. ఈ ఊరు చాలా చిత్రంగా వున్నది" —.

"అలాగా? - అన్నది శ్రీమతి స్వార్సిత్.

తరువాత ఒకక్షణం ఆగి నూతన వ్యక్తి యిలా అన్నాడు:

"మీరు కూడా యీ వూరివారు కానట్లుగా వున్నారు" - అని.

"మీరు సరిగా తూచినట్లు ఊహించారు. నేనుకూడా ఈ ఊరికి చెందినదాన్ని కాదు. విధివశాత్తు నేను నా చిన్నతనంలోనే విధవరాలి నైనాను. తరువాత ఉదరపోషణార్థం యీ వూరికి చేరుకున్నాను" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

"మీ భర్తగారి పేరు?" - ప్రశ్నించాడు నూతన వ్యక్తి.

"పౌలర్" - జవాబు చెప్పింది శ్రీమతి స్వార్సిత్.

నూతన వ్యక్తి ఒకక్షణం ఆలోచించాడు.

"పౌలర్ కుటుంబాన్ని గురించి నేను వినిఉన్నాను" - అన్నాడు.

"మీకు ఈ ఊరి వాతావరణం ఎంతమాత్రం రుచించలేదని భావిస్తాను" - అన్నాడు నూతన వ్యక్తి.

"మనుష్యులు పరిస్థితులకు బానిసలు. నేనూ పరిస్థితులకు బానిసనే" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

"తత్వదృష్టిని అలవరుచుకోడం ఎందుకైనా మంచిది" - అన్నాడు నూతన వ్యక్తి.

రెండు మూడు నిమిషాలు యిరువురూ మౌనంగా కూచున్నారు.

తరువాత శ్రీమతి స్వార్సిత్ నూతన వ్యక్తిని యిలా ప్రశ్నించింది: "ఇంతకూ తమరు ఏ పనిమీద యిక్కడికి వచ్చారో అడగవచ్చునా?" - అని.

"తప్పకుండా. అలా అడగడం మీ విద్యుక్తధర్మం కూడా.

నేను బౌందర్‌బై మహాశయుణ్ణి కలుసుకోడానికి వచ్చాను. ఒకరు నన్ను పరిచయంచేస్తూ అయనకు ఒక లేఖను ఇచ్చాడు. ఆయన నివాసస్థలం ఎక్కడో మీరు చెప్పగలరా ?" - అని అడిగాడు నూతన వ్యక్తి.

"ఆయన నివాసస్థలం ఇదికాదండి. ఇది ఆయన ఖజానా" - అన్నది శ్రీమతి స్పార్సిత్.

"చిత్తం. అలాగా అవుతేనరేలెండి. దోవలో ఎవరో పనివాడు కనిపించాడు. బౌందర్‌బై మహాశయుని భవనం ఎక్కడాఅని అతగాణ్ణి అడిగాను. అతను ఈ భవనాన్ని చూపాడు. ఈ భవనంవద్దకు వచ్చి కిటికిలోనుంచి చూడగా మీరు కనుపించారు. మిమ్మల్ని అయినా చిరునామా అడగవచ్చునుకదా అని ఇక్కడికి వచ్చాను. క్షమించాలి" - అన్నాడు నూతనవ్యక్తి. నూతనవ్యక్తిధోరణి శ్రీమతి స్పార్సిత్‌కు వింతగా అనుపించింది. తరువాత ఒకక్షణం అగి నూతనవ్యక్తి ఇలా అన్నాడు.

"ఖజానా కార్యాలయాలతో సాధారణంగా అనుమానాస్పదమైన ఒక వాతావరణం కనుపిస్తూ ఉంటుంది. అవిషయం నాకు తెలియనిది కాదు. అలాటి వాతావరణం ఉండడం సబబుకూడాను. ఇంతకూ అసలువిషయం మీతో చెప్పడం మరిచాను. ఈ పరిచయలేఖను గ్రింద్ మహాశయుడు నా కిచ్చాడు. గ్రింద్ మహాశయుణ్ణి నేను ఎలా ఎరిగి వున్నానని మీరు ప్రశ్నించవచ్చు. ఆయనకూ నాకూ లండన్‌లో పరిచయం ఏర్పడింది" - అన్నాడు నూతనవ్యక్తి.

శ్రీమతి స్పార్సిత్ ఆ లేఖను అందుకున్నది. అక్షరాలను గుర్తుపట్టింది. తరువాత బౌందర్‌బై ఇంటి చిరునామాను నూతన వ్యక్తికి తెలియచేసింది.

నూతన వ్యక్తి ఆవిడకు ధన్యవాదాలు తెలియచేశాడు. 'బౌందర్‌బై మహాశయుని మీరు బాగా ఎరిగి ఉన్నారని అనుకుంటాను' - అన్నాడు.

'అవును. నేను పదిఏండ్లనుంచి ఆయన కొలువులోనే ఉన్నాను'- అన్నది శ్రీమతి స్పార్సిత్.

'ఆయన గింద్ మహాశయుని కుమార్తెను వివాహం చేసుకున్నా డని విన్నాను' - అన్నాడు నూతన వ్యక్తి.

'అవును' - అన్నది శ్రీమతి స్వార్సిత్.

'గింద్ మహాశయుని వలెనే ఆయన కుమార్తె కూడా తత్వ వేత్తట - నిజమేనా?' అని అడిగాడు నూతన వ్యక్తి.

'కావచ్చు' - అన్నది శ్రీమతి స్వార్సిత్.

'మీకు నా ప్రసంగం అనుచితంగా కనుపిస్తే నన్ను క్షమించండి. కాని మీరు ఆయన కుటుంబాన్ని ఆమూలాగ్రంగా తెలిసినవారు కాబట్టి నేను మిమ్మల్ని ఇలా అడగవలసి వస్తున్నది. నేను గింద్ మహాశయుని కుమార్తెను గురించి చాలావిని ఉన్నాను. ఆవిడ చాలా తెలివైనదని - సమర్థురాలనీ విన్నాను. ఆవిడ ఎంతో గంభీరంగా ఉంటుందట. ఇంతకూ ఆవిడ వయస్సు నలభై యాభై సంవత్సరాలైనా ఉంటుందా?' - అని అడిగాడు నూతన వ్యక్తి. నూతన వ్యక్తి ఇలా ప్రశ్నించేసరికి శ్రీమతి స్వార్సిత్ పకపకాన నవ్వింది.

"లూసా వయస్సు 20 సంవత్సరాలు మాత్రమే" - అన్నది.

"ఏమన్నారు? లూసా వయస్సు 20 సంవత్సరాలేనా? నా జీవితంలో నేను యింత ఆశ్చర్యకరమైన వార్తను ఎన్నడూ వినలేదు సుమండీ" - అన్నాడు నూతన వ్యక్తి.

లూసా వయస్సు 20 సంవత్సరాలు మాత్రమేనని శ్రీమతి స్వార్సిత్ చెప్పినప్పుడు నూతన వ్యక్తి నిజంగా నమ్మలేకపోయాడు. ఒక నిమిషం కనురెప్పలు ఆర్పకుండా శ్రీమతి స్వార్సిత్ వైపు చూచాడు. తరువాత మళ్ళీ తనను తాను నిగ్రహించుకుని, "ఇక వెళ్ళి వస్తాను. సెలవు" - శ్రీమతి స్వార్సిత్‌వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

నూతన వ్యక్తి వెళ్ళిపోయిన తరువాత శ్రీమతి స్వార్సిత్ సేవకుణ్ణి పిలిచి, "అబ్బాయ్, ఈ నూతన వ్యక్తిని గురించి నీ అభిప్రాయం ఏమిటి?" - అని ప్రశ్నించింది.

"దుస్తులకోసం చాలా డబ్బు వెచ్చించే వ్యక్తిలాగ కనుపిస్తున్నాడు. దుస్తులు ఎంతో ముచ్చటగా వున్నాయి" - అన్నాడు సేవకుడు.

"అవును. నిజమే. దుస్తులు అతని అభిరుచిని కనుపరుస్తూ వున్నాయి" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

'అంతేకాదు అమ్మగారూ - అతను మనల్ని చమత్కారం చేసి నట్టుగా ఉన్నాడు'-అన్నాడు సేవకుడు.

"అలా చెయ్యవచ్చునా" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

అంతటితో నూతన వ్యక్తిని గురించిన సంభాషణ ఆగి పోయింది.

ఆ సాయంత్రమంతా శ్రీమతి స్వార్సిత్ ఆ కిటికిప్రక్కనే కూచుని ఉన్నది. సూర్యబింబం మెల్లగా అస్తమిస్తూ ఉన్నది. చీకటి పొగలాగ కమ్ముకుంటూ వచ్చింది. శ్రీమతి స్వార్సిత్ గదిలో దీపం వెలిగించడంకూడా మరిచిపోయింది. ధ్యాననిమగ్నురాలై ఆ కిటికీ ప్రక్కనే కూచున్నది. వెలుపల అనేక శబ్దాలు వినిపిస్తున్నవి - కుర్ర వాళ్ళు దగ్గుతున్న శబ్దం - కుక్కలు మొరుగుతున్న శబ్దం దోవనపోయే బండ్లగానుల చప్పుడు, దుకాణాల తలుపులు మూసివేస్తున్నశబ్దం - అనేక శబ్దాలు వినిపిస్తున్నవి. కాని శ్రీమతి స్వార్సిత్ ఈ శబ్దాల నేమీ వినిపించుకోడంలేదు. బాగా చీకటిపడినతరువాత సేవకుడు గదిలో ప్రవేశించి, "అమ్మగారూ - భోజనానికిరండి" - అని పిలిచినతరువాత కాని శ్రీమతి స్వార్సిత్ తన ధ్యానసమాధినుంచి మేలుకోలేదు.

అప్పుడు ఆవిడ మెల్లగా లేచి, "వస్తున్నా" - అంటూ మేడ మీదకు వెళ్ళింది.

# 18

గ్రాడ్ గిండ్ మహాశయుని తత్వంగల వ్యక్తులను ఒక ప్రత్యేక ముఠాకు చెందినవారని అనవచ్చు.

బెస్తవారు వలలువేసి చేపలకొరకు వెదికినట్లు యీ ముఠాకు చెందినవారు క్రొత్త క్రొత్త యువకులకోసం అన్వేషిస్తూ ఉంటారు.

జీవితంలో అన్ని రుచులనూ చవిచూచి ఆఖరుకు విసుకెత్తి ఎందుకైనా సిద్ధపడేరకం యువకులు సాధారణంగా యిలాటి వర్గంలో చేరుతూ వుంటారు.

కాని అన్ని శుభలక్షణాలూ ఉండికూడా గింద్ మహాశయుని తత్వానికి చెందని ఒక వ్యక్తి కోక్‌టౌన్ నగరంలో ఉన్నాడు. అతడు గొప్పఇంటి బిడ్డ, స్ఫురద్రూపి, చమత్కారి. ఈవ్యక్తి ఒకపర్యాయం కామన్స్ సభలో ఒక రైలు ప్రమాదాన్ని గురించి ప్రసంగించగా - అతని చమత్కార ధోరణికి కామన్స్ సభ యావత్తూ పరవశమై పోయింది. రైల్వే ఆఫీసర్లు సమర్థులు. రైలుపట్టాలలో లోపమేమీలేదు. కాని రైలు ప్రమాదం జరిగింది. ఈ ప్రమాదంలో అయిదుగురు మరణించారు. వీరిలో ఒక ఆవుకూడా ఉన్నది. ఈ రైలు ప్రమాదాన్ని గురించి ఈవ్యక్తి కామన్స్ సభలో ప్రసంగించి తన ప్రసంగ చమత్కారంద్వారా రైల్వే ఉద్యోగులకు ఎలాటి శిక్ష కూడా విధించబడకుండా నిర్వహించుకో రాగలిగాడు. ఈ యువకునికి ఒక తమ్ముడున్నాడు. తమ్ముడు అన్నకు మించినవాడు. తమ్ముడు కూడా అన్నవలెనే జీవితం తాలూకు లోతుపాతులను బాగా ఎరిగినవాడు. అతడు అనేక విధాలైన ఉద్యోగాలు చేశాడు. మొదట సైన్యశాఖలో ఉద్యోగాన్ని స్వీకరించి కొన్నాళ్ళపాటు ఆ ఉద్యోగ ధర్మాన్ని నిర్వహించాడు. ఆ తరువాత ఆ ఉద్యోగంతో విసుకెత్తి విదేశాంగ శాఖలో చేరాడు. అక్కడకూడా ఇమడలేక జెరూసెలం వెళ్ళాడు. జెరూసెలంలో కూడా అతడికి శాంతి కనుపించక వివిధ దేశాలు పర్యటించి చివరకు ప్రపంచంలో ఎక్కడకాని ఏమీలేదని తెల్పుకుని యిల్లు చేరుకున్నాడు.

అన్నగారు ఒకరోజున తమ్ముణ్ణి చేరబిలిచి యిలా చెప్పసాగాడు: "అబ్బాయ్ జేమ్, నీకు గ్రాడ్ గింద్ మహాశయుని తెలిసే వుంటుంది. ఆయనకు కొత్త అనుచరులు అవసరంగా ఉన్నారుట. అందులో సంఖ్యాశాస్త్ర ప్రవీణులూ - సభలలోను, సమావేశాలలోను చక్కగా ప్రసంగించగలవారూ కావలెనట. నీవు ఎందుకు యత్నించకూడదు?"- అన్నాడు.

తమ్ముడు జేమ్స్ అన్నగారి సలహాను పాటించి సంఖ్యా శాస్త్రాన్ని గురించిన ఒకటి రెండు గ్రంథాలను అధ్యయనం చేశాడు.

ఇలా వుండగా ఒకనాడు అన్నగారు గ్రాద్ గింద్ మహాశయుని గృహానికి వెళ్ళి ఆయనతో తన తమ్ముని విషయాన్ని నివేదించుకున్నాడు.

ఆ తరువాత ఒకటిరెండు సమావేశాలలో జేమ్స్ ప్రసంగించడం విని గ్రింద్ మహాశయుడు అతన్ని తన అనుచరులలో చేర్చుకోడానికి నిశ్చయించుకున్నాడు. ముందు తరిఫీదు కొరకు జేమ్స్‌ను కోక్‌టౌన్‌కు పంపడానికి గ్రింద్ నిర్ణయించి అతనికి పరిచయలేఖను ఇచ్చి బౌందర్‌బై మహాశయునివద్దకు పంపాడు.

తన మిత్రుడైన గ్రింద్‌వద్దనుంచి ఒకనూతనవ్యక్తి తనకొరకు వచ్చాడని, శ్రీమతి స్పార్సిత్‌ద్వారా విని, బౌందర్‌బై మహాశయుడు జేమ్స్‌ను కలుసుకునేనిమిత్తం అతడు బసచేశివున్న హోటలుకు వెళ్ళాడు.

బౌందర్‌బై మహాశయుడు హోటల్లో ప్రవేశించేసరికి జేమ్స్ తన గదిలో కిటికివద్ద కూచుని పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూఉన్నాడు.

బౌందర్‌బై గదిలో అడుగుపెట్టి, "నాపేరు బౌందర్‌బై నా నివాసస్థలం కోక్‌టౌన్ నగరం" - అంటూ తనను తాను పరిచయం చేసుకొన్నాడు.

బౌందర్‌బై మహాశయుని ఆగమనంవల్ల జేమ్స్ ముఖం వికసించింది.

'ఇలా కూచోండి' - అంటూ జేమ్స్ ఒక కుర్చీ చూపాడు.

బౌందర్‌బై మహాశయుడు కుర్చీపై కూచోకుండానే యిలా చెప్పడం మొదలెట్టాడు: "మా నివాస స్థలమైన కోక్ టౌన్ నగరం యింతకుపూర్వం మీకు అపరిచితమైనది, అందుచేత మీకు ముందుగా మా నగరాన్ని గురించి కొన్ని విషయాలను చెబుతాను"—

"చిత్తం. తమ నగరాన్ని గురించిన విశేషాలు వినాలని నేనూ ఎంతో కుతూహల పడుతున్నాను" - అన్నాడు జేమ్స్.

"తమరు మా నగర విశేషాలన్నీ విన్న తరువాత మీకు ఆశాభంగం కలగవచ్చు. అందుచేత మా నగర విశేషాలు మీ అభిరుచులకు తగినట్లుగా వుంటాయని నేను వాగ్దానం చెయ్యను.

అసలు మొదటి విషయం. మా నగరంనిండా మీకు కనుపించేది పొగ, మా నగరవాసులకు తిండీ, నీరూ యీ పొగే. ఇతరుల ఉద్దేశంలో ఫ్యాక్టరీ పొగ ఆరోగ్యానికి భంగకరమైనది కావచ్చు. కాని మా ఉద్దేశంలో మటుకు పొగ ఊపిరితిత్తులకు ఎంతో ఆరోగ్యకరమైనది. ఫ్యాక్టరీలు మా వూరికి పెట్టని కోటలవంటివి. బ్రిటన్, ఐర్లండులలోని జనబాహుళ్యం యావత్తూ మా అభిప్రాయాలను కాదన్నా, మేము మా అభిప్రాయాలను మార్చుకోము" - అని ఒక చిన్న మోతాదులో ప్రసంగించాడు బౌందర్‌బై.

"చిత్తం తమ అభిప్రాయాలు ఎంతో సమంజసంగా ఉన్నవి. మీ అభిప్రాయాలతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను" - అన్నాడు జేమ్స్.

"చాలా సంతోషం. మా ఫాక్టరీలలో జరిగే పనిని గురించికూడా మీరు వినేఉంటారు. మా ఫాక్టరీలలో జరిగేటంత పని మరెక్కడా జరగదు. కాని కొందరు శుంఠలు మా ఫాక్టరీలను విమర్శిస్తూ ఉంటారు. మా ఫాక్టరీలు పరిశుభ్రంగా లేవని అంటారు. మా ఫ్యాక్టరీలలో నేలమీద తివాసీలు పరవాలని అంటారు. కాని మేము ఇలాంటి అసందర్భమైన పనులను చెయ్యం" - అన్నాడు బౌందర్‌బై.

"చిత్తం తమరు నూటికి నూరుపాళ్ళు నిజం చెప్పారు" - అన్నాడు జేమ్స్.

"మా పురజనులను గురించి, నన్ను గురించి నీకు మరికొన్ని విషయాలను కూడా చెప్పవలసి ఉన్నది. మా పురజనులు ఋషులవంటివారు. అన్న వస్త్రాలవిషయంలో కాని, గృహసౌకర్యాల విషయంలో కాని వారెంతో నిరాడంబరంగా ఉంటారు. నేనూ నిరాడంబరమైన వ్యక్తిని. నిర్మొహమాటమైన స్వభావం నాది. ఒక వ్యక్తితో పరిచయాన్ని ఏర్పరుచుకోడానికి ముందు ఆ వ్యక్తిని ఆ మూలాగ్రం అర్థం చేసుకునికాని ఆ వ్యక్తితో పరిచయం ఏర్పరుచుకోను. ఇప్పుడు నీకు

పరిచయ లేఖను ఇచ్చిన గిండ్ నాకు ఆప్త మిత్రుడు. ఆయన నీకు ఇచ్చిన పరిచయ లేఖనుబట్టి నీవు గొప్పఇంటి బిడ్డవని తెలుస్తున్నది. కాని నేనుకూడా గొప్పఇంటి బిడ్డనని నీవు పొరబడి ఉంటే ఆ పొర బాటు సవరించుకోమని నిన్ను కోరుతున్నాను. నేను గొప్పఇంటి బిడ్డను కాను. అతిసామాన్యమైన వ్యక్తిని. వీధిలో పుట్టి వీధిలో పెరిగి స్వయం కృషివల్ల పైకివచ్చిన వ్యక్తిని. ఇప్పుడు మనం ఇరువురం పరస్పరం అర్థం చేసుకున్నాము కాబట్టి ఇక మనం సమాన ఫాయాలో మాట్లాడు కోవచ్చు. నేను వీదిలో పుట్టి పెరిగిన వ్యక్తినైనా స్వయంకృషివల్ల నా ఆత్మ స్వాతంత్ర్యాన్ని స్థాపించుకోగలిగాను" - అన్నాడు బౌందర్బై.

ఆ తరువాత యిరువురూ స్నేహసూచకంగా కరస్పర్శ కావించు కున్నారు. ఒకక్షణం మౌనంగా ఊరుకుని బౌందర్బై మహాశయుడు మళ్ళీ యిలా చెప్పసాగాడు: "నీకు మరొక విషయం తెలుసునో తెలియదో అని యీ విషయాన్ని తెలియచేస్తున్నాను. నేను గ్రాడ్ గిండ్ మహాశయుని కుమార్తెను వివాహం చేసుకున్నాను, నీవు శ్రమ అనుకోక ఒకమాటు మా యింటికి వస్తే నిన్ను ఆవిడకు పరిచయం చెయ్యగలను".—

'చిత్తం' - అన్నాడు జేమ్స్.

ఆ తరువాత బౌందర్బై, జేమ్స్‌ను తన యింటికి తీసుకుని వెళ్ళాడు, ఎర్రని యిటుకలతో కట్టిన భవనం అది. వెలుపల నల్లని తెరలు దించివున్నాయి. లోపల కిటికీలకు ఆకుపచ్చరంగు తెరలు వ్రేలాడదీసి వున్నాయి.

ఇరువురూ డ్రాయింగు రూమ్‌లోకి ప్రవేశించిన వెంటనే వారి కొక యువతి ప్రత్యక్షమైంది. నిండుగా నింపాదిగా వుంది ఆ యువతి. ఏ విషయమూ పట్టించుకోనట్లుగా నిర్లిప్తంగా కనుపిస్తున్నది. ఇంత నిర్లిప్తంగా వున్నప్పటికీ ఆవిడలో ఎంతో ఆత్మాతిశయం కనుపిస్తున్నది.

మానసికమైన సౌందర్యం మాత్రమేకాదు - ఆవిడ శారీరకంగా కూడా ఎంతో అందంగా కనుపిస్తున్నది.

జేమ్స్ ఆ యువతిని చూచి స్తబ్ధుడైనాడు. ఆ యువతి లూసా.

జేమ్స్ ఆ యువతివైపు తదేకదృష్టితో రెండు క్షణాలపాటు చూచి ఆతరువాత డ్రాయింగ్ రూమ్‌లోని వివిధ అలంకారాలను పరిశీలించ సాగాడు. బౌందర్ బై మహాశయుడు లూసాను జేమ్స్‌కు పరిచయం చేశాడు. ఈవిడ నాభార్య లూసా. గ్రిండ్‌మహాశయుని కుమార్తె. గొప్ప మేధావి. నాకన్న వయస్సులో చిన్నది. అయినా నన్ను వివాహం చేసుకున్నదీఅంటే నాలో ఏదో ప్రత్యేకత ఆవిడకు కనుపించిఉండాలి"- అన్నాడు బౌందర్ బై.

ఆ తరువాత ఒకక్షణం ఆగి బౌందర్‌బై మళ్ళీ ఇలా చెప్ప సాగాడు. "చూడు - అబ్బాయీ - నీవు నాదగ్గరకు వచ్చినందుకు నా కెంతో సంతోషంగా ఉన్నది. నీవు నిరక్ష్యంతరంగా ఇక్కడ వుండ వచ్చు. వున్నవాస్తవాన్ని వున్నట్లుగా మాట్లాడే వ్యక్తిని నేను. పొగ డ్తలూ ప్రశంసలూ నాకు గిట్టవు. కాని నీవిషయం వేరు. నీవు గొప్ప ఇంటి బిడ్డవు. పెద్దమనిషివి. నేను గొప్పఇంటి బిడ్డనూకాను, పెద్ద మనిషినీ కాను. నేను మామూలు బౌందర్‌బైని. అంతే"—

జేమ్స్ లూసావైపు తిరిగి చిరునవ్వు నవ్వుతూ యిలా అన్నాడు: "బౌందర్‌బై మహాశయుడు మనవంటి మామూలు వ్యక్తులను బంధించే క్షుద్రబంధాలకు అతీతుడు"—

"ఆయన్ను మీరు ఎంతో గౌరవిస్తూవున్నారు. అలా గౌర వించడం సహజం కూడా"- అన్నది లూసా మెల్లగా.

లూసా యిలా అనగానే జేమ్స్ నిరుత్తరుడైనాడు.

తరువాత లూసా మళ్ళీ యిలా చెప్పసాగింది: "మీరు మీ జీవి తాన్ని దేశసేవకు అంకితం చెయ్యదలిచినారని నా భర్తగారు చెప్పగా విన్నాను. దేశాన్ని అల్లకల్లోలం చేస్తున్న చిక్కు సమస్య లన్నిటిని పరిష్కరించడానికి మీరు నిశ్చయించుకున్నారన్నమాట!" - అన్నది లూసా గంభీరంగా.

జేమ్స్ నవ్వి యిలా అన్నాడు: "మీరు నాకు లేనిపోని గొప్ప లను అంటగడుతున్నారు. అంత గొప్ప బాధ్యతలను నిర్వహించగల అర్హత నా కున్నదని అంటారా? నేను జీవితంలో అంత అనుభవం వున్న వ్యక్తినికూడా కాను"—

మీకు స్వంత అభిప్రాయాలనేవి లేవంటారా?" - అని అడిగింది లూసా.

"స్వంత అభిప్రాయాలంటారా? ఒకప్పుడు వుంటే వుండేవేమో కాని తరువాత రాను రాను నా అభిప్రాయాలన్నీ చెదిరిపోయినాయి. ఇప్పుడు నాకు అభిప్రాయాలంటూ లేవు. ఒకవేళ నాకు అభిప్రాయాలనేవి వున్నా ఆ అభిప్రాయాలకు విలువ వున్నదని నేను భావించను. జీవితంలో అనేక అనుభవాలను పొందిన మీదట నేను ఒక చక్కని గుణపాఠాన్ని నేర్చుకున్నాను. జరిగేదేదో జరిగితీరుతుంది. జరగనిది ఎలాగో జరగదు. అందుచేత మనం అనవసరంగా తాపత్రయపడడం అనవసరమని నిర్ణయించుకున్నాను" - అన్నాడు జేమ్స్.

"మీరు గొప్ప రాజకీయవేత్తలలాగ అగుపిస్తున్నారు" - అన్నది లూసా.

క్షమించాలి. నాకు అనవసరంగా ఆ గొప్పతనాన్ని అంటగట్టకండి" - అన్నాడు జేమ్స్.

అంతటితో ఆ సంభాషణ ముగిసింది. ఆ తరువాత బౌండర్‌బై మహాశయుడు జేమ్స్‌ను నగరంలోనికి తీసుకుని వెళ్ళి నగరంలోని పెద్దలందరికి పరిచయం చేశాడు. వారు భోజనానికి ఇంటికి తిరిగి వచ్చేసరికి రాత్రి కొంచెం ఆలస్యమైంది. వారు వచ్చేసరికి భోజనం సిద్ధంగా ఉన్నది. లూసా, బౌండర్‌బై, జేమ్స్ భోజనాలకు కూర్చున్నారు. భోజనాల బల్లవద్ద నాల్గవ కుర్చీ కూడా ఉండడం చూచి "ఈ కుర్చీ ఎవరి కొరకు?" - అని బౌండర్‌బై మహాశయుడు ప్రశ్నించాడు.

"థామస్ కూడా ఈరోజు భోజనానికి వస్తాడు" - అన్నది లూసా.

"మరింకా రాలేదేం?" - అని ప్రశ్నించాడు బౌండర్‌బై.

సరిగ్గా ఆ సమయానికి తలుపు చప్పుడైంది. లూసా వెళ్ళి తలుపు తెరిచింది. థామస్ ప్రత్యక్షమైనాడు. లూసా ముఖం చిరునవ్వుతో వికసించింది.

"థామస్ సివంగి పిల్లలాంటివాడు" - అన్నాడు బౌండర్‌బై చమత్కారంగా.

థామస్ సరాసరి లోనికివచ్చి బల్లముందు కూచున్నాడు.

"అబ్బాయ్ థామస్ - చూచావా - నేను నీవయస్సులో వున్నప్పుడు సరిగ్గా సమయానికి విందుకు వెళ్ళేవాణ్ణి. లేకపోతే అసలు భోజనమే దొరికేదికాదు. కాని రోజులు మారాయి. అంచాత నీవు ఆలస్యంగా వచ్చినా పరవాలేదు" - అన్నాడు బౌందర్బై వ్యంగ్య ధోరణిలో.

.ఆ రోజులకు ఈ రోజులకు సంబంధం లేదులెండి' అన్నాడు థామసు.

"ఆ రోజులకూ జేమ్స్ లూసాతో: "మీతమ్ముణ్ణి నేను ఇంతకు మునుపే ఎక్కడో చూచినట్లుగా ఉన్నానండి. ఎక్కడచూశానో నామటుకు నాకుస్పష్టంగా జ్ఞప్తిలేదుగాని మొత్తంమీద మీ తమ్ముని ముఖం నాకు పరిచితమైనదే" - అన్నాడు.

థామస్వైపు తిరిగి, "మీరు ఎన్నడైనా విదేశాలకు వెళ్ళారా?"- అని అడిగాడు.

"నాకు అలాంటి అదృష్టం ఎన్నడూ కలగలేదు" - అన్నాడు థామస్.

థామస్ ఆరోజున అదోవిధంగా అన్నాడు. అతని ముఖంలో ఒకవిధమైన విషాదమూ గాంభీర్యమూ మిళితమై కనుపిస్తూ ఉన్నాయి. పైగా బౌందర్బై పట్ల తన అసహ్య భావాన్ని దాచుకోలేకుండా ఉన్నాడు. కాని ఆసాయంత్రమే థామస్కూ జేమ్స్కూ మైత్రి ఏర్పడింది. భోజనాలైన తరువాత జేమ్స్ తిరిగి తను బసచేసిన హోటల్కు వెళ్ళేటప్పుడు థామస్ కూడా అతనికి తోడుగా వెళ్ళాడు.

# 19

అసహజమైన అదుపాజ్ఞలలో పెరిగిన ఒక యువకుడు పెరిగి పెద్దయిన తరువాత కిలాడీగా తయారవుతాడని అనడంలో అసత్యమేమీ లేదు థామస్ సరిగ్గా యిలాగే తయారయ్యాడు.

థామస్ పెరిగి పెద్దవాడైన తరువాత యిలా తయారవుతాడని ఎవరూ ఊహించలేదు. చిన్నతనంలో అంత అదుపు ఆజ్ఞలలో పెంచ బడిన థామస్ యిలా గడుగ్గాయిగా తయారుకావడం తల్లి తండ్రులకే ఆశ్చర్యం కలిగించింది. థామస్, జేమ్స్, యిద్దరూ హోటలె చేరారు.

"నీకు సిగరెట్టు కాల్చే అలవాటున్నదా?" - అని అడిగాడు జేమ్స్.

"ఓ దానికి అభ్యంతరం ఏమున్నది?" - అన్నాడు థామస్. జేమ్స్ థామస్‌కు ఒక సిగరెట్టు అందించాడు. ఇరువురూ జేమ్స్‌గదిలో కూచుని పిచ్చాపాటీ మాట్లాడుకోసాగారు. జేమ్స్, థామస్‌కొరకు ఒక చల్లని పానీయాన్ని తెప్పించాడు. థామస్ ఆ చల్లనిపానీయాన్ని సేవించి, సోఫాలో హాయిగా పవళించి జేమ్స్‌తో పిచ్చాపాటీ మాట్లాడ సాగాడు.

"ఈరోజు ముసలాడు బౌందర్‌బై నిన్ను తన ఉపదేశాలతో దుంపతెంచేశి ఉంటాడు" - అన్నాడు థామస్.

"బౌందర్‌బై మహాశయుడు చాలా విచిత్రమైన వ్యక్తి" - అన్నాడు జేమ్స్.

"ఆయన మంచివాడనేనా నీ ఉద్దేశం?" - అని అడిగాడు థామస్.

జేమ్స్ తను పడుకున్న సోఫామీపైనుంచి మెల్లగాలేచి థామస్ వద్దకువచ్చి, "అబ్బాయ్ నీవు నీ బావగారికి తగిన బావమరిదివోయ్" - అన్నాడు.

"అలా అనకు. మా బావగారు నాకు తగిన బావగారని అను మరింత సమంజసంగా ఉంటుంది" - అన్నాడు థామస్.

"మీ బావగారికి మొత్తంమీద నిన్ను చూస్తే హడలే అను కుంటాను" - అన్నాడు జేమ్స్.

మా బావగారిని గురించి నేను యీ రోజున కొత్తగా యిలా మాట్లాడడంలేదు. మొదటినుంచీ కూడా బౌందర్‌బై మహాశయుణ్ణి గురించి నేను యిలాగే మాట్లాడుతూ వచ్చాను. ఈ రోజున హఠాత్తుగా నా అలవాటును మార్చుకోడమంటే కష్టం" - అన్నాడు థామస్.

"నాముందు మీ బావగారిని గురించి మాట్లాడినందువల్ల ప్రమాదం లేదుకాని ఆయన భార్య సమక్షంలో యిలా మాట్లాడితే ప్రమాదం తప్పదు" - అన్నాడు జేమ్స్.

జేమ్సు యిలా అనేసరికీ ధామస్ పకపకన నవ్వి మరో గుక్క చల్లని పానీయాన్ని త్రాగాడు.

నీవు మా చెల్లి లూసా విషయంకదూ చెబుతూవున్నావు ? మా చెల్లి బౌండర్‌బైని ఎన్నడూ లెక్కచేసి వుండలేదు" - అన్నాడు ధామస్.

"ఇంతకుపూర్వం లెక్కచేసి ఉండకపోవచ్చు. కాని ఇప్పుడు లెక్కచెయ్యవచ్చుకదా ?" - అన్నాడు జేమ్స్.

"మాచెల్లి బౌండర్‌బైని ఇప్పుడూ, అప్పుడూ, ఎప్పుడూ లెక్కచెయ్యదు" - అన్నాడు ధామస్.

ఈపాటికి ధామస్ రెండు కాళ్ళనూ సోఫాపై ఉంచి హాయిగా పవళించాడు సిగరెట్టు పొగ వదులుతూ ఇలా చెప్పసాగాడు: "అబ్బాయ్ నీకు మా నాన్నగారు తెలుసుకదా - ఆయన యమునిలాంటివాడు. ఆయన మాటకు ఎవరూ ఎదురాడతరంకాదు లూసా ఆయన ఆజ్ఞాను సారం బౌండర్‌బైని వివాహం చేసుకున్నది. లూసా పంజరంలో చిల కలా పెరిగిన పిల్ల. లూసా మరో ప్రియుణ్ణి ఎరగదుకూడా." "బాగుంది కధ" అన్నాడ జేమ్సు.

"అంతేకాదు. మా చెల్లిని బౌండర్‌బైని వివాహం చేసుకోమని నేనుకూడా కోరాను. నేను మా చెల్లిని అలా కోరడానికి కారణం లేక పోలేదు. నాకు సమ్మతం కాకపోయినా నేను బౌండర్‌బై మహాశయుని ఖజానా కార్యాలయంలో గుమాస్తాగా పనిచేస్తూ ఉన్నాను. మా చెల్లి బౌండర్‌బై మహాశయునికి భార్య అయినట్లయితే నేను సులువుగా పైకి ప్రాకివెళ్ళవచ్చు. ఈ విషయాన్ని నేమ లూసాతోకూడా చెప్పాను. ఈ రోజున లూసా నాకొరకు ఏమైనాసరే చెయ్యడానికి సిద్ధంగా ఉన్నది" - అన్నాడు ధామసు.

"మంచిపని చేశావు !" - అని జేమ్సు, ధామస్‌ను అభినం దించాడు. ధామసు మళ్ళీ ఇలా మెల్లగా చెప్పసాగాడు :

"అంతేకాదు. నాసుఖం, స్వేచ్ఛ, అన్నీ లూసాపైనే ఆధారపడి ఉన్నవి. లూసా నేనూ ఒక్క క్షణం కూడా ఒకరికొకరం విడిచి ఉండే వాళ్ళంకాదు. నేను ఇంటిలో ఉండని సమయంలో లూసాకు ఇల్లు ఒక జైల్లల్లే ఉండేది. అదీకాక బౌంవర్బైని వివాహం చేసుకున్నందున లూసా మరో ప్రేయునికి ఆశాభంగం కలిగించినట్లుకూడా కాదు. అందు చేత లూసాను బౌంచర్బైని వివాహం చేసుకోమని నేనూ కోరాను" -

"బాగుంది. కాని భార్యా భర్తల మధ్య యిప్పుడు పొరపులేమీ లేవనుకుంటాను" - అన్నాడు జేమ్సు

"అలాటివేమీ లేవు. లూసా నూటికి నూరుపాళ్ళా అదర్శపత్ని. లూసాలాంటి పిల్ల ఎలాటి వాతావరణంలోనైనా యిమిడిపోగలదు. ఎలాటి సంసారాన్నైనా నిర్వహించుకు రాగలదు. అలాటి స్త్రీని భార్యగా పొందిన భర్త నిజంగా అదృష్టవంతుడనే చెప్పాలి."

"ఆ అమ్మాయి అచ్చం మీ నాన్నగారి పోలికేనంటావు? మీ నాన్నగారే నీ చెల్లిని అలా తయారుచేసి వుంటారు అన్నాడు జేమ్సు.

"మా చెల్లినేకాదు - నన్నుకూడా మా నాన్నగారు అలా నిక్కచ్చిగా పెంచారు" - అన్నాడు థామస్.

"నిన్నుకూడా మీ నాన్నగారు అలా పెంచారని అంటావా? - కాని, నీ వాలకం చూస్తే అలా కనుపించడంలేదు" - అన్నాడు జేమ్సు.

"నీవు నమ్మకపోవచ్చు. మా నాన్నగారు నన్నూ, నా చెల్లినీ ఒకేరీతిగా పెంచారు. బౌందర్బై కార్యాలయంలో గుమాస్తాగా అడుగు పెట్టకముందు నేనుకూడా మా చెల్లిలాగా అమాయకుణ్ణే" - అన్నాడు థామసు.

"నాకు నమ్మకం కలగడంలేదు" - అన్నాడు జేమ్సు.

"నిజంగా అబ్బాయ్" - అన్నాడు థామస్ చనువుగా.

తరువాత కొద్దిసేపు మిత్రు లిరువురూ మౌనంగా కూచున్నారు. థామస్ మెల్లిగా సిగరెట్టు కాల్చుకోసాగాడు. కొద్దిక్షణాల తరువాత థామసు తన చెల్లిని గురించి మళ్ళీ యిలా చెప్పసాగాడు :

"నా చెల్లి స్త్రీలందరిలాగానే తెలివిగలది. ఎంతోగుట్టు. మట్టు కలిగినపిల్ల. స్త్రీలు సహజంగా ఎక్కడైనా ఇమిడిపోగలరు. కాని పురుషుల విషయంవేరు" అన్నాడు థామసు.

"సరేకాని నీతో ఒకవిషయం చెప్పటం మరిచాను. నేను నిన్న బౌందర్‌పై ఖజానా కార్యాలయానికి వెళ్ళినప్పుడు, అక్కడ వృద్ధురాలైన ఒక స్త్రీని చూచాను. ఆవిడకు నీ చెల్లెలంటే ఎంతోమక్కువలాగా వున్నది." అన్నాడు జేమ్సు.

"శ్రీమతి స్వార్స్సిత్ విషయంకదూ నీవు చెపుతున్నది? అయితే నీవప్పుడే ఆవిడను చూచావన్నమాట" అన్నాడు థామసు. అవునన్నట్లు తలవూపాడు జేమ్సు. థామసు కొనవరకూ కాలినసిగరెట్టు నేలకు విసరికొట్టి మళ్ళీ ఇలా చెప్పసాగాడు.

"శ్రీమతి స్వార్సిత్‌కు లూసాపట్ల ఆదరాభిమానాలే కాదు. ఎంతో మక్కువ భక్తికూడా వున్నాయి." అన్నాడు థామసు. తరువాత కొద్దిసేపు ఆగి నాకు నిద్రవస్తున్నట్లుగా వున్నది ఇహ నేను వెళ్ళాలి. థామసు, జేమ్సు దగ్గర సెలవుతీసుకుని వీధిలో అడుగు పెట్టాడు. తూలుతూ ఇంటివైపుకు నడక సాగించాడు. ఇల్లుచేరి సరాసరి పడక గదిలోకివెళ్ళి పక్కమీద వాలిపోయినాడు.

# 20

"మిత్రులారా! పతిత జీవులారా! పీడిత ప్రజలారా! కోక్ టౌన్ నగర వాసులారా! నిరంకుశత్వ పదతాడిత పీడిత హీనదీన జనులారా! మనమంతా ఒక మహాశక్తిగా రూపొందవలసిన సమయం ఆసన్నమైంది. మనమంతా ఒక మహాశక్తిగా రూపొంది మన నెత్తురు పీలుస్తున్న ధనమదాంధులను నేలకూల్చి భువిలో ఒక నూతన మానవ వ్యవస్థను నిర్మించవలసిన సమయం వచ్చింది" -

ఉపన్యాసకుడు అగ్నిపర్వతంలా బ్రద్దలై తన ప్రపంచాన్ని అగ్నిధారలా కురిపిస్తున్నాడు. "సెబాసు సెబాసు" - అని శ్రోతలనుంచి హర్షధ్వానాలు మిన్నుముట్టుతున్నాయి. అదిఒక చిన్నహాలు. ఆ హాలు నిండా జనం క్రిక్కిరిసి ఉన్నారు. హాలులో ఒక గ్యాసులైటు వెలుగుతూ ఉన్నది. ఉక్క, వేడి ఈ వాతావరణంలో ఉపన్యాసకుడు ప్రసంగిస్తున్నాడు. అది ప్రసంగం కాదు. సింహగర్జన. ఉపన్యాసకుడు నటునివలె చేతులు త్రిప్పుతున్నాడు. కనుబొమలు ముడివేస్తున్నాడు. అతని నుదుటిపై చెమట ధారలుగా కారుతూ ఉన్నది. అతను సింహంలా గర్జిస్తున్నాడు. అతను గర్జించి గర్జించి ఆఖరుకు అలసి సొలసి - "ఒకగ్లాసు మంచినీళ్ళు" - అన్నాడు.

వేదికపై వున్న ఒకవ్యక్తి అతనికి ఒక గ్లాసుతో మంచినీరు అందించాడు. ఉపన్యాసకుడు మంచినీరు తాగాడు. ముఖం తుడుచుకున్నాడు.

ఇక ఆ ఉపన్యాసకుని రూపురేఖలను మనస్తత్వాన్ని కొంత పరిశీలించుదాము. ఆ ఉపన్యాసకుణ్ణి అతని ఉపన్యాసాన్ని వింటున్న శ్రోతలతో పోల్చినట్లయితే అతను శ్రోతలకంటె ఉన్నతమైన వ్యక్తి అని అనుకొనడానికి ఏమాత్రం ఆస్కారం కనుపించదు. పైగా అతను వారికంటె తక్కువ అంతస్తులో ఉన్నవారివలె కూడా అగుపిస్తున్నాడు. అతని ముఖంలో నిజాయితీ మచ్చుకైనా కనుపించడంలేదు. మాటలో చమత్కారం లేదు, ఎత్తయిన భుజాలు, కుంచించుకున్న కనుబొమలు, గంత తొడిగినట్లుగా వున్న దుస్తులు, అతని రూపురేఖలు కూడా అంత ఆకర్షణీయంగా లేవు. అతన్ని చూడగానే అతనొక ప్రజానాయకుడై వుండగలడని మనం అనుకునే ఆస్కారం లేదు.

ఇక, శ్రోతలుమాత్రం అతని పలుకులను ఎంతో శ్రద్ధాశక్తితో ఆలకిస్తూ ఉన్నారు. వారి ముఖాలలో ఎంతో ఆతురత, శ్రద్ధాద్యోతకమవుతూవున్నవి. వారిలో అనాశక్తికాని అశ్రద్ధకాని అలసత్వంకాని మచ్చుకైనా కనుపించడం లేదు. ప్రతి ఒకనిముఖంలోనూ అతడు తన పరిస్థితిని గుర్తెరిగిన భావం కనుపిస్తున్నది, తన పొరుగువారిలో

కలిసి తన పరిస్థితిని బాగుపరుచుకోడానికి పోరాడవలెననే దీక్ష కను పిస్తున్నది.

ఉపన్యాసకుడు మంచినీరు త్రాగాడు. చేరుమాలుతో ముఖం తుడుచుకున్నాడు. రెండుమూడు నిమిషాలు విశ్రాంతి పుచ్చుకుని అతను మళ్ళీ ఇలా ప్రసంగించడం ప్రారంభించాడు:

"సోదరులారా! మిత్రులారా! మనమంతా ఐకమత్యంగా ఉండి మన హక్కుల కొరకు పోరాడవలసిన అవసరం ఉన్నది. కాని మన లోనే తోడేళ్ళలాంటి వ్యక్తులున్నారు! వీరి విషయంలో మనం జాగ్రత్త వహించాలి."

ఉపన్యాసకుడు ఈ వాక్యాన్ని పలికేసరికి శ్రోతలలో సందడి బయలుదేరింది. కొందరు గుసగుస లాడసాగారు.

ఈ క్లిష్టసమయంలో సభాధ్యక్షుడు తాను కల్పించుకుని ఉపన్యా సకుని కూర్చుండబెట్టి స్టీఫెన్‌నిపిల్చి మాట్లాడమని కోరాడు.

తరువాత శ్రోతలలో సద్దు మణిగింది. స్టీఫెన్ వేదికపైకి వచ్చి ఇలా మాట్లాడసాగాడు: "స్నేహితులారా! ఇప్పుడు ఉపన్యాసకుడు తోడేలువంటి వ్యక్తినని ఎత్తిపొడిచింది నన్నే, కాని నేను ఎలాటి వ్యక్తినో మీ అందరికీ తెలుసు" - అన్నాడు.

స్టీఫెన్ ఇలా అనేసరికి ఉపన్యాసకుడు ఉద్రిక్తుడై లేచి నిల్చుని, 'స్నేహితులారా! ఇతని మాటలను నమ్మకండి, ఇతని మాటలు నమ్మితే మీరు మీ తరువాత తరాలవారికి కూడా ద్రోహం చేసినవా రవుతారు' - అన్నాడు.

అందుకు జవాబుగా స్టీఫెన్ యిలా అన్నాడు : 'స్నేహితులారా! ఈ ఉపన్యాసకుడు వట్టి మోసగాడు, ఉపన్యాసాలతో ప్రజలని మభ్య పెట్టి మోసంచేయడం యితనొక వ్యాపారంగా పెట్టుకున్నాడు. ఇతని మాటలు నమ్మకండి. కాని నా మనవిని ఆలకించండి. మనం సమ్మెకట్ట డానికి యిది అదనుకాదు' - అన్నాడు స్టీఫెన్.

సభాధ్యక్షుడు స్టీఫెనును యిలా హెచ్చరించాడు : 'అబ్బాయ్, నీవు యీ సమ్మెదారు లందరికీ వ్యతిరేకంగా వున్నావు. వీరందరూ

నిన్ను ఒంటరివాణ్ణిచేసి తిరస్కరించవచ్చు. నీవు జాగ్రత్తగా ఆలోచించు' - అని.

సభాధ్యక్షుడు స్టీఫెనును ఇలా హెచ్చరించేసరికి సభికులు యావన్మందీ స్టీఫెన్ వంకదృష్టి సారించారు. వారి ముఖాలలో స్టీఫెన్ పట్ల ఒకవిధమైన ఏవగింపు స్పష్టంగా అగుపించింది.

"వ్యక్తిగత వాంఛలను సమిష్టివాంఛల కొరకు త్యజించాలి" - అని కేకలువేశారు సభికులు. సభాధ్యక్షుడు సభను అపుచేశాడు. ఆ తరువాత స్టీఫెన్ ఒంటరి జీవితాన్ని గడపవలసి వచ్చింది. తనకు అందరూ పరిచితులే. కాని అతను ఎవరితోనూ మాట్లాడడు. అందరూ అతన్ని అపరిచితుణ్ణి చూచినట్లుగా చూస్తారు.

అతను ఒంటరిగా అనేక సంవత్సరాలు కాలంగడిపాడు. ఎవరితోనూ హెచ్చుగా మాట్లాడేవాడు కాదు. మొదటిరోజులు అతనికి యుగాలవలె గడవసాగాయి. అతను రాషెల్‌ను కలుద్దామని అనుకునేవాడు. కాని రాషెల్‌ను కలుసుకోగలిగేవాడు కాదు. రాషెల్‌కూడా ఇతర కార్మికులవలనే తననుచూచి తొలిగిపోతుందేమోనని అతనికి భయమయ్యేది.

# 21

బౌండర్‌బై స్టీఫెనును ఇంటికి పిలవనంపాడు.

స్టీఫెను యింటికి రాగానే బౌండర్‌బై అతని యిలా ప్రశ్నించాడు ; "ఏమిటోయ్ స్టీఫెను - నిన్ను నీ తోటి కార్మికులంతా బహిష్కరించారట ? ఏమిటి విశేషం ? - బౌండర్‌బై అప్పుడు డ్రాయింగ్ రూములో కూచుని వున్నాడు. ఆయన, ఆయన భార్య, బావమరిది థామస్. లండన్‌నుంచి వచ్చిన మరోపెద్దమనిషి కూచుని టీ తాగుతూ ఉన్నారు. స్టీఫెన్ డ్రాయింగ్ రూములో ప్రవేశించగానే అందరికీ వినమ్రంగా నమస్కరించాడు.

బౌందర్ బై అడిగిన ప్రశ్నకు సమాధానంగా స్టీఫెన ఇలా అన్నాడు: "అయ్యగారూ - తమకు తెలియని విశేషాలేం వుంటాయి?- అని.

తరువాత బౌందర్‌బై లండన్‌నుంచి వచ్చిన పెద్దమనిషివైపు తిరిగి ఇలా అన్నాడు: "చూశావా మిస్టర్ జేమ్స్ - ఇంతకుముందు నీతో నేను ప్రస్తావించిన స్టీఫెన్ అనే వ్యక్తి ఇతడే. ఇతడు చాలా మంచివాడుసుమా. ఇతడు ఇంతకుముందు ఒకసారి నాదగ్గరకు వచ్చి ఉన్నాడు. అప్పుడు ఇతనికి నేను మంచిచెడ్డలన్నీ చెప్పాను. చెడు స్నేహాలు చెయ్యవద్దనీ, లేనిపోని సంబంధాలు పెట్టుకోవద్దనీ, అలా లేనిపోని సంబంధాలు పెట్టుకొనడంవల్ల ప్రమాదం రాకతప్పదనీ హెచ్చరించాను. కాని ఇతడు వింటేనా?" -

"తమరు చెప్పినమాట వాస్తవమే. కాని ప్రజానాయకులని పిలువబడే వారు ప్రజలను తప్పుదోవ పట్టిస్తున్నారు" - అన్నాడు స్టీఫెన్.

"విన్నావటయ్యా - పరిస్థితులు ఎలా పరిణమిస్తూ వున్నవో" - అన్నాడు బౌందర్ బై జేమ్స్‌తో.

తరువాత ఒకక్షణం ఆగి బౌందర్ బై ఇలా అన్నాడు: 'ఇంతకూ నాకు ఒక విషయాన్ని చెప్పు - నీవు ఆ కార్మికులందరితోనూ ఎందు చేత కలవలేదు? " -

"వాళ్ళ ధోరణికీ నా ధోరణికీ ఎంతో తేడాఉంది అయ్య గారూ" - అన్నాడు స్టీఫెన్.

"బాగా ఉంది. అయితే నీవు ఇప్పుడు ఇక్కడకు ఎందుకు వచ్చినట్టు?" - అని ప్రశ్నించాడు బౌందర్‌బై.

"తమరు పిలువనంపారు కాబట్టి వచ్చాను అయ్యగారూ. పెద్ద విశేషమేమీలేదు" - అన్నాడు స్టీఫెన్.

"సరేకాని, ఇంతకూ మీ పనివారంతా ఏమంటున్నారు?" - అడి గాడు బౌందర్‌బై.

స్టీఫెన్ అందుకు ఇలా జవాబు చెప్పాడు "అయ్యగారూ - పనివారు ఏమంటారు? వారి బాధలను వారు వెళ్ళబోసుకుంటారు. మా పరిస్థితులు దుర్భరంగా ఉన్నమాట వాస్తవమే అయ్యగారూ - ఇందులో అసత్యమేమీలేదు. ఈనగర చరిత్రను ఒకమారు తమరు పరిశీలించండి. ఈ నగరంతో ఎందరో శ్రీమంతులున్నారు.

ఈ శ్రీమంతులందరికీ మిల్లులున్నాయి. వీరు ఊళ్ళ ఊళ్ళనుంచి కార్మికులను తీసుకువచ్చి తమ ఫ్యాక్టరీలలో పనికి పెట్టుకున్నారు. కాని వారు తమ జీవితాలను ఎలా వెళ్ళదీస్తూ ఉన్నారో ఒక్కమారు తమరు గమనించండి. క్షణక్షణం జీవన్మరణాల మధ్య ఊగిసలాడుతూ వారు తమ బ్రతుకులను వెళ్ళదీస్తున్నారు" - అన్నాడు స్టీఫెన్.

# 22

స్టీఫెన్ బౌందర్‌బై మహాశయునితో సంభాషించి వీధిలో అడుగు పెట్టేసరికి బాగా చీకటిపడింది. చీకటినీడలు అన్ని దిక్కుల నుంచి కమ్ముకుంటూ వచ్చాయి. స్టీఫెన్ మెల్లగా వీధిలో నడవసాగాడు. కొంతదూరం నడిచిన తరువాత స్టీఫెను వెనుక అడుగులచప్పుడు విని పించింది. స్టీఫెను వెనుకకుదిరిగి చూచాడు. అతనికి రాషెల్ కనిపిం చింది. రాషెల్ ప్రక్కనే మరోవృద్ధస్త్రీ కూడా ఉన్నది.

స్టీఫెను తొలిగా రాషెల్‌ను చూచాడు.

"రాషెల్ - నువ్వా వస్తున్నావా?" - అని అన్నాడు స్టీఫెను.

"నేనూ ఉన్నాను. నన్ను నీవు గుర్తించలేదేమో? - అన్నది వృద్ధస్త్రీ.

"రాషెల్‌వెంట నీవూ ఎలా వస్తున్నావు? - అని ప్రశ్నించాడు స్టీఫెన్.

"నిన్ను నేను ఎరిగివున్నట్లుగానే ఈ అమ్మాయిని కూడా నేను ఎరిగి ఉన్నాను. నాకు శరీరంలో అంత స్వస్థతగా లేనందువల్ల నేను

ఇక్కడికి రావడం కొంచెం ఆలస్యమైంది. అందుకనే ఒక్కపట్టున ప్రయాణం చెయ్యలేకపోయాను. మధ్యలో మజిలీ చెయ్యవలసివచ్చింది. సరేకాని - చెప్పవూ - బౌందర్‌బై వివాహం చేసుకున్నారుటకదా? నేను వార్తాపత్రికలో చదివాను. నేను ఆయన భార్యను ఒకమాటు వెళ్ళి చూచివద్దామని అనుకుంటున్నాను. ఇంతవరకు ఆవిడను నేను ఎన్నడూ చూచి వుండలేదు" - అన్నది వృద్ధురాలు.

ఆ వృద్ధురాలిని చూచినప్పుడు ఎందుచేతనో కాని స్టీఫెనుకు ఒకవిధమైన ఏవగింపు కలిగింది.

ఆ ఏవగింపును బైటికి కనుపించనీకుండా వుండడానికి అతను ఎంతో యత్నించాడు.

"బౌందర్‌బై భార్యను నీవు చూడలేదేమో కాని నేను చూచాను. ఆవిడ ఎంతో అందంగా ఉంటుంది. పైగా ఆవిడ వయసులో ఉన్న పిల్లకూడా" - అన్నాడు స్టీఫెను.

"కుర్రది అందమైనది. అయితే అచ్చంగా రోజా పూవన్న మాట! బౌందర్‌బై ఎంత అదృష్టవంతుడు!" - అన్నది వృద్ధురాలు.

"అవును" - అన్నాడు స్టీఫెను.

"బౌందర్‌బై మీ యజమాని కదూ? - అని అడిగింది వృద్ధురాలు.

"ఒకప్పుడు" - అన్నాడు స్టీఫెను.

"అయితే. ఇప్పుడు నీవు ఆయనవద్ద కొలువు చెయ్యడంలేదా? - అని అడిగింది రాషెల్ ఆతురతతో.

"నేను ఆయన కొలువును వదిలిపెట్టానో లేక ఆయన కొలువే నన్ను వదిలిందో నేను చెప్పలేనుకాని మొత్తంమీద ప్రస్తుతానికి నేను ఆయన కొలువులో లేను" - అన్నాడు స్టీఫెను.

"అయితే, ఇకముందు ఏంచెయ్య నున్నావు?" - అని అడిగింది రాషెల్.

"ఎక్కడికో వెళ్ళాలి. కొత్త జీవితాన్ని ప్రారంభించాలి" - అన్నాడు స్టీఫెను.

"ఎక్కడికి వెడతావు?" - అని ప్రశ్నించింది రాషెల్.

"ఎక్కడికని అడిగితే నేనేం చెప్పగలను? దోవ ఎక్కడికి తీసుకునిపోతే అక్కడికి పోతాను. కాని నాకు ఒక విశ్వాసం మాత్రం ఉన్నది. నేను వెళ్ళేచోట ఇంతకన్న ఆర్ద్ర హృదయులు ఉంటారు" - అన్నాడు స్టీఫెను.

ఆ తరువాత ముగ్గురూ కలిసి స్టీఫెను ఇంటివైపుకు నడవసాగారు. ఇల్లుదాపుకు వచ్చేసరికి స్టీఫెను గుండె దడదడమని కొట్టుకోసాగింది. స్టీఫెను ఇంటి కిటికీవైపు చూచాడు. ఆఇంటి కిటికీని చూచినప్పుడల్లా ఎంచాతనోకాని స్టీఫెనుకు విపరీతమైన భయం కలిగేది. స్టీఫెను ఇంట్లో ప్రవేశించాడు. అతని వెనుకనే రాషెల్, వృద్ధురాలుకూడా ఇంటిలో ప్రవేశించారు. ఇల్లు ఖాళీగా ఉంది. ఇంట్లో ఎవరూలేరు. కొన్నినెలల క్రితమే స్టీఫెను భార్య ఎక్కడికో వెళ్ళిపోయింది, ఆవిడజాడ ఇంత వరకూ తెలియలేదు.

స్టీఫెను కొవ్వొత్తిని వెలిగించి బల్లపై ఉంచాడు. క్రిందికివెళ్ళి వేడివీరు, తేయాకు చక్కెర, వెన్న, రొట్టె దగ్గరేఉన్న ఒక దుకాణంలో కొనుక్కునివచ్చాడు రొట్టె, వెన్న - తాజాగా ఉన్నాయి. రాషెల్ టీ తయారు చేసింది. ముగ్గురూ ఆ కొద్దిపాటి విందును ఎంతో ఆప్యాయంగా ఆరగించారు.

"ఇంతకూ మీ పేరు అడగడం మరిచాను" - అన్నాడు స్టీఫెను వృద్ధురాలితో.

"నాపేరు పెగ్లర్" - అన్నది వృద్ధురాలు.

"మీ భర్తగారు వున్నారా :" - అన్నాడు స్టీఫెను సంశయిస్తూ.

"అయ్యోరామ ! ఆయన నీవు పుట్టకముందే కన్ను మూశారు నాయనా" - అన్నది ఆ వృద్ధురాలు.

"పిల్లలున్నారా ?" - ప్రశ్నించాడు స్టీఫెను.

స్టీఫెను ఇలా ప్రశ్నించేసరికి వృద్ధురాలి కండ్లు కొంచెం చెమ్మగిలాయి.

"అవ్వకి పిల్లలున్నారు. కాని ఇప్పుడు లేరు. చనిపోయారు" - అన్నది రాషెల్ మెల్లగా.

"అయ్యో! అనవసరంగా పిల్లల ప్రస్తావన తీసుకునివచ్చి అవ్వ మనస్సు నొప్పించాను" - అన్నాడు స్టిపెను.

ఆ తరువాత అవ్వ స్టిపెనువైపు తిరిగి ఇలా చెప్పసాగింది : "నాయనా నాకు ఒక కొడుకు ఉండేవాడు. బంగారంలాంటిబిడ్డ. కాని ఇప్పుడులేడు - చనిపోయాడు."

ఈ లోపున ఇంటి యజమానురాలు రొప్పుతూ మెడమెట్లెక్కి వచ్చి స్టిపెనును తలుపుదగ్గరకు పిలిచి అతని చెవిలో ఏదో చెప్పింది. వృద్ధురాలు చెవిటిదికాదు. అందుచేత ఆమాట వృద్ధురాలి చెవిన పడింది. వెంటనే ఆ వృద్ధురాలు 'అమ్మబాబోయ్ -! బౌందర్‌బై వస్తున్నారా? నన్ను ఎక్కడైనా దాచండి. నన్ను ఆయనకంట పడనివ్వకండి" - అని స్టిపెనును రాషెల్ బ్రతిమాలుకోసాగింది.

"బౌందర్‌బై కాదమ్మా వస్తున్నది. బౌందర్‌బై భార్య లూసా" - అన్నాడు స్టిపెను.

"అమ్మయ్య! అయితే పరవాలేదులే నాయనా. నేను ఇక్కడే ఉంటాను. నా ప్రాణం కుదుటపడ్డది" - అన్నది వృద్ధురాలు.

వృద్ధురాలు భయపడడానికి కారణం చెబుతుందేమోనని స్టిపెను ఒకమాటు రాషెల్‌వైపు చూచాడు. కాని రాషెల్ అతనికేమీ చెప్పలేదు. అంచేత స్టిపెను కొవ్వొత్తిని తీసుకుని మేడమెట్లుదిగి క్రిందికివెళ్ళాడు కొద్ది క్షణాలతరువాత స్టిపెను లూసాను తీసుకుని ఆవిడకుదోవచూపుతూ మేడమీదకు వచ్చాడు. లూసా ప్రక్కనే థామస్‌కూడా ఉన్నాడు.

లూసా గదిలో అడుగుపెట్టగానే రాషెల్ లేచి నిల్చున్నది.

ఇంతరాత్రివేళ తన యజమానిభార్య తన ఇంటికి రావడం స్టిపెనుకు కూడా ఆశ్చర్యాన్ని కలిగించకపోలేదు. అతను కొవ్వొత్తిని బల్లపై ఉంచి ఒకమూలన చేతులు కట్టుకుని నిల్చున్నాడు.

లూసా కార్మికులవాడలో అడుగుపెట్టడం ఇదే తొలిసారి. కోక్‌టౌన్ నగరంలో కొన్ని వేలాదిమంది కార్మికులు నివసిస్తూఉన్నారన్న విషయం లూసాకు తెలుసు. కాని వారితో ఎన్నడూ ఆమెకు ప్రత్యక్ష పరిచయంలేదు. ప్రతినిత్యం ఉదయాన్నే ఫ్యాక్టరీలకు బారులుతీరి నడిచి

వెళ్ళే కార్మికులను తలచుకున్నప్పుడల్లా ఆవిడకు చీమలబారు జ్ఞాపకానికి వచ్చేది.

లూసా గదిలో అడుగుపెట్టి రెండుమూడు నిమిషాలు గదినంతా పరిశీలించింది. ఆ తరువాత స్టిపెనువైపు తిరిగి ఇలా అన్నది: ఇప్పుడే జరిగిన ఒక విషయాన్ని పురస్కరించుకుని నీతో మాట్లాడవలసి వచ్చాను. ఈవిడ నీభార్యా?" - అని అన్నది రాషెల్‌ను సూచిస్తూ.

రాషెల్ తాను స్టిపెనుభార్య కానన్నట్లు ఒకమాటు లూసావైపు చూచి మళ్ళీ దృష్టిని అధోనతం చేసుకున్నది.

"అయ్యో ఎంత పొరపాటుపడ్డాడు! ఇప్పుడు నాకు జ్ఞాపకం వస్తున్నది. నీ సంసార విషయాలు కొన్ని మావారు చెబుతూ ఉండగా విన్నాను. కాని వివరాలు నేను కనుక్కోలేదు. మీ మనస్సుకు అనవసరంగా కష్టం కలిగించాను - క్షమించాలి" - అన్నది లూసా.

లూసా ఇలా అనప్పుడు ఆమె కంఠస్వరంలో ఒకవిధమైన సానుభూతి ద్యోతకమైంది.

"స్టిపెనుకూ నా భర్తకూ మధ్య జరిగిన విషయాలను నాభర్త నాకు చెప్పారు" - అన్నది లూసా.

"నేనూ విన్నానమ్మా" - అన్నది రాషెల్.

"ఒక యజమానిచే త్రోసివెయ్యబడిన కార్మికుణ్ణి ఇతర యజమానులెవరూ పరిగ్రహించరు. ఇది సామాన్యధర్మం. స్టిపెను చెడు పేరు తెచ్చుకొన్నాడు" - అన్నది లూసా.

"అంటే మీ అభిప్రాయం ఏమిటి అమ్మగారూ!" - అని అడిగింది లూసా.

"అతను కొన్ని గొడవలు లేవదీస్తాడనే చెడుపేరు వచ్చింది" - అన్నది లూసా.

స్టిపెను గతి రెంటికీ చెడిన రేవడి గతివలె అయింది. అటు యజమానులూ ఇతన్ని దూరం చేశారు.

ఇటు తనవారైన కార్మికులూ ఇతన్ని దూరంచేశారు. నిజాయితీ నీతీ ఉన్న కార్మికునికి ఈ కోక్‌టౌను నగరంలో విలవనీడ వుండదనుకుంటాము" - అన్నది రాషెల్.

లూసా సానుభూతిపూర్వకంగా తల వంకించింది.

"తనతోటి కార్మికుల ఆ విశ్వాసానికి అనుమానానికి గురి అయి నాడు స్టిపెను వారిలో ఒకడుగా ఉండడానికి తాను అంగీకరించలేదు" - అన్నది లూసా.

రాషెల్ వెక్కి-వెక్కి ఏడుస్తూ ఇలా చెప్పసాగింది. "స్టిపెను పట్టి అమాయకుడమ్మా. నేను చెబుతూనే ఉన్నాను - లేనిపోని కష్టాలను తెచ్చుకోవద్దని కాని ఒకమాట అన్నాడంటే ఆమాటను నిలబెట్టుకోడానికి స్టిపెను ఒక వంద మృత్యువులనైనా ఎదుర్కోడానికి సిద్ధంగా ఉంటాడు" - అన్నది రాషెల్.

రాషెల్, లూసా, ఇలా మాట్లాడుతూ వున్నప్పుడు స్టిపెను గడ్డం క్రింద చెయ్యి వుంచుకుని తనమామూలు ధోరణిలో ఆలోచిస్తూ కూచుని ఉన్నాడు.

వారువారి అభిప్రాయాలను చెప్పిన తదుపరి స్టిపెను నిశ్చితకంఠ స్వరంతో ఇలా అన్నాడు.

"రాషెల్ పట్ల నాకు ఎంత ప్రేమ, ఎంతఆదరం, ఎంత విశ్వాసం వున్నవో నాకు ఒక్కడికే తెలుసు.

లూసా ఒకక్షణం మౌనంగాఉండి స్టిపెన్‌ను ఇలా ప్రశ్నించింది.

"అయితే ఇహముందు నీవు ఏంచేయ దలిచావు స్టిపెను" - అని.

"ఇక్కడ పూర్తిగా చేతులు కడుక్కున్న తరువాత ఏదైనా దేశం వెడదామని అనుకుంటున్నాను అమ్మగారూ. సుఖమో దుఃఖమో-మనిషి తన అదృష్ట దురదృష్టాలను తానే వెదుక్కుంటూవెళ్ళాలి" - అన్నాడు స్టిపెను.

"మరి డబ్బులేదుకదా? ప్రయాణం ఎలా చేస్తావు స్టిపెనుః" అని అడిగింది లూసా.

"కాసులు లేకపోవచ్చుకాని కాళ్ళున్నాయికదా అమ్మగారూ. కాళ్ళు ఎక్కడికి లాక్కునిపోతే అక్కడికి వెడతాను" - అన్నాడు స్టిపెను.

లూసా ముఖం లజ్జారుణరంజిత మైంది. ఆవిడ తన గౌను జేబులోనుంచి ఒక పర్సును బైటికి తీసింది. ఆ పర్సులోనుంచి ఒక నోటును తీసి మెల్లిగా బల్లపైఉంచి రాషెల్ వైపు తిరిగి ఇలా అన్నది.

"రాషెల్, నాకు చేతనైన సాయం నేను చేస్తున్నాను. స్టెపెను ఈనోటు దయతో పరిగ్రహించమని చెప్పు" - అన్నది లూసా.

"అమ్మగారూ - స్టెపెను తన మంచిచెడ్డలను తన కర్తవ్య అకర్తవ్యాలను తానే నిర్ణయించుకునే స్వభావంగల వ్యక్తి" - అన్నది రాషెల్.

లూసా కళ్ళలో ఒక విధమైన సానుభూతి, అనుకంప, భీతి, ఆశ్చర్యం తొణికిసలాడినవి.

అమ్మగారూ - తమరు ఇంత దయతో నాకు సాయంచెయ్యడానికి సిద్ధపడినప్పుడు నేను మీసాయాన్ని నిరాకరించడం నన్ను నేను అగౌరవించుకోడమే అవుతుంది.

అందుచేత తమరు ఇచ్చిన డబ్బును అప్పుగామాత్రమే స్వీకరిస్తాను. నేను ఏదేశమైనా వెళ్ళవచ్చు. ఎక్కడైనా వుండవచ్చు. రెక్కల కష్టంచేసి మీరుణం తీర్చుకొంటాను" - అన్నాడు స్టిఫెను.

తరువాత లూసా థామస్ వైపు తిరిగి ఇలా అన్నది. 'అబ్బాయ్ మనంవచ్చి చాలాసేపైనట్టుగా ఉంది. ఇక వెడదామా ?" - అని.

"ఒక్కనిమిషం వుండక్కయ్యా. నేను స్టిపెనుతో మాట్లాడాలి"- అన్నాడు థామస్.

తరువాత స్టిపెను, థామసు ప్రక్కనున్నగదిలోకి వెళ్ళారు. థామసు స్టీపెనుతో అంతరంగికంగా ఇలా అన్నాడు.

"అబ్బాయ్ ! నీకొక సాయం చేయదలచుకున్నాను. ఆ సాయం ఏమిటని అడగకు. ఇంతకూ నీవు ఈ ఊరినుంచి ఎప్పుడు వెళ్ళ మన్నావో చెప్పు" - అని అడిగాడు థామసు.

"ఈ రోజు సోమవారం, నేను శుక్రవారంనాడుకాని శనివారం నాడు రాత్రికాని ప్రయాణం కడతాను" - అన్నాడు స్టిపెను.

"సరే, కాని ఒకమాట చెబుతానువిను: నీవు ఒకరోజున మిల్లులో పని ముగించుకుని ఇంటికి వెళ్ళబోయేముందు మా ఖజానా వైపురా - చూడు - జ్ఞాపకం ఉంటుందికదా?" - అన్నాడు థామసు.

"చిత్తం" - అన్నాడు స్టిపెను.

తరువాత థామసు గది తలుపు తెరచుకుని బైటికివచ్చి 'ఇకరా అక్కయ్యా వెడదాం" - అంటూ చకచకమని మెట్లుదిగి వెళ్లాడు. అతని వెంటనే స్టిపెను లాంతరు చూపుతూఉండగా లూసా కూడా మేడ మెట్లు దిగి వెళ్ళింది.

వారు వెళ్ళిపోయేవరకూ వృద్ధురాలు పెగ్లర్ అక్కడే ఒక మూలన నిశ్శబ్దంగా కూచుని ఉన్నది.

స్టిపెను లూసాను థామసును వీధిలో వదలిపెట్టి లాంతరు తీసుకుని మళ్ళీ మేడమీదకు వచ్చాడు. వృద్ధులైన స్త్రీలకు గుణవతులైన యువతులను చూచినప్పుడు ఒకవిధమైన సానుభూతి, జాలికలగడం సహజం. ఆవిధంగానే వృద్ధురాలైన పెగ్లర్‌కు లూసాను చూచినప్పుడు సానుభూతి. జాలీ కలిగాయి. పెగ్లర్ సహజంగా ఉద్వేగస్వభావంగల స్త్రీ కాబట్టి వెక్కివెక్కి ఏడవసాగింది. ఆవిడ కన్నీటికి కారణం దుఃఖంకాదు ఆనందమే. స్టిపెను రాషెల్ వృద్ధురాలిని ఓదార్చాడు.

తరువాత కొంతసేపటికి స్టిపెను. పెగ్లర్‌ను రాషెల్‌ను ఇంటికి సాగనంపడానికి వీధిలోకి వచ్చాడు. రాషెల్ ఇంటివరకూ వారిని సాగనంపాడు. ఇంటిదగ్గరకు చేరగానే రాషెల్, స్టిపెను ఒకరివైపు ఒకరు మౌనంగా చూచుకున్నారు.

"రాషెల్, వెళ్ళబోయే ముందు మళ్ళీ ఒకమాటు నీకు కనపిస్తాను" - అన్నాడు స్టిపెను.

"అలా అంటావుకాని, నిజంగా నీవు కనుపించవు స్టిపెను. నాకు తెలుసు. కనుక ఇప్పుడు మనం మన మనస్సులలోఉన్న విషయాలను దాచుకోకుండా మాట్లాడుకోడం వుచితం" - అన్నది రాషెల్.

"అలా కాదు రాషెల్. తప్పక కలుస్తాను'' - అన్నాడు స్టిపెను.

స్టిపెను రాషెల్‌ను ఇంట్లోవదిలి మళ్ళీ గృహాభిముఖుడైనాడు.

స్టిపెను మళ్ళీ ఇల్లుచేరాడు. ఆరాత్రంతా అతనికి సరిగా నిద్ర పట్టలేదు. ఏవేవో ఆలోచనలతో తెల్లవారి పోయింది.

స్టిపెను ఆరోజు కూడా పనిలోకి వెళ్లాడు. కాని మూడోనాడు మాత్రం స్టిపెను పనిచేసే మరమగ్గం ఖాళీగా ఉన్నది. స్టిపెను అక్కడ లేడు.

థామసుకు మాట ఇచ్చిన ప్రకారం స్టిపెను ఖజానా దగ్గరకు వెళ్ళాడు.

స్టిఫెను ఖజానావద్దకు వెళ్ళేవరకే కాని అతనికి థామసు కనుపించ లేదు. ఒకటి రెండురోజులు వరసనే స్టిపెను ఖజానావద్దకు వెళ్ళాడు. ఈ రెండురోజులు కూడా అతనికి థామసు కనుపించలేదు. మూడో రోజు, థామసును చూచితీరవలెనని నిశ్చయంతో స్టిపెను ఖజానావద్దకు వెళ్ళాడు. రెండుగంటలసేపు ఖజానా వాకిట్లో కనిపెట్టుకుని ఉన్నాడు.

శ్రీమతి స్వార్సిత్ ఖజానా ముందుగదిలో కూచుని ఉన్నది, కిటికీలోనుంచి ఆవిడముఖం స్టిపెనుకు కనుపించింది.

స్టిపెను ఖజానా వాకిట్లో కూచుని ఉండడం ఖజానా సేవకుడు చూచాడు. కాని అతడు స్టిపెనును పట్టించుకోలేదు.

రెండు గంటలసేపు ఒక మనిషికోసం కాచుకుని ఉండడమంటే సామాన్యమైన పనికాదు. అదీగాక, స్టిపెను పగలంతా పనిచేసి బాగా బడలి ఉన్నాడు. స్టిపెనుకు ఏంచేయలో తోచలేదు. కాసేపు వాకిటి తలుపుకు చేరగిలబడి కూచున్నాడు. మరికొంతసేపు అటూ ఇటూ పచార్లు చేశాడు, మరికొంతసేపు వీధిలోకివచ్చి, ఆటలాడుకుంటున్న పిల్లలను చూడసాగాడు.

ఎవరు ఏపనిచేస్తున్నా ఆపని చెయ్యడంలో ఏదో ఒక ఉద్దేశం వుండితీరుతుంది. ఏ వుద్దేశమూ లేకుండా మనిషి ఒకపని చెయ్యడు. ఒకగంటసేపు గడిపిన తరువాత స్టిపెనుకు చిరాకు ఎక్కువైంది. తన మీద తనకే అసహ్యత కలిగింది.

చీకటిపడింది. లాంతర్లు వెలిగించేవాడు వచ్చి లాంతర్లు వెలిగించాడు. వీధి లాంతర్ల బారు తళుక్కు మన్నది. శ్రీమతి స్వార్సిత్ ముందు గది కిటికీలను మూసి మేడమీదకు వెళ్ళింది. ఆవిడ వెనకాలే

మరోవ్యక్తి లాంతరు తీసుకొని మేడమీదకు వెళ్ళాడు. స్టెపెను ఇంకా అక్కడే కాచుకునే ఉన్నాడు. కాని ఎవరూ అతన్ని పలకరించిన జాడ కనుపించలేదు. రెండుగంటలూ గడిపి స్టెపెను మళ్ళీ ఇంటిదోవ పట్టాడు.

తెల్లవారితే అతను ఈఊరు వదిలి వెళ్ళనున్నాడు. తన బట్టలన్నీ మూటకట్టుకున్నాడు. అందుచేత స్టెపెను ఆరాత్రి వచ్చినేలపైనే పవళించవలసి వచ్చింది. తెల్లవారిన తరువాత అతను తన ఇంటి యజమానురాలివద్ద సెలవు తీసుకుని వెళ్ళాలి.

తెల్లవారవస్తూ ఉన్నది. స్టెపెను నిద్రలేచాడు. ఒకమాటు తన గదిని నలువైపులా కలయచూచాడు. ఇక మళ్ళీ ఎన్నడూ తన జీవితంలో ఈ గదిని చూడలేడు. ఈ భావం తలపుకు రాగానే స్టెపెను కండ్లలో నీళ్ళు తిరిగాయి. స్టెపెను యజమానురాలివద్ద సెలవు పుచ్చుకోవాలని అనుకున్నాడు. కాని ఆవిడ ఇంకా నిద్రపోతూనే ఉన్నది.

ఒకమాటు గదిని మళ్ళీచూచి, వీడిపోలేక స్టెపెను మెల్లగా బైటికి వచ్చాడు.

స్టెపెను వీధిలో అడుగుపెట్టేసరికి తెల్లవారింది. కాని వీధిలో మనుష్యు లెవరూలేరు. నగరం ఇంకా నిద్రిస్తూనే ఉన్నది. వీధులు శూన్యంగా ఉన్నాయి. పౌరులందరూ ఇళ్ళూ వాకిళ్ళూ వదిలి దేశాంతరం తరలిపోతే నగరం ఎలాఉంటుందో అలా ఉన్నది నగరం. ఉదయసూర్యుని ఆరణాలు ఆకాశాన్ని తెల్లని సాగరం కనుపించేలా చేస్తున్నవి.

స్టెపెను నడవసాగాడు. రాషెల్ ఇల్లు దాటాడు, మిల్లులున్న పేటను దాటాడు. రైల్వేస్టేషను దాటాడు. చివరకు కొండగుట్ట వద్దకుచేరి, గుట్ట నెక్కి ఒకమాటు వెనుదిరిగి నగరంవంక చూచాడు.

అప్పటికి సూర్యోదయం పూర్తిగా అయింది. నగర చర్చిలలో గంటలు మ్రోగుతున్నాయి. నగరం కాంతివంతంగా కనుపిస్తోంది. ఫ్యాక్టరీ గొట్టాలనుంచి మెల్లగా పొగ తీగలాగా సాగివస్తోంది.

స్టెపెను మళ్ళీ నడక సాగించాడు ఆచున ఈ ఫాక్టరీలకు - ఈ నగర సందుల వాతావరణానికి దూరంగా వెడుతున్నాడు. ఇన్నాళ్ళూ

ఈ నగరంలోనే బ్రతికాడు. కాని ఈనాడు అతని జీవితంలో మరో తొలిరోజు. అతను ఈ నగరానికి దూరంగా ఎక్కడికో ప్రకృతిలోకి సాగిపోతున్నాడు.

రోడ్డుకు ఇరువైపులా చెట్లు ఆర్చీలుకట్టి అతనికి శీతలఛాయను ఇస్తున్నాయి. అతను నగరాన్ని విడిచివెడుతున్నా, అతడు తన కోమల హృదయాన్నిమాత్రం నగరంలో విడిచి వెడుతున్నాడని గుసగుస లాడుతూ ఉన్నట్లుగా ఉంది. చెట్ల ఆకులచప్పుడు.

# 23

జేమ్సు శుశ్రూష అద్భుతంగా సాగిపోతున్నది. రాజకీయ మహర్షుల చరణ సాన్నిధ్యంలో అతను అనేక నూతన విషయాలను నేర్చుకున్నాడు.

ఒకరోజున జేమ్సు లూసాతో యిలా అన్నాడు: 'తమలో తమకు విశ్వాసం లేనివారిని మనం కూడా విశ్వసించలేము. మనకూ వేదాంతులమని గొప్పలు చెప్పుకునేవారికీ ఒకే ఒక తేడా వున్నది. వారు చెప్పేదంతా శుద్ధ అబద్ధమని మనకు తెలుసు. ఆ విషయాన్ని మనం బాహాటంగా చెప్పగలం. కాని వారు చెప్పేదంతా కేవలం అసత్యము. వారికి తెలిసినా, వారు ఆ విషయాన్ని బాహాటంగా చెప్పరు'—

జేమ్సు ఇలా అనేసరికి లూసా చకితురాలైంది. అతను ఇలా అనడంలో అతని ఉద్దేశమేమిటో ఆవిడకు బోధపడలేదు. తనకు ఆశ్చర్యం కలగడం, తనకే ఆశ్చర్యము అనిపించింది. తను ఇంత వరకూ ఏవిషయానికీ ఆశ్చర్యపడి ఎరుగదు. తనతండ్రి, లూసాను శైశవంనుంచి ఆవిధంగా పెంచాడు.

ఆవిడ మనస్సు కల్లోలితం కాసాగింది. తండ్రి తనను ఆవిధంగా పెంచినప్పటికి, లూసా మనస్సులో అంతరాంతరాలలో అనేక సంగతులు విగూఢంగా విద్రాణస్థితిలో లేకపోలేదు. విశాలమైన మానవ

త్వంలో నమ్మకం ఉంచడమా లేదా అన్న సమస్య ఆవిడను ఎప్పుడూ బాధిస్తూనే ఉన్నది. అనేక సంశయాలతో ఆవిడ యౌవనదశ గడిచి పోయింది. ఈ సమస్య అపరిష్కృతంగానే ఆమె మనస్సులో నిలిచి పోయింది. ఈనాడు జేమ్స్ పైమాటలను అన్నప్పుడు ఆవిడ మన స్సులో మళ్ళా ఆసమస్య తల ఎత్తింది. తను తన జీవితాన్ని ఒక మాటు సింహావలోకనం చేసుకోవలసిన అవసరం ఏర్పడింది. అనేక సంశయాలవల్లను, తీవ్రమైన ఆత్మనిగ్రహంవల్లను కుంచిం చుకుని పోయే ఆమె హృదయానికి జేమ్స్ పలుకులు శీతల వర్షబిందు వులవలె సోకి ఆవిడ సహృదయాన్ని చల్లబరిచాయి. ఆవిడ అంత ర్ముఖురాలై తన జీవితాన్ని తానే వ్యాఖ్యానించుకో సాగింది. ఎందు లోనూ ఏమీలేదు. అంతా వృథా. జీవితంలో సంఘటనలంటూ ఏమీ లేవు. కాని విచారించవలసిన అగత్యంలేదు. కోలుపోయింది ఏదీ లేదు. తండ్రి తనను ఒక వరుణ్ణి వివాహం చేసుకోమని కోరినప్పుడు 'పోనీలే నాన్నా, అలాగే' అన్నది. ఇప్పటికీ ఆవిడ అదేమాటను మంత్రాన్ని పునశ్చరణ చేశినట్లుగా చేస్తున్నది. ఈమాటే ఆవిడ జీవితనాటకాన్ని సూత్రధారి నడిపినట్లుగా నడుపుతున్నది.

ఈ జీవితం ఎటువెళుతున్నది? ఏమో. ఎవరికి తెలుసు? అయినా జీవితంమటుకు సాగిపోతూనే ఉన్నది. ఒకొక్కసారి జీవన స్రవంతి ఊర్ధ్వముఖంగా ప్రవహిస్తుంది. మరొకసారి అధోముఖంగా ప్రవహిస్తుంది. జీవన స్రవంతి సాగిపోతూవున్నా, తానుమటుకు వున్నచోటనే ఉన్నది. తనలో మార్పేమీలేదు. తను నిశ్చలంగా ఉన్నది.

లూసా జేమ్సునుగురించి ఆలోచించసాగింది. అతడు చాలా విచిత్రమైనవ్యక్తి. దేనికీ లెక్కచెయ్యడు. అతనికి జీవితంలో ఒక ప్రత్యేక పథకమేమీ వున్నట్లు కనుపించదు. జీవితం ఎటు లాక్కుని పోతే అటుపోతాడు.

అతడు ఇక్కడికి రాగానే తన అన్నగారికి ఒకలేఖవ్రాశాడు. ఆ లేఖలో బౌందర్‌బైల కుటుంబాన్నిగురించి తన అభిప్రాయాలను వెలువరించాడు. అతడు లేఖలో ఇలా వ్రాశాడు: "బౌందర్‌బై దంప

తులు చాలా విచిత్రమైన వ్యక్తులు. శ్రీమతి బౌందర్‌బై వృద్ధురాలని అనుకున్నాను. కాని ఆవిడ యువతి. సౌందర్యవతి, ఉత్సాహవతి"- జేమ్సు, తనకు తీరికైనప్పుడల్లా, బౌందర్‌బై గృహానికి వెళ్ళి కాల క్షేపం చేసేవాడు. బౌందర్‌బై దంపతులలో అనేక విషయాలను చర్చించేవాడు. బౌందర్‌బై కూడా జేమ్సును ఎంతో అభిమానించేవాడు. లూసా గంభీరతమాత్రం జేమ్సును ఆశ్చర్యచకితుణ్ణి చేసేది- శిలాతుల్యమైన ఆవిడముఖం ఒక్క తన తమ్ముని సమక్షంలో మాత్రమే చలించేది.

లూసాను గురించి ఆమె తమ్ముడు థామస్ చెప్పిన విషయాలన్నీ జేమ్సు మనఃఫలకంలో ముద్ర వేసినట్లుగా జ్ఞాపకం వున్నవి. అతడు చెప్పిన మాటలతో అతడు లూసాను పోల్చుకోసాగాడు. ఆవిడను పరిశీలించసాగాడు.

బౌందర్‌బై నగరానికి 15 మైళ్ళ దూరంలో కొత్తగా ఒక యిల్లు కొన్నాడు. ఆ యిల్లు రైలు స్టేషనుకు ఒకటి రెండు మైళ్ళ దాపులో ఉన్నది. ఇంటికి చుట్టూ సుందరమైన ప్రకృతి. ఇంటి పెరట్లో బౌందర్‌బై కూరపాదులను పెంచాడు. ఇంట్లో చక్కని ఫర్నిచర్‌ను ఏర్పాటుజేశాడు, గోడలకు చక్కని చిత్రపటాలను అలంకరించాడు, అవి తన స్వంతచిత్రాలు. ఇల్లు చూడడానికి ఎవరైనా అతిథి వచ్చినప్పుడు ఆ అతిథితో బౌందర్‌బై యిలా అనేవాడు : 'చూశారండి. నా తరహా అంతేకాదు. ఇంతకుపూర్వం యీ యింటి యజమాని బోలెడంత డబ్బు తగలేసి చిత్రపటాలను కొని యింట్లో అలంకరించేవాడు; కాని నేనుమాత్రం చిత్రపటాలను కొనడానికి ఒక్క దమ్మిడీ కూడా ఖర్చు చెయ్యను. నేను యిప్పుడు యీ గోడలకు తగిలించిన చిత్రపటాలన్నీ నేను వూరికే సంపాదించినవే.' తరువాత అక్కడే వున్న జేమ్సువైపు తిరిగి బౌందర్‌బై యిలా అనేవాడు :

"అబ్బాయ్, జేమ్సు నీవద్ద రెండుగుర్రాలు ఉన్నవికదూ? ఆ గుర్రాలను రెంటినీ ఇక్కడకి తీసుకురా. ఈ ఇంటి పెరట్లో గుర్రపుశాలలు రెండున్నాయి. ఆ గుర్రపుశాలల్లో ఎన్ని గుర్రాలనైనా కట్టివేయవచ్చు - అన్నాడు బౌందర్‌బై.

బౌందర్‌బై ఈ విధంగా తనగృహ వైభవాన్ని గురించి వివరింప సాగాడు.

తరువాత ఒకనాడు జేమ్సు శ్రీమతి బౌందర్‌బైతో ఇలా అన్నాడు : మిమ్మల్ని ఇప్పుడు ఇక్కడ కలుసుకొన గలగడం నిజంగా నా భాగ్యమనే చెప్పాలి. కొంతకాలంనుండి మీతో మాట్లాడాలని అభిలషిస్తున్నాను" - అన్నాడు.

జేమ్సు ఇలా అన్నప్పుడు లూసా ఒంటరిగా తోటలో కూచుని ఉన్నది. చెట్లపంచి ఆకులురాలుతూ ఉన్నాయి. లూసా రాలుతూఉన్న జీర్ణపర్ణాలను పరిశీలిస్తూ కూచుని ఉన్నది.

జేమ్సువచ్చి లూసా ప్రక్కన మరో కుర్చీలో కూచున్నాడు. ఒక మాటు ఆవిడ ముఖంవైపు చూచాడు.

"మీ తమ్ముడు టామ్ -" - అంటూ సంభాషణ ప్రారంభం చేశాడు జేమ్సు.

తమ్ముని పేరు వినేసరికి ఆవిడముఖం ఒక కొత్త కాంతితో తొణికిసలాడింది. ఆమె జేమ్సువైపు తిరిగి అతనివంక ఆసక్తితో చూచింది. "ఇంతటి తేజోవంతమైన ముఖలక్షణాలను నేను నాజీవితంలో ఎన్నడూ చూచి వుండలేదు" - అనుకున్నాడు జేమ్సు తనలో తాను.

"క్షమించాలి. మీతమ్ముని పట్ల మీకు ఇంత ప్రేమాదరాలు వుండడం నిజంగా ఎంతో ప్రశంసనీయమైన విషయం. అందుకు టామ్ గర్వించి తీరాలి" - అన్నాడు జేమ్సు.

"మీరు వున్నట్లుండి ఇంత హఠాత్తుగా ఇలా మాట్లాడడం ఎంతో చిత్రంగా ఉన్నది" - అన్నది లూసా.

శ్రీమతి బౌందర్‌బై, మీరు నన్ను అపార్థం చేసుకోకండి. మీముందు నేను నాటకం ఆడలేను. మనస్సులోవున్న విషయాలను దాచుకోకుండా మీకు చెబుతాను. నా స్వభావం అలాంటిది" - అన్నాడు జేమ్సు.

"సరే. మీరు నా తమ్ముణ్ణిగురించి ఏదో చెప్పవచ్చారు. ఆ విషయాన్ని కానీండి" - అన్నది లూసా.

'మీరు నాపట్ల ఎంతో నిక్కచ్చిగా వున్నారు. ఇలా మీరు నాపట్ల నిక్కచ్చిగా వుండడం సబబే. కాని నేను మీ తమ్ముణ్ణి గురించి ఏదో మాట్లాడుతూ వుండగా మీరు హఠాత్తుగా మధ్యలో నన్ను ఆపుచేసి, నాకు ఆశ్చర్యాన్ని కలిగించారు' - అన్నాడు జేమ్స్.

'మిమ్మల్ని ఒక విషయం అడుగుతాను - మీరు నా తమ్మునిపట్ల ఎంతో శ్రద్ధచూపారు - సబబుగానే వున్నది. కాని మీకు జీవితంలో ఏ విషయంలోనైనా శ్రద్ధాసక్తులనేవి వున్నవని అంటారా?' - అని అడిగింది లూసా.

'నేను తొలిసారిగా యిక్కడికి వచ్చి వున్నప్పుడు నన్ను మీరు యీ విధంగా ప్రశ్నించివుంటే, నాకు జీవితంలో శ్రద్ధాశక్తులు లేవనే నేను జవాబు చెప్పవలసి వచ్చేది. కాని, యిప్పుడుమటుకు నేను ఆ ప్రశ్నకు మరొక విధంగా జవాబు చెప్పవలసి వస్తున్నది. నాలో యిప్పుడిప్పుడు జీవితంపై శ్రద్ధాశక్తులు మొలకెత్తుతూ వున్నాయి' - అన్నాడు జేమ్స్.

లూసా ఏదో మాట్లాడబోయింది, కాని ఆ గొంతుకకు ఏదో అడ్డుతగిలినట్లయింది. నోటివెంట మాట పెగిలిరాలేదు, చివరకు ఎంతో కష్టంమీద యిలా అన్నది: 'జేమ్స్, మీకు నా తమ్మునిపట్ల శ్రద్ధాశక్తులున్నందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను' - అన్నది.

"ధన్యవాదాలు - ! టాంపట్ల నాకు శ్రద్ధాసక్తులున్నమాట వాస్తవమే. నాకోసం కాదు, అతని శ్రేయస్సుకొరకే నేను అతనిపట్ల శ్రద్ధాసక్తి కలిగి ఉన్నాను. మీరు మీ జీవితంలో మీ తమ్ముణ్ణి ప్రేమించినంతగా మరెవరినీ ప్రేమించలేదన్న విషయం కూడా నాకు తెలుసు. ఇంతగా ఈవిషయాన్ని ప్రస్తావిస్తూ ఉన్నందుకు నన్ను క్షమించండి" - అన్నాడు జేమ్స్. తరువాత ఒక క్షణం తిరిగి లూసా అతన్ని ఇలా ప్రశ్నించింది: జేమ్స్! మీరు నా తమ్మునిలో శ్రద్ధాసక్తులు ఉన్నవని అంటున్నారు. కాని మీరు జీవితంలో ఏ విషయంలోనూ శ్రద్ధాసక్తులు లేనివారివలె కనుపిస్తారు. మీకు జీవితంలో ఏ విషయంలోనైనా శ్రద్ధాసక్తులు ఉన్నవని అంటారా?" - అన్నది.

"మొదట నేను ఇక్కడికి వచ్చినప్పుడు మీరు నన్ను ఈ ప్రశ్న అడిగి ఉన్నట్లయితే నాకు జీవితంలో ఏ విషయంలోనూ శ్రద్ధాసక్తులు లేవనే చెప్పి వుండేవాణ్ణి. కాని ఇప్పుడుమాత్రం అలా జెప్పలేను" - అన్నాడు జేమ్సు.

తరువాత జేమ్సు గొంతు సవరించుకుని ఇలా చెప్పసాగాడు: "శ్రీమతి బౌందర్‌బై ! మీ తమ్ముని వయస్సులో ఉన్న ఒక యువకుడు, జీవితాన్ని లెక్కచెయ్యని జల్సారాయుడుగా ఉన్నాడంటే అందులో ఆశ్చర్యపడవలసిన విషయం ఏమీ లేదు. అవునంటారా? కాదంటారా?"

"అవును" అన్నది లూసా.

"నన్ను ఉన్నమాట వున్నట్లుగా చెప్పనివ్వండి. టాం జూదరి అంటారా?" - అని అడిగాడు జేమ్సు.

"టాం పందేలు కాస్తాడనే విషయం నాకు తెలుసును - అన్నది లూసా.

"అవును. పందేలు కాస్తాడు. పందేల్లో డబ్బుకూడా పోగొట్టుకుంటూ ఉంటాడు" - అన్నాడు జేమ్సు.

"అవును" - అన్నది లూసా.

"అవును, పందేలు కాచేవాడు డబ్బు పోగొట్టుకోక మిగుల్చుకుంటాడా ? అప్పుడప్పుడు మీరుకూడా అతనికి డబ్బు పెట్టుబడిపెడుతూ వుంటారేమో" - అన్నది లూసా.

ఇలా అని తను అడిగిన ప్రశ్నకు సమాధానం కొరకు ఎదురు చూస్తున్న లూసా అతనివైపు చూచింది.

"టాం రానురాను చిక్కులలో పడవచ్చు ననుకుంటాను. అప్పుడు నేను అతనికి సాయం చెయ్యవలసిన అవసరం రావచ్చు" - అన్నాడు జేమ్సు.

లూసా జవాబు చెప్పడానికి యత్నించింది కాని జవాబు చెప్ప లేక పోయింది.

'మిమ్మల్ని మరో విషయాన్ని కూడా అడగదలచుకున్నాను.

ఇలా అడుగుతున్నందుకు క్షమించండి. టాంలో టాం నాన్నగారికి విశ్వాసం వున్నదంటారా?' - అని అడిగాడు జేమ్స్.

'మా నాన్నగారికి టాంలో అంతగా విశ్వాసం వున్నదని వూహించను' - అన్నది లూసా. ఈ విషయాన్ని చెప్పడానికి ఆవిడ కొంచెం సిగ్గుపడింది.

తరువాత జేమ్స్ మళ్ళీ యిలా ప్రశ్నించాడు :

'టాంలో అతని నాన్నగారికి విశ్వాసం లేకపోతే లేకపోవచ్చు. పోనీ మీ భర్తగారికైనా విశ్వాసం వున్నదంటారా?' అని అడిగాడు జేమ్స్.

జేమ్స్ యిలా అడిగేసరికి లూసా మరింత సిగ్గుపడింది. ఆవిడ ముఖం మరింత ఎర్రవారింది.

క్షీణస్వరంతో ఆమె యిలా అన్నది :

'నా భర్తగారికి కూడా టాంలో విశ్వాసం వున్నట్లు చెప్పలేను' - అని.

కొద్ది క్షణాలు మౌనంగా వుండి, ఆ పిదప జేమ్స్ యిలా అన్నాడు : 'పోనివ్వండి. మీలో నాకు విశ్వాసం వున్నది. నాలోనూ మీకు విశ్వాసం వున్నదని భావిస్తాను. అందుచేత నేను మిమ్మల్ని ఒక ప్రశ్న అడగదలిచాను. టాం మీవద్ద కొంత డబ్బు అప్పు పుచ్చుకున్నాడనుకుంటాను నిజమేనా?'—

ఈ ప్రశ్నకు ఏమని జవాబుచెప్పాలో తోచక, కొంత తటపటాయించిన మీదట లూసా ఇలా అన్నది. "జేమ్సు! ఇప్పుడు మీరు అడిగినప్రశ్నకు నేను జవాబు చెబుతున్నానని అంటే - మీరు ఏవిషయాన్ని నన్ను అడిగారో ఆ విషయాన్నిగురించి చింతపడుతూ వున్నానని కాదు. జీవితంలో నేను దేనికీ చింతపడను. నేను చేసినపనులన్నీ విశ్చింతతో చేశినవే" -

"ఊఁ" - అన్నాడు జేమ్సు.

లూసా మళ్ళీ యిలా చెప్పసాగింది : "నాకు వివాహం జరిగినప్పుడు కూడా నా తమ్ముడు అప్పులలో మునిగివున్నాడనే విషయం నాకు తెలుసు. అప్పుడు నేను అతనికొరకు నా గాజులను అమ్మవలసి

వచ్చింది. నేను గాజులు అమ్మాను. నేను త్యాగం చేశానని నేను అనడంలేదు. అది ఒక త్యాగం కాదు, నా అంతట నేనే కావాలని వాటిని అమ్మాను. వాటికి నేను ప్రత్యేకమైన విలువేమీ యివ్వలేదు. వాటిని నేను వ్యర్థంగా భావించాను"—

ఇలా అని ఒకమాటు ఆగి లూసా అతని ముఖంవైపు చూచింది. ఈ విషయం ఇంతకుముందే అతనికి తెలుసునన్న భావం అతని ముఖంలో కనుపించిందో, లేక ఈ విషయం అతనికి తెలుసునని ఆవిడ అంతరాత్మ చెప్పిందోకాని - లూసా మటుకు ఈ క్షణంలో యత్కించిత్ చకితురాలైంది. ఆవిడ ముఖం మళ్ళీ లజ్జారుణ రేఖలు తొంగి చూచాయి.

ఒక క్షణం ఆగి ఆవిడ మళ్ళీ యిలా చెప్పసాగింది :

"నాటినుంచి నేటివరకు నా తమ్ముడికి అనేక సందర్భాలలో నా దగ్గర వున్నంతవరకు డబ్బు ఇస్తూవచ్చాను. వాడు వచ్చి అడగ్గానే నావద్ద ఎంత డబ్బువుంటే అంత ఇచ్చేసేదాన్ని. మొన్న వాడు నా దగ్గరికి వచ్చి ఒక వందపౌండ్లు డబ్బు యివ్వమని అడిగాడు. నేను యివ్వలేక పోయాను. ఆ సమయంలో నావద్ద డబ్బులేదు. వాడు అంత చిక్కులలో మునిగి వున్నప్పుడు వాడికి డబ్బు యివ్వలేకపోయినందుకు నాకు ఎంతో బాధకలిగింది. ఇంతవరకు యీ విషయాలన్నీ నేను ఎవరితోనూ చెప్పలేదు. కడుపులోనే దాచుకున్నాను. మీరు ఎంతో విశ్వాస పాత్రులని మీకు చెబుతూవున్నాను" - అంతా విన్న తరువాత జేమ్స్ యిలా అన్నాడు : "శ్రీమతి, మీ మనోబాధను నేను అర్థం చేసుకో గలుగుతున్నాను. మీ తమ్మునిపట్ల మీరు చూపే సానుభూతిలో నేనూ పాలు పంచుకుంటున్నాను. ఇంతకూ అతను యిలా ప్రవర్తించడానికి కారణం అతని పెంపకమనే చెప్పాలి. సంఘంలో ప్రతి వ్యక్తీ ఒక పాత్ర వహిస్తాడు. ఆ పాత్ర వహించడానికి ప్రతి వ్యక్తికీ తగిన అవకాశాల నివ్వాలి. అలా అవకాశాల నివ్వనిపక్షంలో ఆ వ్యక్తి జీవితం విషమ పరిణామాలకు లోనవుతుంది. టాం జీవితం కూడా యిలాగే తయారైంది."

జేమ్స్ యిలా చెబుతూవున్నప్పుడు లూసా తదేక దృష్టితో

పచ్చిక మైదానంవైపు చూస్తూ కూచున్నది. సంధ్యారుణకాంతులు ప్రతి ఫలించి పచ్చిక రకరకాల రంగులనీనుతూ వున్నది.

"టాంలో ఎన్ని విఘాలైనా లోపాలైనా ఉండవచ్చు. అని ఒక లోపాన్నిమటుకు నేను క్షమించలేకుండా ఉన్నాను" - అన్నాడు జేమ్స్.

"ఆలోపమేమిటో సెలవిస్తారా?" - అని అడిగింది లూసా.

"అతనికి ఈ లోకంలో మీకు మించిన బంధువులూ ఆప్తులూ మరెవరూ లేరు. అతని కొరకు మీరు చెయ్యని త్యాగమేది లేదు. కాని అతను మీ పట్ల చూపవలసినంత కృతజ్ఞతను చూపుతున్నాడనే విశ్వాసం నాకులేదు" - అన్నాడు జేమ్స్.

లూసా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆవిడ హృదయంలో ఒక సన్నని బాధ బాకులా దూసుకుని పోయింది.

లూసా కూచున్న చోటినుంచి లేవ లేక పోయింది. జేమ్స్ ఆవిడను మెల్లిగా చెయ్యిపుచ్చుకుని లేవదీశాడు. ఇరువురూ తోటలో నడవ సాగారు. ఆకస్మికంగా వారికి థామస్ ఎదురు పడ్డాడు. ఒక చెట్టు మొదట్లో కూచుని చెట్టుమీద ఏదో చెక్కుతూ ఉన్నాడు. వారినిచూచి థామస్, "ఓ, మీరు ఇక్కడున్నారా? నేనుగమనించ లేక పోయాను"- అన్నాడు.

"చెట్టు మీద ఎవరిపేరు చెక్కుతున్నావు?" - అని అడిగాడు జేమ్స్.

"ఏ అమ్మాయి పేరు చెక్కుతూ ఉన్నానని అడుగుతున్నావా?"- అన్నాడు థామస్.

"అవును. నీ వాలకంచూస్తూ ఉంటే ఎవరో అమ్మాయి పేరు చెక్కుతున్నట్టుగా ఉన్నది" - అన్నాడు జేమ్స్.

"అంత అదృష్టం ఇంకా మనకు పట్టలేదోయ్. అయినా, సిరి గలవారి ఇంటి అమ్మాయి మన మీద కన్నువేస్తేనే కాని, ఆ అమ్మాయి పేరు చెట్టుమీద చెక్కేటంత శ్రమనేను తీసుకోను"-అన్నాడు థామస్.

"నిజంగా నీవు చాలా విచిత్రమైన వ్యక్తివిరా అబ్బాయ్"- అన్నాడు జేమ్స్. తరువాత ముగ్గురూ కలిసి ఇంటి వైపుకు వెళ్ళారు.

ఇంట్లోకి వెళ్ళగానే లూసా వారిపద్ద సెలవు తీసుకుని మేడమీదకు వెళ్ళింది.

జేమ్సు థామస్ బుజంమీద చెయ్యివేసి, "అబ్బాయ్, నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి. అలా తోటలోకి వెడదాంరా" - అన్నారు. ఇదువురు మిత్రులూ లోపలికి వెళ్ళారు. ఒక గులాబీ పొదవద్ద కూచున్నారు.

"టాం, ఏమిట్రా విశేషం? ఏమిటి యివాళ అలా వున్నావు?" - అని అడిగాడు జేమ్సు.

"ఏముందిరా అబ్బాయ్, బ్రతుకంటే రోతపుట్టిపోయింది" - అన్నాడు థామస్.

"బ్రతుకంటే రోత నీకేకాదు - నాకూ కలిగింది" - అన్నాడు జేమ్సు.

"నీకు బ్రతుకంటే రోత కలగవలసిన అవసరం ఏముందోయ్! నా విషయం వేరు. ఇప్పుడు నేను ఎంతచిక్కులో వున్నానో ఆ విషయం నా కొక్కడికే తెలుసు. నిజంగా తాను తలుచుకుంటే మా అక్క నన్ను యీ చిక్కునుంచి తప్పించగలదు" - అన్నాడు థామస్.

థామస్ గులాబీ పొదనుంచి ఒక గులాబీ పూవును గిల్లి రేకులను చించివెయ్యసాగాడు.

ఒకక్షణం ఆగి జేమ్సు యిలా అన్నాడు: "అబ్బాయ్, మీ అక్క ఎంతో ఔదార్యంగల వ్యక్తి. కాని ఆవిడ ఔదార్యాన్ని నీవు దుర్వినియోగం చేసుకుంటున్నావు. నీవు యిదివరకు అవసరం వచ్చినప్పుడల్లా ఆవిడవద్ద కావలసినంత డబ్బు పుచ్చుకోలేదా?" - అన్నాడు జేమ్సు.

"అవును నిజమే. మా అక్క యివ్వకపోతే నాకు డబ్బు ఎక్కడనుంచి వస్తుంది? మా బావ బౌండర్‌బై మహాశయుడున్నాడంటే - ఆయన ధోరణే అసలునిది, తను నా వయస్సులో వున్నప్పుడు నెలకు రెండు పెన్నీలతోనే కాలం గడిపినట్లు మాట్లాడుతాడు. ఇక మా నాన్నగారున్నారంటే, ఆయన విషయం నీకు తెలియందికాదు - మా అమ్మ జబ్బు మనిషి. ఇక నేను డబ్బు అవసరం వచ్చినప్పుడు

మా అక్కను అడగక మరెవరిని అడగను" - అన్నాడు థామస్. ఇలా అన్నప్పుడు అతని గొంతుకలో ఏడుపు ఉండలుచుట్టుకుని వచ్చింది.

మిత్రుడు జేమ్సు అతన్ని యిలా ఓదార్చసాగాడు: "అది కాదురా భాయ్! నీవు చెప్పేదంతా నిజమే. కాని దగ్గర డబ్బు లేనప్పుడు ఆవిడమాత్రం ఏం చెయ్యగలదు చెప్పు?"—

"మా అక్క దగ్గర డబ్బులేదంటావా జేమ్సు? డబ్బులేక పోతే తాను డబ్బు తీసుకుని రాలేదా? చల్లకు వచ్చి ముంతదాచడమెందు కన్నట్లు ఇప్పుడు నీకు ఉన్నవిషయాలన్నీ ఉన్నట్లుగా చెబుతున్నాను. ఆవిడ బౌందర్‌బై మహాశయుణ్ణి తన కోసం వివాహమాడలేదన్న విషయం నీకు తెలియనిదికాదు. ఆవిడ బౌందర్‌బై మహాశయుణ్ణి వివాహం చేసుకున్నది నా కొరకు ఇక మరి నా కోసం ఆమె ఆయన దగ్గరనుంచి డబ్బు రాబట్టితే అందులో తప్పేమిటి? కాని ఆవిడ అలా చెయ్యదు, ఆయన సమక్షంలో ఒక శిలలా గడ్డ కట్టుకునిపోయి కూచుం టుంది. నా ఉద్దేశంలో మటుకు ఇది చాలా అసహజమైన ప్రవర్తన"- అన్నాడు థామస్.

"పోనీ, నీ తరపున బౌందర్‌బైని నేను అప్పురూపంగా ఇవ్వ మని డబ్బు అడగనా?" - అన్నాడు జేమ్సు.

"అలాటి పనులు మాత్రం చెయ్యకు" అన్నాడు - థామస్. తరువాత మిత్రులిరువురూ ఇంటికి వెళ్ళారు.

మరుసటిరోజు ఉదయం,

తెల్లవారింది.

జేమ్సు పెందలకడనే నిద్రలేచాడు, తన డ్రెస్సింగ్ గదిలో తాపీగా సిగరెట్టు కాల్చుకుంటూ కూచున్నాడు. సిగరెట్టు పొగ తీగలు తీగలుగా సాగి ఆకాశంలో కలిసిపోతూ వున్నది.

జేమ్సుకు ఒకవిధమైన సంతృప్తి కలిగింది. లూసా మనస్సులో తాను విశ్వాసం కలిగించగలిగాడు. ఆవిడ భర్తకూడా కలిగించలేని విశ్వాసాన్ని తాను కలిగించాడు.

జేమ్సు కిటికీవద్ద కూచుని రెండు మూడు సిగరెట్లు వరుసనే

ఊదేసి, ఆ పిదప స్నానంచేసి, కాఫీ సేవించి బౌందర్‌బై మహాశయుని యింటికి బయలుదేరాడు.

త్రోవలోనే జేమ్స్‌కు బౌందర్‌బై ఎదురయ్యాడు.

"విన్నావుటోయ్ జేమ్స్? విన్నావా యీ వార్త? - అన్నాడు బౌందర్‌బై.

"ఏ వార్త?" - అన్నాడు జేమ్స్.

"అవుతే, నీవు వినలేదన్నమాట!" - అని ఆశ్చర్యాన్ని ప్రకటించాడు బౌందర్‌బై.

"ఏ మాట?" - అని మళ్ళీ తిరుగు ప్రశ్న వేశాడు జేమ్స్.

"బాంకులో దోపిడి జరిగింది!" అన్నాడు బౌందర్‌బై.

"నిజంగా?" ప్రశ్నించాడు జేమ్స్.

"పోయిన రాత్రే జరిగింది. మారు తాళపు చెవితో బ్యాంకును లూటీచేశారు" - అన్నాడు బౌందర్‌బై.

లూటీ చేశారనుకున్నాను" - అన్నాడు జేమ్స్.

"ఈ రోజు 150 పౌండ్లు లూటీ జరిగింది. రేపు వెయ్యి పౌండ్ల లూటీ జరగవచ్చు" - అన్నాడు బౌందర్‌బై.

"అవును. ఏ క్షణాన ఏమి జరుగుతుందో ఎవరు చెప్పగలరు?"- అన్నాడు జేమ్స్.

"రోజులు మారిపోయాయి. న్యాయానికి రోజులు కావివి"- అన్నాడు బౌందర్‌బై.

ఈ లోగా లూసా కూడా అక్కడికి వచ్చింది. "చూడు - అవసరమవుతే నా భార్యను కూడా అడుగు" - అన్నాడు బౌందర్‌బై.

లూసా ముఖంలో వ్యధ స్పష్టంగా కనిపిస్తూవున్నది. ఆవిడ ముఖంలో కత్తివేసినా నెత్తురుబొట్టు లేదు. లూసా ప్రక్కనే శ్రీమతి స్పార్సిత్ కూడా వున్నది. బౌందర్‌బై శ్రీమతి స్పార్సిత్‌ను జేమ్స్‌కు పరిచయం చేశాడు.

శ్రీమతి స్పార్సిత్ బ్యాంకులో జరిగిన దోపిడిని గురించి యిలా చెప్పసాగింది: "నిన్న సాయంత్రం మామూలు ప్రకారం బ్యాంకు టైము అయిపోగానే బ్యాంకు తలుపులు మూశారు. సేవకుడు బిట్జర్

బ్యాంకు గేటులోనే నిద్రిస్తాడు. టాం కూచునే సీటు దగ్గరున్న ఇనప్పెట్టెలో 150 పౌండ్ల రొఖం వున్నది. ఆ రొక్కం కాస్తా పోయింది" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

"నూట యాభై పౌండ్లు కాదమ్మగారూ. 150 పౌండ్ల ఏడు షిల్లింగుల ఆరుపెన్నీలు" - అన్నాడు సేవకుడు.

"నీ మొహం - ఇక ఊరుకో - డబ్బు పోయింది కాక ఇంకా లెక్కలు చెప్పవస్తున్నావు. నేను నీవయస్సులో ఉన్నప్పుడు గుర్రు పెట్టి నిద్రించే వాణ్ణి కాదు" - అని సేవకుణ్ణి మందలించాడు బౌందర్ బై మహాశయుడు.

"అయ్యో! నేనేం చేశాను అయ్యగారూ" - అంటూ సేవకుడు నుదుటిపై చేత్తో కొట్టుకున్నాడు. బౌందర్ బై మహాశయుడు మళ్ళా ఇలా చెప్పసాగాడు.

"టాం తన ఇనప్పెట్టెలో 150 పౌండ్లు ధనం ఉంచి ఇనప్పెట్టెకు తాళం వేశాడు. ఇనప్పెట్టె అంతగట్టిది కాదనుకుంటాను. కాని, అసలు విషయం అదికాదు - వీడు - బిట్జర్ నిద్రపోతూ ఉన్నప్పుడు - ఎవరో చెయ్యి చేసుకుని ఉంటారు" - బౌందర్ బై.

అందుకు స్వార్సిత్ యిలా జవాబుచెప్పింది:

"అయ్యో! వీడు గురకెట్టాడో లేదో నేనుమాత్రం వినలేదు. అంచాత వీడు గురకెట్టాడని అనడం సబబుకాదు. కాని శీతాకాలంలో మాత్రం వీడు గురకెట్టి నిద్రపోవడం నేను అనేక పర్యాయాలు విన్నాను. వాడు గురకెట్టుతూవుంటే డబ్బి గడియారాలు చప్పుడు చేసినట్టుగా వుండేది. కాని వీడు ఎంతో జాగ్రత్తగల మనిషని మాత్రం నేను ఖచ్చితంగా చెప్పగలను" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

"ఏమైనా కావచ్చు. వీడు గుర్రెట్టి నిద్రపోతూవున్నప్పుడు, అంతకుముందే గదిలో దాగివున్న ఎవరో ఇనప్పెట్టె తెరిచి దోపిడీ చేసివుంటారు" - అన్నాడు బౌందర్ బై.

"ఇంతకూ టాం ఏడీ? ఈరోజు కనుపించలేదే" - అన్నాడు జేమ్సు.

"పోలీసులను పిలుచుకుని రావడానికి వెళ్ళాడు" - అన్నాడు బౌందర్‌బై.

"ఇంతకు ఎవరైనా అనుమానితుడు వున్నాడా ?" - అని ప్రశ్నించాడు జేమ్సు.

"అనుమానితుడా ? ఎవరుంటారు!"-అని అడిగాడు బౌందర్‌బై.

"నేను ఈ విషయంలో ఆరాతీస్తాను లెండి" - అన్నాడు జేమ్సు.

తరువాత బౌందర్‌బై అందరివైపూ చూచి యిలా అన్నాడు :

"మీరంతా నాకు అయినవారు. ఈ మాట మాత్రం ఎక్కడా అనకండి. ఆనోట ఆనోట పొక్కి యీ విషయం దేశమంతటా ప్రాకిపోతుంది" —

"చిత్తం. అలాగే కాని మేమంతా యత్నించి దోపిడీ చేసినవారిని పట్టుకుని శిక్షించి తీరుతాము ? - అన్నాడు జేమ్సు. ఆ తరువాత అంతా ఇంటికి వెళ్ళారు.

ఈ సంఘటన జరిగినప్పటినుంచి శ్రీమతి స్పార్సిట్ మానసికంగా ఎంతో ఆందోళనను అనుభవించసాగింది. ఇంటి విషయాలను కూడా ఆవిడ అంతగా పట్టించుకోవటంలేదు. తన పట్ల, ఇతరుల పట్లకూడా ఆవిడకు అశ్రద్ధ ఎక్కువైంది. ఎప్పుడూ తన గదిలోనే ఉంటూ ఉన్నది. బౌందర్‌బై పట్ల ఎంతో జాలి కనుపరుస్తూ ఉండేది. బౌందర్‌బై కనుపించినప్పుడల్లా, "అయ్యో! పాపం! వట్టి పిచ్చివాడు!"- అనుకునేది. ఇంటికి వెళ్ళిన తరువాత అంతా భోజనాలు చేశారు. భోజనాలు ముగిసిన తరువాత బౌందర్‌బైగారు మళ్ళీ ఒకమాటు దోపిడీ నేరాన్ని పునఃపరిశీలించసాగారు. సాక్షులనుకున్న వారినందరినీ పరీక్షించి వారు చెప్పిన సాక్ష్యాన్ని వ్రాతపూర్వకంగా దాఖలా చేసుకున్నారు. ఆ తరువాత అనుమానితులని భావించబడినవారి జాబితాను తయారుచేసి వారిని మానసికంగా శిక్షించారు. ఆ తరువాత థామస్‌ను వెంటనే యింటికి పిలుచుకురమ్మని సేవకునిచేత కబురు పంపారు. చీకటి పడింది' కొవ్వొత్తులు వెలిగించారు. శ్రీమతి స్పార్సిట్‌తో బౌందర్‌బై దాపుకు వచ్చి మెల్లగా యిలా అన్నది :

అయ్యో మీరు దిగులుతో కుంగిపోకండి. మీరు అలా దిగాలు

పడితే నేను చూడలేకుండా వున్నాను. జరిగిందేదో జరిగిపోయింది. సంతోషంగా వుండండి" - అన్నది.

బౌండర్‌బై ఏమీ మాట్లాడలేదు. శ్రీమతి స్పార్సిత్ మళ్ళీ ఇలా అన్నది : "అయ్యా ఒకమాటు పియానో వాయించండి. మీకు కొంత మనశ్శాంతి కలగవచ్చు" - అన్నది.

"నేను పియానో వాయించి చాలారోజులైంది" - అన్నాడు బౌండర్‌బై.

"అవును. నిజమేనండి. ఆవిషయం నాకు తెలుసు. లూసాకు కూడా సంగీతంలో అంతగా శ్రద్ధఉన్నట్లు తోచదు" - అన్నది శ్రీమతి స్పార్సిత్.

తరువాత బౌండర్‌బై మెల్లగా పియానోపై సంగీతం పాడ సాగాడు. శ్రీమతి స్పార్సిత్ కిటికీవద్ద నిల్చుని ఆయన పాటను విన సాగింది.

రాత్రి చల్లగా ఉంది. గాలి మెల్లగా వీస్తూ ఉన్నది. లూసా, జేమ్సు ఏదో మాట్లాడుకుంటూ తోటలో తిరుగుతూ ఉన్నారు. వారికి బౌండర్‌బై పాడుతున్నపాట వినిపించ సాగింది.

బౌండర్‌బై మహాశయుడు పియనోపాడగా రాగాలాపన తీగలా సాగిస్తున్నాడు. శ్రీమతి స్పార్సిత్ బౌండర్‌బై మహాశయునిపాటను వింటూకిటికీనుంచి వెలుపలికి చూడసాగింది. ఒకక్షణం అగి బౌండర్‌బై ఆమెను ఇలా ప్రశ్నించాడు :

"ఏమిటి శ్రీమతి - మీరిలా పరధ్యానంగా ఉన్నారు?" - అని ప్రశ్నించాడు.

"ఏమీలేదు. వెలుపల మంచు కురుస్తూవున్నది. చూస్తున్నాను" - అన్నది శ్రీమతి స్పార్సిత్.

"మంచు కురిస్తే మనకేమిటి ?" - అన్నాడు బౌండర్‌బై.

"నా విషయం కాదండి. శ్రీమతి లూసాకు మంచులో తిరిగితే రొంప పడుతుందేమోనని ఆలోచిస్తున్నాను". అన్నది శ్రీమతి స్పార్సిత్.

"దగ్గులూ పడిశాలూ పట్టే అలవాటు శ్రీమతికి ఎన్నడూ లేదు" - అన్నాడు బౌండర్‌బై.

ఆ తరువాత బౌందర్‌బై మెల్లిగా అక్కడినుంచి లేచి వెళ్ళి ఒక గ్లాసు మంచినీరు త్రాగాడు,

"ఇదేమిటండీ, ఇంతకుపూర్వం మీరు పడుకోబోయేముందు నిమ్మరసం త్రాగేవారు. ఇప్పుడు మానేశారేమిటి? నిమ్మరసం కలిపి తీసుకురానా?" అన్నది శ్రీమతి స్పార్సిత్.

"ఇప్పుడు పాత అలవాట్లన్నిటిని వదులుకున్నాను" - అన్నాడు బౌందర్‌బై.

ఆ తరువాత బౌందర్‌బై మహాశయుడు శ్రీమతి స్పార్సిత్‌వద్ద సెలవు తీసుకుని పడుకోడానికి వెళ్ళాడు. లూసాకుమటుకు మేలుకునే వున్నది. తన తమ్ముని రాకకొరకు ఎదురుచూస్తూ వున్నది,

అర్ధరాత్రి దాటేవరకు లూసా తన తమ్ముని రాకకొరకు ఎదురు చూస్తూ కూచున్నది. ఎంతరాత్రి గడిచినా తమ్ముడు వచ్చేజాడ కను పించడంలేదు. నిమిషాలు, గంటలు గడిచిపోతున్నాయి. కాలం బరువుగా నత్తగుల్ల నడక సాగిస్తున్నట్లుగా వున్నది. ఆ తరువాత కొంత సేపుకు గేటులో గంట మ్రోగిన చప్పుడైంది.

"టామ్ వచ్చినట్లుగా వున్నాడు" - అనుకున్నది లూసా.

థామస్ చప్పుడుకాకుండా మేడమెట్లెక్కి వచ్చి తనగదిలోకి వెళ్ళి తలుపు ఓరగామూసి పడుకున్నాడు.

లూసాకు తమ్మునితో మాట్లాడవలెననే ఉద్దేశం కలిగింది. లూసా థామస్ గదిలోకి వెళ్ళి మెల్లగా తలుపు తెరుచుకుని లోనికి వెళ్ళింది. థామస్ నిద్రిస్తున్నట్టుగా నటిస్తున్నాడు.

ఆ విషయం లూసాకు తెలుసు. ఆవిడ మెల్లగా అతని ప్రక్క దగ్గరకు వెళ్ళి కూచున్నది. థామస్ ఉలికిపడి కళ్ళుతెరిచి చూచాడు.

"ఏమిటక్కా - ఇంతరాత్రివేళ ఇలా వచ్చావు?" - అని ప్రశ్నించాడు.

"థామస్ - నీ అక్కపట్ల గౌరవమూ ప్రేమా ఉన్నట్లయితే నీవు నీ జీవితంలో నావద్ద దాచిన విషయాన్ని నాకు చెప్పు" - అన్నది లూసా.

"నీవు అంటున్నదేమిటో నాకు అర్థం కావడంలేదు. నీవు కల కంటూ ఉన్నట్లున్నావు" - అన్నాడు థామస్.

"తమ్ముడూ ; నీవు నావద్ద దాచిన విషయం ఏమీలేదా? ఉన్నది. ఉన్న నిజాన్ని నాతో చెప్పు" - అన్నది లూసా.

"నీవు అంటున్నదేమిటో నాకు అర్థంకావడంలేదు అక్కయ్యా"- అన్నాడు థామస్.

"అబ్బాయ్ - టాం - మానవులంతా ఇలలో కలకాలం ఉండరు. ఏనాడో ఒకనాడు ఇహాన్ని వీడిపోవడమనేది ఎవరికైనా తప్పదు. అలాగే మనం కూడా ఇహాన్ని వీడిపోతాము. ఉన్న నిజం చెప్పు నాయనా" - అని సానునయంగా అన్నది లూసా.

"ఏమిటక్కయ్యా, నీవు అడుగుతున్నది? నాకేమీ అవగతం కావడంలేదు" - అన్నాడు థామస్,

"నీవు మరేమీ చెప్పనక్కర్లేదు నాయనా - అవును - కాదు - అని ఒక్కమాట అను చాలు" - అన్నది లూసా.

"నీవు చెప్పదలిచింది ఏమిటో నాకు అర్థం కానప్పుడు 'అవును కాదు' అన్నమాటను మాత్రం ఎలా అనగలను?" - అన్నాడు థామస్.

"నీవు చాలా అలసిపోయినట్లుగా ఉన్నావురా తమ్ముడూ" - అన్నది లూసా.

"అవునక్కా నిజమే" - అన్నాడు థామస్.

"ఈరోజు నీవు కొత్త విశేషాలేమీ వినలేదా?" - అని ప్రశ్నించింది లూసా.

"కొత్తవిశేషా లేముంటాయి? మీ ఆయన చెప్పిన విశేషాలే విన్నాను - అన్నాడు థామస్.

"థామస్, మనం స్టీపెన్ ఇంటికి వెళ్ళినట్టు నీవు ఎవరితోనైనా చెప్పావా?" - అని అడిగింది లూసా.

"నేను ఎవరితో చెబుతాను అక్కయ్యా? ఎవరితోనూ చెప్ప వద్దని నీవు ముందుగా చెప్పావు కదా ?" - అన్నాడు థామసు.

"అవును నిజమే. అప్పుడు నేను ముందు విషయాన్ని ఆలోచించలేక పోయాను" - అన్నది లూసా.

"నేనూ ఆలోచించలేక పోయాను. ఇంతకూ నీవు ఆ విష యాన్ని బైటపెట్టకపోతే నేనూ బైటపెట్టను" - అన్నాడు థామస్.

"థామస్ - నిన్ను మరో విషయం అడగనా? ఆనాడు నేను డబ్బిచ్చిన వ్యక్తికి యీ నేరంలో జోక్యం వుంటుందని అంటావా?" - అని అడిగింది లూసా.

"నాకెలా తెలుస్తుంది? అయినా మనమేం చెప్పగలం?" - అన్నాడు థామస్.

"అతను - మనిషిని చూస్తే చాలా నిజాయితీపరుడిలా అగు పించాడు" - అన్నది లూసా.

థామస్ మరేమీ మాట్లాడలేదు. లూసాకూడా మౌనంగా వున్నది. ఆ విధంగా వారిరువురూ కొద్దిసేపు కూచున్నారు. ఆ తరువాత లూసా తన తమ్ముని వద్ద సెలవుతీసుకుని వెళ్ళింది.

# 25

శ్రీమతి స్పార్సిత్ బౌండర్బై మహాశయుని గృహాన్ని అహర్నిశలూ కళ్ళలో వత్తులు వేసుకుని కావలా కాస్తున్నది. ఆవిడ రోజుకు ఒక్క వందసార్లయినా యింటినంతా తప్పవిసరిగా పర్య వేక్షిస్తూ వుంటుంది. జేమ్సుకూడా తరుచు బౌండర్బై మహాశయుని గృహానికి వస్తూవున్నాడు. అతనితో జేమ్సు వారింటికి వచ్చినప్పుడల్లా అతనితో ఏదో ఒక విషయాన్ని గురించి సంభాషణ కదపడం శ్రీమతి స్పార్సిత్‌కు పరిపాటి అయింది. ఒకరోజున జేమ్సు వారి గృహానికి రాగా శ్రీమతి స్పార్సిత్‌కు జేమ్సుకు యీ క్రింది విధంగా సంభాషణ జరిగింది :

"మిస్టర్ జేమ్సు - మీతో మొట్టమొదటిసారిగా నాకు మా ఖజానా కార్యాలయంలో పరిచయం కలిగింది. మీరు బౌండర్బై మహాశయుణ్ణి వెదుక్కుంటూ అక్కడికి వచ్చారు. ఆ సంఘటన జరిగిన కొంతకాలం

గడిచినప్పటికి నాకు యీనాటికీ ఆ సంఘటన నిన్ననో మొన్ననో జరిగినట్లే వుంది అన్నది శ్రీమతి స్వార్సిత్.

"అవునండి, ఆ సంఘటనను నేనుకూడా మరువలేను" - అన్నాడు జేమ్సు.

ఆ తరువాత ఒకక్షణం ఆగి శ్రీమతి స్వార్సిత్ మళ్ళీ యిలా అన్నది : "మనం నివసిస్తున్న ప్రపంచం చూచారా - ఈ ప్రపంచం చాలా విచిత్రమైనది" - అన్నది.

"అవునండి.మీ రన్నమాట అక్షరాలా నిజం" - అన్నాడు జేమ్సు.

వారు ఇలా సంభాషిస్తూ ఉండగా బౌందర్బై మహాశయుడు అక్కడికి వచ్చాడు. శ్రీమతి స్వార్సిత్ తను కూర్చున్న కుర్చీపైనుంచి లేచి బౌందర్బైకి నమస్కరించి "అయ్యా ! టీ తీసుకురానా? లేక శ్రీమతి లూసా వచ్చేవరకు తమరు వేచిఉంటారా?" - అని అడిగింది.

"టీ కోసం ఇతరులకొరకు నేను వేచిఉండను" - అన్నాడు బౌందర్బై.

శ్రీమతి స్వార్సిత్ టీ తయారుచేశి తెచ్చి బౌందర్బై మహాశయునికి అందించింది. బౌందర్బై మహాశయుడు టీ సేవిస్తూ ఉండగా లూసా కూడా అక్కడికి వచ్చింది :

లూసా నీవు రెండునిమిషాలు ఆలస్యంగా వచ్చావు" - అన్నాడు బౌందర్బై.

"ఆలస్యంగా రావడం ఆవిడకు అలవాటు" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

"ఇంత చిన్న విషయాలను గురించి ఇంతగా సిద్ధాంత రాద్ధాంతాలు అవసరం లేదనుకుంటాను" - అన్నది లూసా.

లూసా ఇలా అనేసరికి శ్రీమతి స్వార్సిత్ ముఖం కోపంతో ఎరుపెక్కింది. బౌందర్బై మహాశయుడు కూడా ఆ విషయాన్ని గమనించక పోవడం ఆనాటినుంచి శ్రీమతి స్వార్సిత్‌కు లూసాకు మధ్యన ఒకవిధమైన అగాధం ఏర్పడింది.

"బౌందర్బై మహాశయుడు ఫలహారం టీ, పుచ్చుకుని ఆఫీసుకు వెళ్ళాడు. ఆయన ఆఫీసుకువెళ్ళిన కొద్దిసేపులోనే లూసా పుట్టింటినుంచి

సేవకుడు బిట్లర్ వచ్చాడు. లూసా తల్లికి తీవ్రమైన జ్వరం తగులుతున్న దనే వార్తను తెలపడానికి వచ్చాడు బిట్లర్. లూసాతల్లి అసలు మొదటి నుంచి కూడా అనారోగ్యంమనిషి. ఇటీవల ఆవిడ ఆరోగ్యం మరింతగా క్షీణించింది. తనతల్లి జబ్బుతో వున్నదనే వార్త వినగానే లూసా వెంటనే తన పుట్టింటికి ప్రయాణమైంది.

లూసా తన వివాహం జరిగిన తరువాత తన పుట్టినింటికి యిప్పటికి ఏ రెండు మూడు పర్యాయాలు మాత్రమే వెళ్ళివుంటుంది. లూసా తండ్రిగారు కూడా ఎక్కువగా కోక్ టౌన్ నగరంలో వుండడం లేదు. ఆయన పార్లమెంటు వ్యవహారాలను పురస్కరించుకుని సంవత్సరంలో ఎక్కువభాగం లండన్ నగరంలోనే వుంటూవున్నాడు. లూసా తల్లి రోగగ్రస్తురాలు. ఆవిడ అనవరతం మంచాన్ని విడవదు. సిసీ ఆవిడ కుపచర్యలు చేస్తూ అక్కడే వుంటుంది.

లూసా తన యింటివైపు ప్రయాణంచేస్తూ వుండగా ఆవిడ చిన్న నాటి జ్ఞాపకాలన్నీ ఆమె మనస్సుని కలవరపెట్టసాగాయి. కాని తాను ఎంతో మనోనిబ్బరంగల వ్యక్తి. కలవరాలకు, కల్లోలాలకు లొంగే మనస్సు కాదు ఆవిడది. అందుచేతనే లూసా నిశ్చల హృదయంతో స్వగృహాభిముఖంగా ప్రయాణం చెయ్యగలిగింది.

నిశ్చలంగా, భారంగా వున్న హృదయంతో లూసా స్వగృహంలో అడుగుపెట్టింది. తన తల్లి గదిలోకి వెళ్ళింది. లూసా తల్లి గదిలోకి వెళ్ళేసరికి ఆవిడ మంచంమీద పడుకుని వున్నది. సిసీ ఆవిడ ప్రక్కనే కూచుని ఉపచర్యలు చేస్తూవున్నది. లూసా చెల్లి జేన్ కూడా అక్కడే వున్నది.

లూసా తల్లికి దట్టంగా శాలువాలు కప్పివుంచారు. ఆవిడ యించు మించుగా అపస్మారక స్థితిలోనే వున్నదని చెప్పాలి. సిసీ ఎన్నో పర్యా యాలు తెలిపిన మీదట కాని లూసాను ఆవిడ గుర్తించలేకపోయింది.

శ్రీమతి బౌండర్‌బై వచ్చిందని సిసీ చెప్పేసరికి లూసా తల్లికి కొంచెం కోపంకలిగింది. ఎందుచేతనంటే లూసాను బౌండర్‌బైకిచ్చి వివాహం చెయ్యడము ఆవిడకు ఇష్టంలేదు. అందుచేత సిసీ, లూసా వచ్చిందని చెప్పక శ్రీమతి బౌండర్‌బై వచ్చిందని చెప్పేసరికి ఆమె

కొంచెం ఆగ్రహించుకున్నది. ఆమె మూల్గుతూ లూసాతో ఇలా అన్నది. "అమ్మాయీ! వచ్చావా? సుఖంగానే వున్నావుకదా? అయినా నీకేం సుఖం ఉంటుంది. నీవివాహానికి కారణం నేనుమాత్రంకాదమ్మా మీతండ్రిగారే కారణం" - అన్నది.

"నా క్షేమసమాచారాలు నీకు తెలపడానికి రాలేదమ్మానేను. నీ క్షేమం తెలుసుకోడానికి వచ్చాను" - అన్నది లూసా.

"నన్ను గురించి తెలుసుకోడానికి వచ్చావాతల్లీ. నన్నుగురించి తెలుసుకునేది ఏముంది తల్లీ? నాపని అటాఇటా అన్నట్లుగా ఉన్నది. అన్నది లూసాతల్లి.

"అమ్మా — నీకు శరీరంలో నొప్పిగా ఉన్నదా?" - అని అడిగింది లూసా.

ఏమోనమ్మా — ఎక్కడో నొప్పిగా ఉన్నది" - అన్నది లూసా తల్లి.

ఆ తరువాత ఆమె నిశ్శబ్దంగా పడుకున్నది. లూసా తల్లిచెయ్యి పట్టుకుని ప్రక్కనే కూర్చున్నది. ఆమె చెయ్యి శీతలంగా ఉన్నది.

"అమ్మాయీ - నీ చెల్లిని చూచావా? ఇప్పుడు అచ్చంగా నీలాగే ఉన్నది" - అన్నది లూసా తల్లి.

లూసా చెల్లెలు అక్కదగ్గరకు వచ్చి నిల్చున్నది.

"చూశావా అమ్మాయ్ నీ చెల్లి అచ్చంగా నీ పోలికే కదూ?" - అన్నది లూసా తల్లి.

"అవునమ్మా" - అన్నది లూసా.

"అమ్మాయ్ లూసా - ఇలా దగరికి రా తల్లీ" అని పిలిచింది లూసా.

లూసా తన తల్లికి మరింత దగ్గరకు వెళ్ళి కూచుంది.

"అమ్మా - ఏమిటమ్మా" - అన్నది లూసా.

"అమ్మాయ్ - ఇప్పుడు మీనాన్న దూరంలో ఉన్నారు. ఆయనకు ఒక విషయాన్ని వ్రాయాలమ్మా" - అన్నది లూసా తల్లి.

"నాన్నగారికి ఏ విషయం వ్రాయాలమ్మా?" - అని అడిగింది లూసా.

"ఏదో వ్రాయాలమ్మా. ఏం వ్రాయాలో జ్ఞప్తికి రావడంలేదు. ఆ కలమూ కాగితమూ ఇలా తీసుకురా తల్లీ - అన్నది లూసా తల్లి.

లూసా కలాన్నీ కాగితాన్నీ తీసుకునివచ్చి తల్లిచేతికి అందించింది.

ఆమె కాగితం తీసుకుని కలంతో ఏదో వ్రాసింది. రెండుమూడు వాక్యాలు వ్రాసిందోలేదో ఆవిడచెయ్యి హఠాత్తుగా ఆగిపోయింది.

# 26

శ్రీమతి స్వార్సిత్ స్వభావంలో కూడా రాను రాను మార్పు అగుపిస్తున్నది. పూర్వం ఆవిడలో కనుపిస్తూవచ్చిన లాలిత్యం ఇప్పుడు పూర్తిగా అడుగంటిపోయింది. లూసాపట్ల అనుమానం, అసూయ అభివృద్ధి కాసాగాయి.

ఒకరోజున ఆవిడ బౌందర్‌బై మహాశయుణ్ణి యీ విధంగా ప్రశ్నించింది: 'అయ్యా, మీరు నన్ను అనుమతిస్తే మిమ్మల్ని ఒక విషయం అడుగుతాను. ఖజానాలో జరిగిన దొంగతనం విషయమై మీకేమైనా ఆరా దొరికిందా?' - అని అడిగింది.

"అంత తొందరలో మనకు ఆరాచిక్కుతుందా? రోమ్‌నగరం ఒక్కరోజులో నిర్మించబడలేదు" - అని సమాధానం చెప్పాడు బౌందర్‌బై మహాశయుడు. "అవునవును" - అన్నది శ్రీమతిస్వార్సిత్ మేడమీద గదిలోకూచుని ఉన్నది. ఆవిడ కిటికీలోనుంచి క్రిందికి చూచినప్పుడు తోటలో జేమ్సు, లూసా కనుపించారు. వారు ఏదో మాట్లాడుకుంటూ ఉన్నారు. శ్రీమతి స్వార్సిత్ వారు ఏమీ మాట్లాడుకుంటూ వున్నారోఅని చెవిఒగ్గి వినసాగింది. వారు ఈ క్రిందిరీతిగా మాట్లాడుకుంటున్నారు.

"ఆవ్యక్తిని నీవు గుర్తు చేసుకోగలవా జేమ్సు?" - అని అడిగింది లూసా.

"ఆ. బాగా గుర్తుచేసుకోగలను" - అన్నాడు జేమ్సు,

"అతనిముఖం, అతని తరహా - అన్నీ నీకు జ్ఞప్తివున్నవా?"

"ఆ. అతనిముఖం గంభీరంగా ఉన్నది. కాని అతను ఈ పని చేస్తూ వున్నప్పుడు మితిమించిన భారాన్ని నెత్తిన వేసుకుంటున్నాడని అనుకున్నాను."

'అలాటి వ్యక్తిని గురించి చెడుగా ఆలోచించడం అసాధ్య మనిపిస్తూంది'.

'అతని గుణగణాలు మీకు తెలుసునా?'

'ఊ'.

'అలాటి వ్యక్తులను యితరులను ఎవరినైనా మీరు చూచారా?'

'ఊ'.

'అతని గుణగణాలు ఎలాటివని మీరు అంటారు?'

'అతను చాలా విచిత్రమైన వ్యక్తి. అతనూ అందరిలాగానే నీతిబోధలను చేస్తాడు. నీతి నియమాలను గురించి యీ రోజుల్లో ఉపన్యసించని వాడెవరు?'

పై సంభాషణలను శ్రీమతి స్వార్సిత్ మేడపైనుంచి విన్నది. ఈ సంభాషణలోని ఆంతర్యం ఏమిటో శ్రీమతి స్వార్సిత్‌కు బోధ పడలేదు. కాని ఆవిడ ప్రతి నిత్యం ఎంతో శ్రద్ధతో జేమ్సును పరి శీలిస్తూనే వున్నది. జేమ్సు రోజూ బౌందర్‌బై గృహానికి వచ్చి పోతూనే వున్నాడు.

# 27

తన భార్య మరణవార్త విని గ్రాడ్‌గిండ్ మహాశయుడు లండన్ నుంచి వచ్చాడు. శ్రీమతి గ్రాడ్‌గిండ్ అంత్యక్రియలు యథా విధిగా జరిగాయి. తరువాత మళ్ళీ ఆయన పార్లమెంటు వ్యవహారాలలో నిమగ్నుడై వాడు.

శ్రీమతి స్వార్సిత్ లూసాను అనుక్షణం కనిపెడుతూ ఉన్నది. కాని లూసా గంభీరహృదయం గలది. ఆమె తన అంతర్యాన్ని ఎవరికీ అందనివ్వదు. శ్రీమతి స్వార్సిత్ ఒక్కతెకు మాత్రమే కాదు - లూసాను ఎరిగిన వారెవరూ ఆమె అంతర్యాన్ని అర్థం చేసుకోలేక పోయారు. ఆమెతో ఎంతో స్నేహం నెరపిన జేమ్సు కూడా ఆమె మనస్సును గ్రహించలేక పోయాడు.

రోజులు దొర్లిపోతున్నాయి. బౌందర్‌బై మహాశయుడు ఏదో వ్యవహారం నిమిత్తం గ్రామాంతరం వెళ్ళవలసి వచ్చింది. ఆయన గ్రామాంతరం వెళ్ళడానికి ముందు శ్రీమతి స్వార్సిత్‌ను పిలిచి "నేను గ్రామాంతరం వెళుతున్నాను. నా గృహభారాన్ని నీకు అప్పజెప్పి వెళుతున్నాను" - అన్నాడు.

అందుకు శ్రీమతి స్వార్సిత్ ఇలా అన్నది : "అయ్యా ! తమతో ఒక చిన్నమనవి చేసుకుంటాను. ఇంతవరకు నేను ఎన్నడూ తమరి మాటను జవదాటి ఎరుగను. కాని తమరు గృహంలో ఉన్నప్పుడు నా పరిస్థితికీ తమరు గ్రామాంతరం వెళ్ళిఉన్నప్పుడు నా పరిస్థితికీ ఎంతో తేడా ఉన్నది."

"సరే - అలాగే కానీ. నీకు సమ్మతమైతేనే నీవు ఇంటికివెళ్ళు" - అన్నాడు బౌందర్‌బై.

"అయ్యా - ఏమైనా తమరిఆజ్ఞను నేను శిరసావహించక తప్పదు. కాని నేను తమరి గృహానికి వెళ్ళడం తమ శ్రీమతికి సమ్మతమవుతుందా కాదా అన్న సంశయం నన్ను బాధపెడుతున్నది" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

"నాకు సమ్మతమైనప్పుడు, ఇతరుల సమ్మతితో నీకు అవసరం ఏమిటి?" - అన్నాడు బౌందర్‌బై.

"చిత్తం" అన్నది శ్రీమతి స్వార్సిత్. ఆ తరువాత బౌందర్‌బై మహాశయుడు ప్రయాణమై వెళ్ళాడు.

ఆనాటి సాయంత్రం ఖజానా కార్యాలయాన్ని మూతవెయ్యడానికి మునుపు శ్రీమతి స్వార్సిత్ థామసును పిలిచి ఈ విధంగా ప్రశ్నించింది:

"టామ్, జేమ్సు క్షేమసమాచారాలేవైనా మీకు తెలుస్తున్నవా ?"- అని అడిగింది.

"జేమ్సు కులాసాగానే వున్నాడు" - అన్నాడు థామసు.

"ప్రస్తుతం ఆయన ఎక్కడవుంటా డంటారు ?"

"యార్క్‌షైర్‌లో వుంటాడు"

"జేమ్సు నాకు ఎంతో ఆప్తుడు. త్వరలో ఆయనతోకలిసి మాట్లాడాలని అనుకుంటున్నాను."

"రేపు నేను ఆయన్ను కలుస్తాను."

"మంచిది"

"రేపు నేనూ, మాఅక్కా, అతనూ కలిసి విందు ఆరగించ నున్నాము."

"ఆయన రేపు ఇక్కడికి వస్తున్నారా ?"

"వస్తానని నాతో అన్నారు."

ఆమరుసటి రోజున జేమ్సు వస్తాడని అతన్ని ఆహ్వానించేం దుకు థామసు స్టేషన్‌కి వెళ్ళాడు. కాని ఆరైలుకు జేమ్సు రాలేదు.

థామసు ఇంటికి తిరిగివచ్చి శ్రీమతి స్వార్సిత్‌కు ఈవిషయాన్ని తెలిపాడు.

'అవును. అంతర్యం ఏమిటో నాకు తెలుసు. జేమ్సు యిప్పుడు లూసావద్ద వుండివుంటాడు. అందుచేతనే థామస్‌ను తప్పించుకుని వెళ్ళి వుంటాడు'- అనుకున్నది శ్రీమతి స్వార్సిత్ తనలో తాను.

వెంటనే శ్రీమతి స్వార్సిత్ బౌందర్‌బై మహాశయుని యింటికి ప్రయాణమై వెళ్ళింది. ఆమె బౌందర్‌బై మహాశయుని యిల్లు చేరేసరికి అప్పుడే చీకటిపడుతూవున్నది. దీపాలు పెట్టారు. ఇల్లు నిశ్శబ్దంగా ప్రశాంతంగా వున్నది.

ఆవిడ మెల్లిగా తోటలోకి వెళ్ళింది. రెండు కంఠస్వరాలు వినిపించసాగాయి. ఒక కంఠస్వరం లూసా కంఠస్వరం. మరో కంఠస్వరం జేమ్సు కంఠస్వరం శ్రీమతి స్వార్సిత్ ఒక చెట్టుచాటున నిల్చుని వారి సంభాషణను వినసాగింది.

"ప్రియా! నిన్నువదిలి నేను ఎలా వుండగలను. అందులోనూ నీవు ఒంటిగా వున్నావని తెలిసి నీకు నేను దూరంగా ఎలా వుండగలను?" - అన్నాడు జేమ్సు.

"నీవు దయచేసివెళ్ళు" - అన్నది లూసా.

"ప్రియా నాపొత్తు నీకు గిట్టదా? నాపట్ల ఇంతకాఠిన్యాన్ని ఎందుకు వహిస్తావు?" - అన్నాడు జేమ్సు.

"నన్ను ఒంటిగా వదిలి వెళ్ళు" - అన్నది లూసా తలవాల్చుకుని, జేమ్సు లూసా నడుముచుట్టూ తనచేతిని పెనవేశాడు.

"ప్రియా నన్ను కరుణించవా?" - అన్నాడు.

లూసా అతనివైపు చూచింది. తరువాత జేమ్సు తాను లూసాను ఎంతగాఢంగా ప్రేమించాడో చెప్పసాగాడు.

"ప్రియా! నా బ్రతుకంతా నీకోసం త్యాగంచేస్తున్నాను. నీవు నన్ను కరుణించవా?" - అన్నాడు.

లూసా మెల్లగా అక్కడినుంచి లేచి ఇంటిలోకివెళ్ళింది, వర్షం ధారాపాతంగా కురవసాగింది. శ్రీమతి స్వార్సిత్ చెట్టుచాటున నిల్చొని ఈ దృశ్యాన్నంతా చూస్తోంది. రెండుమూడు నిమిషాలతరువాత లూసా దుస్తులు మార్చుకుని తలకు మఫ్లరుచుట్టుకుని మళ్ళీ తోటలోకివచ్చింది.

"అయిపోయింది. ఇక లూసా లేచిపోతుంది" - అనుకున్నది శ్రీమతి స్వార్సిత్,

లూసా, జేమ్సు రైలుస్టేషన్‌వైపు ప్రయాణం సాగించారు. శ్రీమతి స్వార్సిత్‌కూడా వారిని అనుసరించింది. ముగ్గురూరైలుస్టేషనుకు చేరారు. వర్షం ఇంకా ధారాపాతంగా కురుస్తూనే ఉన్నది.

లూసా స్టేషనులో ఒకమూలన కూచున్నది, రైలు రాకకొరకు ఎదురుచూస్తూ చలికి వణుకుతూ శ్రీమతి స్వార్సిత్ మరోమూలన కూచున్నది.

గంట కొట్టారు. రైలు వచ్చింది.

లూసా ఏ రైలుపెట్టెలో ఎక్కుతుందో అని శ్రీమతి స్వార్సిత్ ఎదురు చూడసాగింది. ప్లాట్‌ఫారమ్‌మీద అటూ ఇటూ పచార్లు చేసింది-

కాని లూసా ఎక్కడా కనిపించలేదు. "లూసా వెళ్ళిపోయింది! చేయి జారిపోయింది!" - అనుకున్నది శ్రీమతి స్వార్స్త్. రైలుకదిలింది.

# 28

పార్లమెంటులో పోట్లాటలు కాట్లాటలు కొంచెం సర్దు మణిగాయి. అందుచేత గ్రాడ్‌గిండ్ మహాశయుడు లండన్‌నుంచి కోక్‌టౌన్ నగరానికి తిరిగివచ్చి కొద్దిరోజులు విశ్రాంతి పుచ్చుకుంటూ ఉన్నారు.

ఆయన తనగదిలో కూర్చుని ఆర్థిక శాస్త్రాన్ని గురించి ఏదో వ్రాసుకుంటూ ఉన్నారు. వెలుపల వర్షం మిన్నూ మన్నూ ఏకంచేస్తూ కురుస్తున్నది. మధ్యమధ్యలో ఉరుములు పెరుపులు.

ఆయన గదితలుపు తెరుచుకున్నపుడు కూడా వర్షం కుంభవృష్టిగా కురుస్తూనే ఉన్నది. గ్రాడ్‌గిండ్ మహాశయుడు తలెత్తిచూశాడు. ఆయనకు ఎదురుగా పెద్దకుమార్తె లూసా నిల్చుని ఉన్నది.

"లూసా, ఇదేమిటమ్మా ఇప్పుడు వచ్చావు!" - అన్నాడు గ్రాడ్‌గిండ్ మహాశయుడు ఆశ్చర్యంతో.

"నాన్నా, మీతో మాట్లాడడానికి వచ్చాను" - అన్నది లూసా.

"ఏమిటి విశేషం? ఈ తుఫానులో ఇలా పడివచ్చావేమిటి? - అని అడిగాడు గ్రాడ్‌గిండ్.

"నాన్నగారూ, మీరు నన్ను కనిపెంచి పెద్దదాన్ని చేశారు."

"అవునమ్మా"

"నాన్నగారూ - నాలాంటి అభాగ్యురాలిని ఈ భూలోకంలో ఎందుకు పడేశారు?"

"అదేమిటమ్మా - అలా అంటున్నావు?"

"నాన్నగారూ - నాకు ఇహలోక జన్మను ప్రసాదించింది మీరు. నాకు సజీవ సమాధిని నిర్మించింది కూడా మీరే."

గ్రాడ్‌గిండ్ మహాశయుడు తలవంచుకున్నాడు.

లూసా మళ్ళీ ఇలా చెప్పసాగింది :

నాన్నగారూ - మీరు నాకు హృదయం ఉన్నదన్న విషయాన్ని మరిచారు. నా మనస్సులోనూ కోరికలు తీగలు సాగుతాయన్న విషయాన్ని విస్మరించారు. నేను ద్వేషించే భర్తకు నన్ను కట్టబెట్టారు."

"అమ్మా ! లూసా !"-

"నన్ను ఒక యంత్రంవంటి వ్యక్తికి బలి ఇచ్చారు."

"అమ్మా ! లూసా, అలా మాట్లాడి నా హృదయాన్ని కలచి వెయ్యకు."

"నన్ను ఒక యంత్రాన్ని అదుపులో పెట్టినట్టు అదుపులో పెట్టారు. నా హృదయాన్ని మీ నియమ నిష్టల మహా చక్రంలో నలిపి వేశారు."

"అమ్మా, లూసా, నీవు ఇంతటి మనో యాతన అనుభవిస్తున్నావని నేను గ్రహించ లేక పోయానమ్మా."

"మీరు గ్రహించక పోవచ్చునాన్నా. కాని నా హృదయంలో ఇన్నాళ్ళనుంచి యమయాతన పొందుతున్నాను, విలయ సంఘర్షణ జరుగుతూ ఉన్నది. నా లోని దేవత్వమంతా యాంత్రిక శక్తికి ఆహుతి అయిపోయింది. నన్ను ఒక యంత్రంలా తయారు చేశారు. నా మనస్సుశిలలా గడ్డకట్టుకుని పోయింది. ఆపరిస్థితిలోనే మీరు ఏ భర్తను వివాహం చేసుకోమని ఆ భర్తను వివాహం చేసుకోడానికి అంగీకరించను. ఆయన నన్ను ప్రేమించాడని ప్రేమించలేదని నాకు తెలుసు. ఆయనను నేను ప్రేమించలేనన్న విషయం కూడా నాకు తెలుసు. కాని మీ మాటను కాదన లేక పోయాను. ఆతరువాత నా వివాహం జరిగింది. నాలో తీవ్రమైన సంఘర్షణ ప్రారంభించింది. రెండు విరుద్ధ శక్తులు ఢీకొనసాగాయి. ఆవిలయ సంఘర్షణతో నేను వేగి పోయాను. కాని ఇంతలో ఒక సంఘటన జరిగింది...."

"ఏమిటి తల్లీ ఆ సంఘటన ?"-

"ఒక వ్యక్తి - యువకుడు - మా ఇంటికి వస్తూ పోతూ ఉండేవాడు అతనెంతో సుకుమార హృదయుడు. నా మనస్సును ఎరిగినవాడు. అతను ఈ నాడు - నా భర్త గ్రామాంతరం వెళ్ళినసమయంలో

నా వద్దకు వచ్చాడు. నన్ను తనతో రమ్మని కోరాడు. ఇప్పుడు కర్తవ్యం ఏమిటి నాన్నగారూ?" - లూసా మెల్లగా తండ్రి వద్దకు వెళ్ళి వెక్కి వెక్కి ఏడవసాగింది, గాడ్ గ్రిండ్ మహాశయుడు లూసాను గట్టిగా పట్టుకున్నాడు. "నాన్నగారూ - నాకు కళ్ళుతిరుగుతున్నవి" - అని లూసా పెద్దగా కేకవేశి మూర్ఛిల్లింది.

లూసా కొంతసేపటికి కళ్ళుతెరిచి చూచింది. తను తన పాత గదిలో మంచంమీద పడుకుని ఉన్నది, అంతా ఒకస్వప్నంలాఉన్నది. తల బరువుగాఉన్నది. కాళ్ళు లాగుతున్నాయి. లూసా ప్రక్కనే చెల్లెలుకూచుని పరిచర్యలు చేస్తూవున్నది. లూసా తన చెల్లెలివైపు కొంతసేపు తదేకదృష్టితోచూచి ఇలా అడిగింది.

'అమ్మా - నన్ను ఇక్కడకి ఎప్పుడు తీసుకుని వచ్చారు :'.

'రాత్రి నీవు మూర్ఛపోయావు అక్కయ్యా - అప్పుడు నిన్ను ఇక్కడికి తీసుకొనివచ్చారు?'

'ఎవరు తీసుకొనివచ్చారు!'

'సిసీ అనుకుంటాను.'

"అలాగా? - సిసీ నన్ను తీసుకొని వచ్చిందని నీకెలా తెలుసు?"

"ఈ రోజు ఉదయం సిసీని నేను ఈగదిలో చూచాను?

"చెల్లీ - జేన్ - నీవు ఎంత మంచిపిల్లవు!" - అంటూ లూసా ముందుకు వంగి చెల్లెలిని ముద్దాడింది.

"అక్కయ్యా, నాన్నని పిలవనా?" - అని అడిగింది జేన్.

"ఊఁ" - అన్నది లూసా.

లూసా చెల్లెలు గాండ్ గ్రిండ్ మహాశయుణ్ణి పిలుచుకుని రావడానికి బైటికి వెళ్ళింది. రెండుమూడు నిమిషాల తరువాత గాడ్ గ్రిండ్ మహాశయుడు గదిలోకి వచ్చాడు. ఆయన ముఖం అదో విధంగా ఉన్నాది. ముఖంలో ఆందోళనా రేఖలు స్పష్టంగా అగుపిస్తున్నాయి. ఆయన గదిలోకివచ్చి లూసా ప్రక్కనే కూచున్నాడు.

"అమ్మాయ్, లూసా" - అని పల్కరించాడు.

లూసా విశాల పాండునయనాలను విస్ఫారితంచేసి ఆయనవైపు చూచింది.

"అమ్మాయ్, లూసా, ఇన్నాళ్ళూ నీ హృదయాన్ని అర్థంచేసుకో లేక పోయాను. నన్ను క్షమించు" - అన్నాడు గ్రాడ్‌గిండ్.

"నాన్నగారూ - మిమ్మల్ని నేను నిందించడం లేదు. నొసటి వ్రాతను ఎవరు తప్పించగలరు?" - అన్నది లూసా.

"అమ్మాయ్ లూసా నీవు అలా అనకు. నన్ను నీవు నిందిస్తే అందులో తప్పేమీలేదు. దోషమంతా నాదే. మేధస్సే ముఖ్యమని అనుకున్నాను. హృదయాన్ని విస్మరించాను, నీ జీవితాన్ని ధ్వంసంచేశాను. కాని ఇకముందు నీ చెల్లి విషయంలో ఇలాటి ద్రోహం చెయ్యను" - అన్నాడు గ్రాడ్‌గిండ్.

"నాన్నగారూ దానైనా సుఖపడనివ్వండి" - అన్నది లూసా.

లూసా మళ్ళీ మెల్లగా కళ్ళుమూసుకున్నది,

గ్రాడ్‌గిండ్ మహాశయుడు మరేమీ మాట్లాడలేదు.

"అమ్మాయ్, లూసా నిద్రపో." అని గదినుంచి బైటికి వెళ్ళాడు.

లూసా మెల్లగా కళ్ళుమూసుకుని పడుకున్నది. రెండుమూడు నిమిషాలు గడిచాయి. గదితలుపులు తెరిచిన చప్పుడయ్యేసరికి లూసా కళ్ళు తెరిచి చూచింది. సిసీ గదిలోకి వచ్చింది.

"అమ్మా - మీకు నిద్రాభంగం కలిగినట్టుగా ఉంది, క్షమించు నేను తమవద్ద కూచోడానికి వచ్చాను" - అన్నది సిసీ.

నాదగ్గర కూచోడం ఎందుకు. చెల్లి జేన్ దగ్గరికి వెళ్ళు. అది నిన్ను విడిచి ఒక్కక్షణం కూడా ఉండలేదు" - అన్నది లూసా.

"మీకు స్వస్థతగా లేదు. ఇక్కడనే ఉంటాను" - అన్నది సిసీ.

"అదేమిటీ? నాకు స్వస్థతగా లేకపోతే నీవేం చెయ్యగలవు?" - అని అడిగింది లూసా.

"అమ్మా అలా అనకండి. నేను ఒక పేదవాని కుమార్తెనే కావచ్చు. కాని నేను మీ మనస్సును అర్థం చేసుకోగలను" - అన్నది సిసీ.

సిసీ లూసా పడుకున్న మంచందగ్గరకు వచ్చింది. లూసా సిసీ చేతిని తనచేతిలోకి తీసుకుని, 'సిసీ - ఇన్నాళ్ళూ నిన్ను నేను అర్థం

చేసుకోలేక పోయాను. నిన్ను దూరంచేసుకున్నాను. నన్ను క్షమించు- అన్నది లూసా.

ఆమెనయనాలు అశ్రుజల సిక్తాలైనాయి.

# 30

జేమ్సు ఒకరోజంతా ఆందోళనతో గడిపాడు. బోనులో పులి లాగ అటూ ఇటూ తిరిగాడు. అతనికేమీ తోచలేదు

అతను ఆ రాత్రంతా కోక్టౌను నగరం పరిసరాలలో లూసా కొరకు వేచివున్నాడు. కాని లూసా రాకపోయేసరికి అతనికి చిరాకు కోపం కలిగాయి. తెల్లవారగానే ఊళ్ళోకివెళ్ళి లూసా గృహానికి వెళ్ళాడు. సేవకులు లూసా ఆమె తండ్రిగారి ఇంటికి వెళ్ళిందని చెప్పారు.

'శ్రీమతి స్వార్సిత్ ఉన్నదా ?' - అని అడిగాడు జేమ్సు.

'ఆమెగారుకూడా లేరు. ఈ ఉదయమే ఎక్కడికో వెళ్ళారు' - అని జవాబు చెప్పారు సేవకులు.

ఈలోగా థామసు అక్కడికి వచ్చాడు. శ్రీమతి స్వార్సిత్‌ను గురించి జేమ్సు థామసునుకూడా ప్రశ్నించాడు.

'ఆమె ఈ వుదయం ఎక్కడికో వెళ్ళింది. ఆమెచేసే పనులన్నీ చాలా చిత్రంగా వుంటాయి'- అన్నాడు థామసు.

'రాత్రంతా నీవు ఎక్కడున్నావు ?' - అని అడిగాడు జేమ్సు.

'ఇక్కడే వున్నాను' - అన్నాడు థామసు.

'మీఅక్కగారు నీకు కనుపించలేదా :' - అని అడిగాడు జేమ్సు.

'ఆవిడ 15 మైళ్ళ దూరంలో అంటే నా కెలా అగుపిస్తుంది ?'- అని అన్నాడు థామసు.

థామసు సమాధానాలు జేమ్సుకు చాలా విచిత్రంగా కనుపిం [redacted] వంతో అక్కడే వ థామసు ఇలా చెప్పడంతో జేమ్సు

నిర్విణ్ణుడై నాడు. అక్కడినుంచి వెంటనే తిరిగి వెళదామని అను కున్నాడు. కాని వెంటనే అతని మనస్సులో మరో నిశ్చయం కలిగింది. అక్కడేవుండి లూసా విషయం తేల్చుకోవలెనని అనుకున్నాడు జేమ్సు. టేబిల్‌పైవున్న వార్తాపత్రికను తీసుకుని చదువుతూ కూచు న్నాడు. కొంతసేపైన తరువాత ఒకసేవకుడు లోనికివచ్చి, 'అయ్యా, జేమ్సు అనే పేరుగల వ్యక్తి తమరేనని అనుకుంటాను' - అన్నాడు.

"అవును. నాతో నీకు పనిఏమిటి ?" - అని అడిగాడు జేమ్సు.

"తమరిని చూడడంకోసం ఒక యువతి వచ్చి ఉన్నది" - అన్నాడు సేవకుడు.

"ఎవరా యువతి ? వెంటనే లోనికి రమ్మను" - అన్నాడు జేమ్సు.

రెండు నిమిషాల తరువాత సేవకుడు ఒకయువతిని లోనికి ప్రవేశపెట్టాడు. ఆయువతి సిసీ. సిసీ లోనికి రాగానే జేమ్స్‌కు విన మ్రంగా అభివాదంచేసి, "జేమ్స్ అనే వ్యక్తి తమరే అని భావిస్తాను" - అన్నది.

"అవును" - అన్నాడు జేమ్స్.

"ఇప్పుడు నేను మీతో ఒక విషయాన్ని మాట్లాడే ఉద్దేశంతో వచ్చా" - అన్నది సిసీ.

"మంచిది."

ఈ విషయాన్ని మీరు దయతో రహస్యంగా ఉంచుతారని ఆశిస్తాను ?

"అలాగే."

"ఇప్పుడు నేను ఎక్కడినుంచి వస్తూ ఉన్నానో మీరు ఊహించ గలరనుకుంటాను."

"నేను 24 గంటలనుంచి ఒక స్త్రీ కొరకు వేచి ఉన్నాను. బహుశా మీరు ఆస్త్రీ వద్దనుంచి వచ్చి ఉండవచ్చు."

"అవును. సరిగ్గా ఊహించారు."

"ఇప్పుడు ఆస్త్రీ ఎక్కడున్నది ?"-

"ఆమె తన తండ్రిగారి ఇంటిలో ఉన్నది."

"అలాగా."

"పోయిన రాత్రి ఆమె తన తండ్రిగారి ఇంటికి వచ్చింది. నేను కూడా ఆమె తండ్రిగారి ఇంటిలోనే ఉంటాను. ఆమె మీతో ఒక విషయం చెప్పిరమ్మని నన్ను ఇక్కడకు పంపింది. ఇక మీరు ఎన్నడూ ఆమెను చూడలేరన్న విషయాన్ని మీతో తెలిపిరమ్మన్నది."

సిసీ ఇలా అనగానే జేమ్స్ దీర్ఘంగా నిశ్వసించాడు. రెండు మూడు నిమిషాలు స్తబ్ధుడై శిలాప్రతిమవలె కూచున్నాడు. తరువాత తరువాత కొంచెం తేరుకుని, "నిజంగా ఆస్త్రీ అలా అన్నదా" నీ మాటలను నేను నమ్మ వచ్చునా ?" - అన్నాడు.

"ముమ్మాటికీ నిజం. ఆమె మనస్సును మీరు గ్రహించలేరు" - అన్నది సిసీ.

జేమ్స్ మరేమీ మాట్లాడలేదు. సిసీ వైపు తదేకదృష్టితో చూస్తూ ప్రతిమవలె నిల్చున్నాడు. కొంతసేపటికి మళ్లా ఇలా ప్రశ్నించాడు.

"ఇంకా నీవు చెప్పవలసింది ఏమైనా ఉన్నదా ?"-అని ప్రశ్నించాడు.

సిసీ మళ్ళీ ఇలా చెప్పసాగింది: "మీ శ్రేయస్సును లూసా శ్రేయస్సునూ కోరి నేను మీతో ఒక విన్నపము చెయ్య దలిచాను. మీరు తక్షణం ఇక్కడినుంచి వెళ్ళిపోవడం మంచిదని నా ఉద్దేశం"- అన్నది.

సిసీ ఇలా అనేసరికి జేమ్స్ చకితుడైనాడు.

"అమ్మాయ్ - నిన్ను చూస్తే నీవు చాలా సాహసికురాలివలె అగుపిస్తున్నావు. నీ పేరేమిటి ?" - అని అడిగాడు.

"నా పేరు సిసీ. నేను పేద ఇంటి పిల్లను. గాద్‌గ్రింద్‌గారు నన్ను పెంచారు. లూసా నాకు సోదరివంటిది" - అన్నది సిసీ.

సిసీ మరేమీ మాట్లాడ లేదు.

"మరి వస్తాను. సెలవు" - అంటూ వెళ్ళిపోయింది.

జేమ్స్ ఆనాటి సాయంత్రమే తన పెట్టె బేడసర్దుకుని వెళ్ళాడు. కొన్నాళ్ళవరకు తాను తిరిగి రానని బౌండర్‌బైకి ఒక ఉత్తరం వ్రాసి సేవకుడికి ఇచ్చి వెళ్ళాడు.

# 31

లూసా కోక్‌టౌన్ నగరానికి ప్రయాణమైన నాడే శ్రీమతి స్పార్సిత్ సరాసరి లండన్ నగరానికి వెళ్ళింది. జేమ్స్‌స్ట్రీట్‌లో బస చేసి ఉన్న బౌండర్‌బై మహాశయుణ్ణి చూడగానే వెక్కి-వెక్కి ఏడుస్తూ, "ఇంకేముంది? లూసా మన చేతులు జారిపోయింది"-అని ఆయనతో అన్నది.

బౌండర్‌బై మహాశయునికి శ్రీమతి స్పార్సిత్ మాటలలోని అంతర్యం ఏమిటో మొదట్లో బోధపడలేదు. ఆయన ఆమెను విమర్శింప చెయ్యడానికి ఎంతో యత్నించాడు. ఆమె కొంచెం విమర్శించిన తరువాత తాను చూచిన కథంతా ఆయనకు చెప్పింది.

"లూసా మీకు తీరని ద్రోహం చేసింది" - అన్నది శ్రీమతి స్పార్సిత్.

స్పార్సిత్ చెప్పిన కథంతా వినగానే బౌండర్‌బై ఉగ్రుడైనాడు.

"లూసా అంతు చూస్తాను" - అని ఆయన సింహం గర్జించినట్లుగా గర్జించాడు.

ఆయన వెంటనే శ్రీమతి స్పార్సిత్‌ను తోడుగా తీసుకుని గ్రాడ్‌గ్రిండ్ మహాశయుని గృహానికి వెళ్ళాడు. గ్రాడ్‌గ్రిండ్ గదిలో అడుగు పెట్టి, "గ్రాడ్‌గ్రిండ్ - మీ కుటుంబంలో ఒకరివల్ల మాకు తీరనిద్రోహం జరిగింది. అవుసరమవుతే మీరు ఈమెను - శ్రీమతి స్పార్సిత్‌ను అడగవచ్చు" - అన్నాడు.

"మీరు అడగనున్న విషయం ఏమిటో నాకు తెలుసు. ఆ విషయాన్ని గురించి మీకొకలేఖ కూడా వ్రాశాను. ఆ లేఖ మీకు అంది ఉండక పోవచ్చు" - అన్నాడు గ్రాడ్‌గ్రిండ్.

"ఉత్తరాలవిషయం చర్చించడానికి ఇది సమయంకాదు. ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా మనం మాట్లాడుకోడం మంచిది. మీ కుమార్తెకు జేమ్స్‌కు జరిగిన సంభాషణ శ్రీమతి స్పార్సిత్ తాను స్వయంగా విన్నది. ఆ తరువాత జరిగిన ఉదంతం మీకు తెలిసినదై ఉంటుంది.

ఇప్పుడు మీ కుమార్తె ఎక్కడున్నదో మీకు తెలుసునా?" - అన్నాడు బౌందర్‌బై,

"ఇప్పుడు నాకుమార్తె ఎక్కడ ఉందని మీ అభిప్రాయం?"

"ఏమో - ఆ విషయం నాకెలా తెలుస్తుంది?" -

"ఇప్పుడు నాకుమార్తె ఇక్కడే ఉన్నది "

"ఇక్కడా?" ఆశ్చర్యంతో అడిగాడు బౌందర్‌బై.

"అవును ఇప్పుడు నా కుమార్తె ఇక్కడే ఉన్నది. జేమ్స్‌తో సంభాషణ జరిగిన వెంటనే ఆమె రక్షణకొరకు వచ్చింది. మీరు తొంద రలో అనేక మాటలు మాట్లాడారు. మీ మాటలను మీరు ఉపసంహ. రించుకోవలసి ఉంటుంది" - అన్నాడు గ్రాడ్‌గ్రింద్,

బౌందర్‌బై మహాశయుడు జవాబు చెప్పలేకపోయాడు. గ్రాడ్ గ్రింద్ ఇలా అనేసరికి ఒక క్షణపాటు స్తంభీభూతుడైనాడు. తరువాత శ్రీమతి స్పార్సిత్‌వైపు తిరిగి, 'ఇప్పుడు మీరేమంటారు? కట్టుకథ మోసు కుని, దేశమంతా ప్రచారంచేస్తూ పర్యటించినందుకు మీకేం శిక్ష విధిం చాలి?' - అన్నాడు బౌందర్‌బై.

శ్రీమతి స్పార్సిత్ ఏమీ సమాధానం చెప్పలేక నేలవంక చూస్తూ నిల్చున్నది.

"ఇక మీరు ఇంటికి వెళ్ళండి. వాకిట్లో గుర్రపుబగ్గీ వున్నది" - అన్నాడు బౌందర్‌బై.

బౌందర్‌బై ఇలా అనగానే శ్రీమతి స్పార్సిత్ మారుమాట్లాడ కుండా బైటకి వెళ్ళిపోయింది. బౌందర్‌బై శ్రీమతి స్పార్సిత్‌ను వాకిట్లో వదిలిపెట్టివచ్చి గ్రింద్‌తో ఇలా అన్నాడు. "అయిందేదో అయిపోయింది, కాని అపనిందమాత్రం వచ్చింది. అపనిందను భరించే స్వభావంకాదు నాది. గతించినదానికి చింతించను నేను - ఈ విషయాన్ని గురించి ఇక సిద్ధాంతాలు చెయ్యడంకూడా నా గౌరవానికి భంగకరం. అందుచేత నేను ఒకనిశ్చయానికి వచ్చాను. ఆ నిశ్చ యాన్ని మీకు తెలుపుతున్నాను ఇకముందు నేను లూసాను స్వీకరించ దలుచుకోలేదు. భవిష్యత్తులో మీ అమ్మాయి యోగక్షేమాల భారాన్ని మీరే వహించండి" - అన్నాడు బౌందర్‌బై.

"మీరు తొందరపడి మాట్లాడుతున్నారు. మీరు ఈ నిశ్చయానికి రావడానికి ముందు ఒకసారి ముందువెనుకలు ఆలోచించడం మంచిది" అన్నాడు గ్రిండ్.

"నేను ఆలోచించకుండా ఒకనిశ్చయానికి రాను. నా నిశ్చయాన్ని మీకు తెలిపాను. ఇక నేను చెప్పవలసింది ఏమీలేదు" - అన్నాడు బౌండర్‌బై. ఆతరువాత బౌండర్‌బై ఇంటికి వెళ్ళాడు.

ఆ మరుసటి రోజున బౌండర్‌బై తనభార్య సామాన్లన్నిటినీ సేవకులచేత గ్రిండ్ ఇంటికిపంపి బ్రహ్మచర్య జీవితాన్ని ప్రారంభించాడు.

# 32

బౌండర్‌బై మహాశయుడు ఎంతో ధైర్య సాహసాలు గల వ్యక్తి. తన జీవితంలో ఇన్ని విధాలైన పరిణామాలు జరిగినప్పటికి ఆయన ఎంత మాత్రం చలించలేదు. ఆయన ఎంతో శ్రద్ధతో తన వ్యాపారాన్ని నిర్వహించ సాగాడు.

ఒకనాటి ఉదయం ఫాక్టరీ గంటలు మ్రోగుతున్నాయి. కూలీలంతా ఫాక్టరీముందున్న ఆవరణలో పోగైనారు. స్లాక్‌బ్రిడ్జ్ అనే పేరు గల ఉపన్యాసకుడు ఇలా మాట్లాడుతూ ఉన్నాడు :

"సోదరులారా ! కార్మికులారా ! ఆద్రోహి ఏంచేశాడో చూశారా ఆద్రోహి ఎవరో మీ అందరికీ తెలుసు. అతన్ని ఇదివరకు మనం గెంటివేశాము, అయినా అతని పీడ మనల్ని వదలకుండా ఉన్నది. ఆద్రోహి స్టీఫెన్. తన దుశ్చర్యల వల్ల మనకు మన తరువాత తరాల వారికి కూడా తలవంపులుగా ఉన్నది'' - స్లాక్‌బ్రిడ్జ్ ప్రసంగాన్ని హర్షిస్తూ కార్మికులంతా కరతాళ ధ్వనులు చేశారు. సమావేశం తరువాత కూలీలు ఇళ్ళకు వెడుతున్నప్పుడు లూసా మేడపైనుంచి వారిని

చూచింది. సిసీని పిలిచి, "అదేమిటీ? క్రిందనుంచి రభస వినిపిస్తూ ఉన్నది?" అని అడిగింది.

"కూలీల జాతరలాగా ఉన్నదమ్మా" అన్నది సిసీ.

లూసా మరేమీ మాట్లాడలేదు. రెండుమూడు నిమిషాల తరువాత అక్కడికి బౌండర్బై మహాశయుడు వచ్చాడు. అయనతోపాటు థామస్ రాషెల్కూడా వచ్చారు. బౌండర్బై మహాశయుడు లూసాతో మాట్లాడవలసిన అవసరం ఉన్నదని సిసీచేత మేడపైకి కబురు పంపాడు.

సిసీమేడపైకి వచ్చి "అమ్మా మీకొరకు బౌండర్బై మహాశయుడు వచ్చారు. ఆయనతోపాటు తమ తమ్ముడుగారు రాసెల్ అన్న స్త్రీకూడా వచ్చారు. వారు మీతో మాట్లాడవలెనని అభిలషిస్తున్నారు" అన్నది.

సిసీ ఈమాట చెప్పినప్పుడు గింద్ మహాశయుడుకూడా అక్కడే ఉన్నాడు.

"నాన్నగారూ! వారిని నేను చూడడానికి నిరాకరిచడం సబబుగా ఉండదు" అన్నది లూసా,

"సరే, ఆలాగేనమ్మా" అన్నాడు గింద్.

సిసీ తరువాత క్రిందికి వెళ్ళి వారిని మేడపైకి తీసుకునివచ్చింది.

బౌండర్బై మహాశయుడు గదిలో అడుగు పెట్టగానే భార్యతో యిలా అన్నాడు: 'శ్రీమతీ - మీ విశ్రాంతికి భంగం కలిగించవలసి వచ్చినందుకు క్షమించండి. ఇప్పుడు మీతో ఒక అవసరమైన విషయాన్ని మాట్లాడడానికి వచ్చాము. రాషెల్ మీతో ఆ విషయాన్ని మాట్లాడగలదు'—

తరువాత రాషెల్ లూసావైపు తిరిగి యిలా అన్నది:

'అమ్మగారూ మీరు యింతకుపూర్వం ఒకసారి నన్ను చూచి వున్నారు. మీకు జ్ఞప్తి వున్నదని భావిస్తాను' - అన్నది;

'అవును' - అన్నది లూసా.

"తమరు ఎప్పుడు ఎక్కడ ఏ విధంగా నన్ను కలుసుకున్నదీ దయచేసి బౌందర్‌బై మహాశయునికి తెలుపగలరా ?' - అని అడిగింది రాషెల్. స్టీఫెన్‌గృహంలో నిన్ను నేను చూచాను. అప్పుడు మా తమ్ముడు కూడా నావెంట వున్నాడు. మరో వృద్ధ స్త్రీ కూడా అప్పుడు అక్కడ ఉన్నది' - అన్నది లూసా.

"ఈ విషయం నీవు నాకు ఎందుకు చెప్పలేదు ?" - అని బౌందర్‌బై థామస్‌ను అడిగాడు.

"ఈ విషయాన్ని నేను ఎవరితోనూ చెప్పనని నేను మా అక్కతో వాగ్దానం చేసాను" - అన్నాడు థామస్.

తరువాత ఒకక్షణం ఆగి రాషెల్ లూసాను ఇలా అడిగింది: "అమ్మగారూ - మీరు అర్ధరాత్రి సమయంలో మా గృహానికి ఎందుకు వచ్చారో దయచేసి బౌందర్‌బై మహాశయునికి తెలుపగలరా ?" -

"స్టీఫెన్‌ను ఫాక్టరీ పనినుంచి తొలిగించారు. అందుచేత అతనిపై సానుభూతి కలిగి స్టీఫెన్ ఇంటికి వచ్చాను" - అన్నది లూసా.

"మీరు అతనికి ధనం ఇచ్చారా ?" - అని అడిగింది రాషెల్.

"ధనం ఇస్తానన్నాను, కాని అతను నిరాకరించాడు. చివరకు ఎంతో బ్రతిమాలగా రెండు పౌండ్లుమాత్రం పుచ్చుకున్నాడు" - అన్నది లూసా.

"అమ్మగారూ - స్టీఫెన్ ఎంతనిజాయితీగల వ్యక్తిఅన్న విషయం మీకు తెలుసునుకదా - ఇప్పుడు అతనొక పచ్చిదొంగ అని ఊరంతా చెప్పిన నోట చెప్పకుండా చెబుతున్నారు" - అని రాషెల్ వెక్కివెక్కి ఏడవసాగింది.

"అయ్యో పాపం ! ఎంత అపనింద !" - అన్నది లూసా.

"అతనికి ఖజానాలో జరిగిన దోపిడికి సంబంధం ఉన్నదని కరపత్రాలు కూడా వ్రాయించి కూలీలలో కొందరు అచ్చొత్తించారు. స్టీఫెన్‌కు పోస్టుద్వారా ఈ విషయాన్ని తెలియచేశాను. నేడో రేపో అతను రావచ్చు" - అన్నది రాషెల్.

లూసా మరేమీ మాట్లాడలేదు.

"అయ్యో పాపం !" అని మాత్రమే అనగలిగింది.

# 33

రెండురోజులు గడిచాయి. రాషెల్ స్టీఫెన్ కొరకు ఎదురు చూస్తూ ఉన్నది. కాని స్టీపెన్ వచ్చినజాడలేదు.

సిసీ ప్రతినిత్యం రాత్రివేళల రాషెల్ ఇంటికి వెళ్ళి వస్తూ ఉన్నది. రాషెల్ క్షేమసమాచారములను విచారించి వస్తున్నది.

ఒకరోజున వారు ఇరువురూ స్టీపెన్‌ను గురించి ఇలా సంభాషించుకో సాగారు :

"స్టీపెన్ ఇంకారాలేదు. ఎందుచేతనోగాని నాకేదో భయంగా ఉన్నది" అన్నది రాషెల్,

"అతను వచ్చితీరుతాడు. మీరేమీ భయపడకండి" అన్నది సిసీ.

"ఒకవేళ ఎవరైనా అతన్ని హత్యచేసిఉంటే ఏంకాను ?" అన్నది రాషెల్.

రాషెల్ హత్య అనేమాట అనేసరికి సిసీ గజగజమని వణికింది.

"అలా లేనిపోని భయాలు పెట్టుకోకండి. దోవలో అతనికి అస్వస్థత కలిగివుండవచ్చు. అందుచేత అతను విశ్రాంతి తీసుకుంటూ ఉండవచ్చు" - అన్నది సిసీ.

"రేపైనా అతను తప్పక వస్తాడని ఆశిస్తాను. భగవంతుడు అతన్ని అనుగ్రహిస్తాడు గాక" - అన్నది రాషెల్.

ఆ తరువాత సిసీని యింటివద్ద వదిలిపెట్టడానికి రాషెల్ బయలు దేరింది. ఇరువురూ వీధిలో వస్తూవుండగా గుర్రపుబగ్గీలో వస్తున్న శ్రీమతి స్పార్సిత్ వారికి ఎదురైంది. వారిని చూడగానే శ్రీమతి స్పార్సిల్ తన గుర్రపుబగ్గీని ఆపుచేసింది. శ్రీమతి స్పార్సిత్ గుర్రపు బగ్గీలోనుంచి క్రిందికి దిగింది. ఆవిడతోపాటు మరో వృద్ధురాలు కూడా గుర్రపుబగ్గీలోనుంచి దిగింది.

గుర్రపు బగ్గీ దిగిన వెంటనే శ్రీమతి స్పార్సిత్ రాషెల్‌తో, "రాషెల్, నీవు వెంటనే బౌందర్‌బై మహాశయుని పిలుచుకుని రాగ లవా ? ఈస్త్రీ శ్రీమతి పెగ్లర్" - అన్నది. రాషెల్ బౌందర్‌బై మహాశయుని వెంటనే పిలుచుకుని వచ్చింది. ఇలా హఠాత్తుగా తనను

శ్రీమతి స్వార్సిత్ పిలిపించడం బౌందర్‌బై మహాశయునికి ఎంతో ఆశ్చర్యకరంగా తోచింది. బౌందర్‌బై మహాశయుడు శ్రీమతి స్వార్సిత్ వైపు చూచి, "ఇలా నన్ను వేళకాని వేళలో పిలిపించారు కారణం?" - అని ప్రశ్నించాడు.

"అయ్యా మీరు వెదుకుతూఉన్న స్త్రీని మీ వద్దకు తెచ్చాను. ఈవిడ శ్రీమతి పెగ్లర్. మీకు తెలిసే ఉంటుంది" - అన్నది శ్రీమతి స్వార్సిత్.

"మీరు అనవసరంగా నా వ్యక్తిగత విషయాలలో జోక్యం కలగ జేసుకుంటున్నారు" అని గర్జించాడు బౌందర్‌బై,

"నాయనా, బౌందర్‌బై, నేనుకూడా ఈ విషయాన్ని ఈమెకు చెప్పాను. కాని ఈవిడ నా మాటలు సరకు చెయ్యలేదు." అన్నది వృద్ధురాలు శ్రీమతి పెగ్లర్.

వృద్ధురాలైన శ్రీమతి పెగ్లర్ ఇలా అనేసరికి బౌందర్‌బై మహాశయుడు ఆమెవంక తీక్ష్ణంగా చూచాడు.

"శ్రీమతి స్వార్సిత్ మిమ్మల్ని నావద్దకు తీసుకుని రావడానికి మిమ్మల్ని ఒత్తిడిచేశి ఉండవచ్చు, కాని బాల్యంలోనే కన్నకొడుకుపట్ల ఘాతుకంగా ప్రవర్తించిన నీవు వృద్ధాప్యంలో మళ్ళీ ఆ కొడుకు నీడకే రావడం లజ్జాకరమైన విషయం కాదా?" అన్నాడు బౌందర్‌బై.

"కన్నకొడుకుపట్ల నేను ఘాతుకంగా ప్రవర్తించానా?" - అశ్చర్యంతో అడిగింది ఆ వృద్ధురాలు.

"అవును. ముక్కుపచ్చలారని బాలుణ్ణి త్రాగుబోతైన మాతామహురాలి వద్ద వదిలి వెళ్ళావు" - అన్నాడు బౌందర్‌బై.

"నేను నా కన్నకొడుకును పరిత్యజించానా? అన్నీ ఊహాకల్పనలు"—

"మీరు మీ కన్నకొడుకును వీధులకు అప్పగించ లేదంటారా?"-

"అలాటి పని ఎన్నడూ జరుగలేదు. నీవు నీ తల్లిని అపార్థం చేసుకుంటున్నావు" - అన్నది ఆ వృద్ధురాలు.

బౌండర్‌బై మహాశయుడు మరేమీ మాట్లాడలేదు. ఆ వృద్ధురాలి కండ్లలోకి తదేకదృష్టితో చూస్తూ నిల్చున్నాడు. ఆమె తన కన్నతల్లి అన్న విషయాన్ని, ఆమె మాతృ హృదయాన్ని గుర్తించాడు.

# 34

ఆదివారం. గాలి చల్లగా వీస్తోంది. సిసీ రాషెల్. పొలాల్లోకి షికారు వెళ్ళారు.

ప్రొద్దెక్కే వరకూ పొలాల్లోనే ఉన్నారు. సిసీముందు నడుస్తూ ఉన్నది. రాషెల్ ఆమె వెనకాలే నడుస్తూఉన్నది. కొంతదూరం వెళ్ళిన తరువాత సిసీకి అడుగుజాడలు అగుపించాయి.

సిసీ రాషెల్‌ను పిలిచింది. "రాషెల్ ఇటురా. ఇక్కడ ఎవరివో అడుగులు కనుపిస్తూ ఉన్నవి" అన్నది.

రాషెల్ సిసీవద్దకు వెళ్ళడానికి అడుగువెయ్యగా ఆవిడ కాలికి ఏదో తగిలినట్లయింది.

రాషెల్ ఆ వస్తువువైపు పరికించి చూచింది. అది ఓక హేటు.

"సిసీ - ఇక్కడ గడ్డిలో ఒక హేటు పడిఉన్నది" - అన్నది రాషెల్.

సిసీ వెంటనే రాషెల్‌వద్దకు వచ్చింది - క్రింద గడ్డిలో పడిఉన్న హేటును ఎత్తిచూచింది. హేటులోపల "స్టీఫెన్" - అన్న అక్షరాలు కుట్టబడి ఉన్నది.

హేటులో "స్టీఫెన్" అన్న పేరును చూడగానే రాషెల్ "అయ్యో, భగవంతుడా ఏపాపం ఎరుగనివాణ్ణి హత్య చేశారు. అనుకున్నంత పని అయింది -" అని వెక్కివెక్కి ఏడవసాగింది.

"రాషెల్, నీవు అనవసరంగా అధైర్యపడకు. స్టీఫెన్ హత్య చెయ్యబడ్డాడని మనం ఎలా ఊహించగలం. మనం స్టీఫెన్ కొరకు వెదుకుదాం పద" - అని సిసీ రాషెల్‌ను ఓదార్చసాగింది.

తరువాత ఇరువురూ ఆ విరామయమైన మైదానంలో స్టీఫెన్ కొరకు వెదుకసాగారు. వారు కొంతదూరం వెళ్ళగా వారికి ఒక గుంట అగుపించింది. ఆ గుంటలోనుంచి ఏవిధమైన శబ్దమూ వినిపించడం లేదు. సిసీ గుంటలోకి తొంగిచూచింది. "స్టీఫెన్ ! స్టీఫెన్" అని పిలిచింది. కాని మారు జవాబులేదు.

తరువాత వారు మళ్ళీ స్టీఫెన్ కొరకు అన్వేషణ సాగించారు. నడిచి నడిచి చివరకు ఒక ఇంజను షెడ్ వద్దకు వచ్చారు. ఒక చాప మీద పడుకుని నిద్రిస్తున్న యిరువురు వ్యక్తులు వారికి అగుపించారు. వీరిలో ఒక వ్యక్తి బాగా త్రాగి నిద్రిస్తున్నాడు, సిసీ, రాషెల్, ఆ వ్యక్తులిరువురిని నిద్రలేపారు. వారిని యిరువురినీ తీసుకుని మరికొంతదూరం వెళ్ళారు. అక్కడ ఒక గుర్రం కట్టివేసి వున్నది. రాషెల్ యిరువురిలోనూ ఒక వ్యక్తిని పిలిచి లూసా కొరకు కబురుపంపింది.

ఈలోగా ఊరు ఊరంతా అక్కడ పోగుకావడం మొదలెట్టింది. త్రాళ్ళు, లాంతర్లూ, పలుగులూ తీసుకుని జనం అక్కడికి వచ్చారు. కొంతసేపుకు, బౌండర్బై, లూసా, థామస్ మొదలైనవారు కూడా అక్కడికి వచ్చారు.

వారంతా కలసి ఆ గుంటదగ్గరకు వచ్చారు. గుంటలోకి ఒకపెద్ద బకెట్టునుదించి ఒక వ్యక్తిని బైటికి లాగారు. ఆ వ్యక్తి బైట పడగానే రాషెల్ డాక్టర్వద్దకువెళ్ళి "డాక్టర్గారూ - బ్రతికిఉన్నాడంటారా ?" అని ఎంతో ఆతురతతో అడిగింది.

"బ్రతికే ఉన్నాడు ప్రమాదంలేదు" అన్నాడు వైద్యుడు.

ఆ వ్యక్తిని గరికపై పడుకోబెట్టారు. అతను రాషెల్ను దగ్గరకు పిలిచి, "ప్రియా, రాషెల్ - సుఖంగా ఉన్నావా ?" అని చిరునవ్వు నవ్వాడు.

రాషెల్ అతని చేతిని తన చేతిలోకి తీసుకుని, "ప్రియా ! స్టీఫెన్ నీకిప్పుడు శరీరంలో ఎలాఉంది ?" అన్నది.

"ఇప్పుడిక ప్రమాదంలేదు. గండం గడిచింది" అన్నాడు స్టీపెను తరువాత స్టీపెన్‌సు ఇంటికి తీసుకుని వెళ్ళారు.

# 35

ఆ మరుసటి రోజు ఉదయం గ్రాడ్‌గింద్ మహాశయుడు ఉదయాన్నే టీ సేవిస్తూ లూసాను, సిసీని తన గదిలోకి పిలిపించాడు.

లూసా గదిలోకి వచ్చి కూచోగానే ఆయన యిలా అన్నాడు :

"అమ్మాయ్ లూసా - చూచావా - నీవు స్టీఫెన్ గృహానికి ఆనాటి రాత్రి వెళ్ళినప్పుడు నీ తమ్ముడు ఖజానాలో దోపిడికి పథకం వేశాడు"-

"కావచ్చు నాన్నా. అప్పుడు వాడికి డబ్బుతో కొంత అవసరం కూడా వున్నది. తమ్ముడూ, స్టీఫెన్ ఒక గదిలోకి వెళ్ళి మాట్లాడుకోడం కూడా నేను చూచాను" - అన్నది లూసా.

"ఇప్పుడు వాడు మన చేతులు దాటిపోయాడు. స్టీఫెన్ అగుపించగానే వాడు ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఇప్పుడు మనం వాణ్ణి ఎలా కనుక్కోగలం ?" - అన్నాడు గ్రాడ్‌గింద్.

ప్రమాదంనుంచి తప్పించడానికి అతన్ని నేనే పంపాను. నిన్న వార్తా పత్రికలో మా నాన్నగారి సర్కస్ ఫలానా పట్టణంలో వున్నదని నేను చదివాను, థామస్‌ను అక్కడికి వెళ్ళి శరణ్యం తీసుకోవలసిందని చెప్పాను" - అన్నది సిసీ.

గ్రాడ్‌గింద్ మహాశయుడు మరేమీ మాట్లాడలేదు.

లూసా సిసీవైపు కృతజ్ఞతా పూర్వకమైన దృష్టిని ప్రసరింపచేసింది.

"ఆ తరువాత అక్కడనుంచి థామస్ విదేశాలకు వెళ్ళే అవకాశం కూడా ఉన్నది" - అన్నది సిసీ.

"ఎంతసాయం చేశావు తల్లీ వాడు విదేశాలకు వెళ్ళేలోగా వాణ్ణి, ఒకమాటు చూచిరావాలి. రేపే మీనాన్నగారి సర్కస్ బసచేసి ఉన్న ఊరికి "ప్రయాణం అవుదాం" - అన్నాడు గింద్.

ఆ మరుసటిరోజున గింద్ మహాశయుడు కుమార్తె లూసాను, ఏసీని తీసుకుని, స్లీరీ సర్కస్ బసచేసిఉన్న పట్టణానికి వెళ్ళారు. వారు స్లీరీ సర్కస్‌ఉన్న బట్టణానికి వెళ్ళేసరికి బాగా ప్రొద్దెక్కింది. వారు స్లీరీ గృహానికి వెళ్లారు.

స్లీరీ వారిని ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించి ఆతిధ్యమిచ్చాడు. థామస్‌కూడా అక్కడే ఉన్నాడు. తండ్రిగారిని చూడగానేసిగ్గుతో తల వంచుకుని నిల్చున్నాడు.

తండ్రిథామస్‌ను దగ్గరకు పిలిచి, "బాబూ ! ఎంతపనిచేశావు ?" అన్నాడు. థామస్ సమాధానంచెప్పక మాట్లాడకుండా నిల్చున్నాడు.

ఒక క్షణంఆగి థామస్ ఇలాఅన్నాడు: "నాన్నగారూ నన్ను క్షమించండి. గతించినదేదో గతించిపోయింది. నేను చేసిన పాపానికి పరిహారంగానే నేను ఇప్పుడు దూరదేశాలకు వెడుతున్నాను. ఇక నన్ను మరిచిపోండి" - అన్నాడు థామస్.

తమ్ముడు ఇలా అనగానే లూసా కండ్లలో నీళ్ళు తిరిగాయి. థామస్, లూసావద్దకు వచ్చి ఆమెను పసిపిల్లవానివలె కౌగిలించుకుని వెక్కివెక్కి ఏడవసాగాడు. లూసా మరేమీ మాట్లాడలేదు.

ఆ మరుసటి రోజున వారు థామస్‌వద్ద స్లీరీవద్ద సెలవు తీసుకుని మళ్ళీ యిల్లు చేరారు. ఇంతదూరం ప్రయాణం చేసిన తరువాత లూసా బాగా అలసిపోయింది. ఆవిడ మానసికంగా కూడా ఎంతో అలసిపోయింది. జీవితం ఆవిడకు ఒక అర్ధరహితమైన కలవలె అగుపించసాగింది. తమ్ముడు దూరదేశం వెళ్ళాడు. తండ్రిగారి సిద్ధాంతాలన్నీ పేకమేడ కూలినట్లు కూలిపోయాయి. ఎన్నో అనుభవాలు ఆవేదనలు గడిచిపోయాయి !

రాషెల్ మళ్ళీ మామూలుగా కూలిపని చేసుకుంటూ ఉన్నది. ప్లీపెన్ తాగుమోతు భార్యతో వేగుతున్నాడు.

తనుకూడా నేడో రేపో బొందర్ బై మహాశయుని ఇంటికి వెళ్ళాలి.

రోజులు గడుస్తున్నాయి. తనకు పిల్లలు కలుగుతారు. సిసీకి కూడా వివాహం జరుగుతుంది. సిసీకికూడా పిల్లలు కలుగుతారు. వారి జీవితాలు మరి ఎలా సాగుతాయో. లూసా ఇలా ఊహించుకో సాగింది. కాని ఎంతకూ ఆవిడకు ఆలోచన తెగలేదు.

ఈ జీవితం ఏమిటి ?

ఈ జీవితంలో అనుభవాలకు అర్థం ఏమిటి ? అన్న ప్రశ్న ప్రశ్నగానే నిలిచిపోయింది.

[ స మా ప్త ము ]